# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

ఏప్రిల్ - 1985

సంపుటము : 62 సంచిక : 4

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

సంస్థాపకులు

[illegible] శ్రీ [illegible]



# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1985



ముఖచిత్రం :

ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ వెంపటి చిన సత్యం



# ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ వెంపటి చిన సత్యం

శ్రీ జి. ఎ. జి.

" తధిణ్ణాం ధిణ్ణాం ధిణ
ధణణ ధణధణ కిణణ కిణకిణ
ధిక్కిటతక ధిద్దీక్కిటతక
ధరికిటతక ధరికిటతకతాం
తెహద త్తతాం
ధాకిణాం తరిదేకిణాంతరి

ఫాలనేత్రుని పాదపద్మము
చాల నమ్మిన స్వామి నీవని
తెలిసి మాన్యులు దొరలు మంత్రులు

దివ్య సింహాసనముపై నీ
అరుదుగా పట్టాభిషేకము
గరిమతోడుత గట్టిరపుడే
తత్తిరుకుయని భేరి వాద్యము
నృత్తతాళము మ్రోయగా
సత్యపంధుడ నీవు వౌదని
సకల జనులు నుతింపగా
దిక్కు దిక్కుల రాజ రాజులు
మ్రొక్కి నీకు సలాము చేయగా
రాజులు సమానుకే శర

భోజరాజ మహేంద్రురే, వర
భోసలాంబుధి చంద్రురే, శహ
భాసురే.... సల్లామురే ....

అంటూ కూచిపూడి నృత్య సంప్రదాయాన్ని ప్రచారంలోనికి తెచ్చిన లక్ష్య లక్షణవేత్తలైన భాగవతుల శ్రేష్ఠులలో ప్రాచీనులు భాలెంత రామయ్య, వెంపటి కోదండరామయ్య, చింతా శివయ్య ప్రభృతులు శ్రీ శరభోజీ మహరాజు పట్టాభిషేక మహోత్సవంలో తమ నాట్యకళా కౌశల్యముచే మెప్పించి, మహత్తరమైన సన్మానం పొందారు. వారికి ముందు భాగవతుల దశరథరామయ్య, పరంధామయ్య, భాగవతుల నాగలింగయ్య, యజ్ఞశివయ్యగార్లు కూడా తంజావూరు ప్రభువులచే ఘన గౌరవాన్ని పొందారు; ఆ మండలంలోని మేలట్టూరును అగ్రహారంగా పొందారు.

అంతేకాదు; నాడు రాయలు, గోల్కొండ తానీషాలు కూడా కూచిపూడి నాట్యకళపట్ల ఎంతో ఆదరాభిమానాలు చూపారు. కాని, నేడు ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాలు తగు రీతిని పోషించి ప్రోత్సాహమివ్వకపోయినా – ఈ విశిష్టమైన నాట్యకళ చిరంజీవ మవడానికి నృత్య శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పి, యావద్భారతంలోనే కాక ఖండాంతరాల్లో సైతం ఈ కళకు ఖ్యాతి నార్జించి పెట్టిన ఘనత వెంపటి చిన సత్యం గారిది. మద్రాసు కూచిపూడి ఆర్ట్సు అకాడమీ హాలులో నిలువెత్తు నటరాజ విగ్రహం ఎదుట బీరువాలలో భద్రపరచబడిన విదేశీ ప్రభుత్వాలు, సాంస్కృతిక సంస్థలు, విశ్వ విద్యాలయాలు చిన సత్యంగారికి సమర్పించిన సన్మానపత్రాలు, యోగ్యతాపత్రాలు, జ్ఞాపికలు చూస్తూంటే గర్వించని ఆంధ్రుడుండడు.

"మన సంస్కృతి సంప్రదాయాల గురించి మనకన్నా విదేశీయ లకు చక్కని అవగాహన ఉంది. వాటి ఔన్నత్యం వారికి బాగా తెలు సనడం సత్యదూరం కాదనుకుంటాను ?" అన్నాను సత్యంగారితో.

ఆయన మందహాసంతో ఆ బీరువాలవంక ఇటు అటు 'ప్రలో కితం'గా చూశారు. "భారతీయుడుగా, ఆంధ్రుడుగా, కళాకారుడుగా నాకింత కన్నా ఆత్మసంతృప్తి వేరే ఏముంటుంది? నా 19వ ఏ బ్రతుకుతెరువు కోసం మద్రాసు వచ్చిన నేను మా అన్న స్వర్గీయ వెంపటి పెద సత్యంగారి ప్రోత్సాహంతో చలన చిత్రరంగంలో ప్రవే శించాను. 1960 వరకు దాదాపు పన్నెండేళ్ళపాటు నృత్య దర్శకుడిగా పని చేశాను ఆ వాతావరణంలో ఇమడలేకపోయిన విషయం అటుం చితే – ఏదో అసంతృప్తి, ఏదో తపన. మారుమూల కూచిపూడిలో మిడిమిడిగా, అస్తవ్యస్తంగా మాత్రమే ప్రచారంలో ఉన్న కూచిపూడి నాట్యప్రక్రియకు శాస్త్రీయమైన రూపం కల్పించి, ప్రజల దగ్గరకు తీసుకెళ్తే, మన తెలుగువారి జాతీయ నాట్యకళకు నావంతు నేనేదైనా చేసినట్లవుతుంది; నా జన్మ సార్థకమౌతుంది. ఇది చలనచిత్ర రంగం నుంచి నేను తప్పుకుంటేగాని నెరవేరదు. అలా 1963లో 'కూచిపూడి అకాడమీ'ని మద్రాసులో నెలకొల్పడం జరిగింది. నాట్య శాస్త్రంమీద పలు గ్రంథాలను తెప్పించి, అధ్యయనం చేశాను. మద్రాసులో ఉండడంవల్ల భరతనాట్యం వగైరా తదితర శాస్త్రీయ నృత్యాలను పరిశీలించడానికి వీలయింది. ఈ కూచిపూడి కళ కలకాలం సజీవంగా నిలచి ప్రజల్లోకి వెళ్లాలంటే దీనిని స్త్రీలకు సాంప్రదాయంగా నేర్పించడం అవసరమని గుర్తించాను. ఈ విషయం చాలవరకు

( తరువాయి 67వ పేజీలో )



దేశ విదేశ శిష్యులతో శ్రీ వెంపటి చిన సత్యం

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

# బ్రహ్మర్షుల దృష్టిలో షడ్దర్శనాలు

మన పవిత్ర భారతదేశం సృష్ట్యాదినుంచీ భిన్న భిన్న శక్తులతో విరాజిల్లే ఋషులతో, వేదర్షులతో నారదాది దేవర్షుల రాకపోకలతో, దేవతలవిడిది గృహంగా - అనేక అవతారాల జన్మభూమిగా-విరాజిల్లుతూ మొత్తం భూమండలంలోనే కాక - ప్రపంచ చరిత్రలోనే విశ్వాంతరాళం లోనే - విశ్వ సృష్టి చరిత్రలోనే - ఒకానొక వైశిష్ట్యాన్ని స్వయం భూతంగా - స్వయంప్రచలితంగా-విష్ణుమాయగా - కృష్ణలీలగా - రూపొందించుకొన్నది. ఈ భూమండలంలోని మన మహత్తర పవిత్ర భారతదేశంలో అతి పురాతన కాలం నుంచీ వివిధస్థాయిల్లో రకరకాల వివిధశక్తులతో విభిన్న వర్గాలకు చెందిన ఋషులున్నట్లుగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రకటించిన "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" తృతీయ సంపుటానికి పీఠిక రాస్తూ నేను ఒక సందర్భంగా మామూలు ఋషులు మాత్రమే కాక ఋతు పర్ణాది రాజర్షులు, జైమిన్యాది కాండర్షులు, సుశ్రుతాది శ్రుతర్షులు, వ్యాసాది మహర్షులు, భేలాది పరమర్షులు, వశిష్ఠాది బ్రహ్మర్షులు, అంగిరసాది వేదర్షులు, నారదాది దేవర్షులు ఉన్నట్లు పేర్కొనడం జరిగింది.

ఋషివ్యవస్థను ఋషికల వ్యవస్థను గుర్తించడానికి కొన్ని విశేషాలు దైవీయాలుగా విరాజిల్లుతాయి. వాక్శుద్ధి వాక్సిద్ధి, శాపానుగ్రహశక్తియుక్తులు, త్రికాలజ్ఞత్వం సూర్యాది అగ్నిగోళాలను సైతం అచంచలంగా నేత్రాలతో చూడగలిగిన శక్తి, వ్యాధిజరామరణరాహిత్యాలు' తన ఆయుర్దాయాన్ని తన హస్తగతం చేసుకునే విధంగా స్వచ్ఛంద మరణ శక్తిని కలిగ వుండడం మొదలైన శక్తులున్నప్పుడు పురుషులు ఋషులుగాను, స్త్రీలు ఋషికలుగాను గుర్తింపబడ్డారు. ఈ స్థాయికి క్రింది మెట్లుగా వివిధస్థానాలను అలంకరిస్తూ వేదకాలం తరువాత అనేకమంది విశిష్టవ్యక్తులు అవతరించి వుండవచ్చును. కాని వేదర్షుల అడుగుజాడలలో పరిభ్రమించి వేద విజ్ఞాన విషయాలను వేధ బద్ధాలుగా అవిష్కరించినవారు లేకపోలేదు. అటువంటి వారిలో షడ్దర్శన కర్తలు ప్రముఖులు-"న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ మీమాంస, ఉత్తరమీమాంస" గ్రంథాలు షడ్దర్శనాలని అత్యంత ప్రాచీన కాలం నుంచీ పండిత పరిశోధక విమర్శకమండలి భావిస్తూ వచ్చింది. వాస్తవానికి వీటిల్లో "ఉత్తరమీమాంసా" గ్రంథం ప్రత్యేక దర్శనగ్రంథం కానేకాదు. అసలైన క్రమంలో షడ్దర్శనాలుగా పేర్కొనదగినవి న్యాయ, వైశేషిక, కర్మమీమాంస లేదా ధర్మ మీమాంస, వేదాంత (బ్రహ్మసూత్ర), సాంఖ్య, యోగ గ్రంథాలు. న్యాయ దర్శనాన్ని గోతమ మహర్షి లేదా గౌతమ మహర్షి విరచించగా-వైశేషిక దర్శనాన్ని కణాద మహర్షి - కర్మమీమాంస లేదా ధర్మమీమాంసా దర్శనాన్ని జైమిని మహర్షి రచించగా-"వేదాంత దర్శన" పరమైన "బ్రహ్మ సూత్రా"లను బాదరాయణుడు రచించగా - సాంఖ్య దర్శనాన్ని కపిల మహర్షి-యోగదర్శనాన్ని పతంజలి మహర్షి విరచించారు. "ఉత్తరమీమాంసా" గ్రంథం వేదాంత దర్శనం" అనబడిన బాదరాయణుని "బ్రహ్మసూత్ర" గ్రంథానికి అసాధారణమైన వివరణాత్మక గ్రంథమేకాని ప్రత్యేక "దర్శన" గ్రంథం మాత్రం కానేరదు. "బ్రహ్మసూత్రాలు" "ఉత్తరమీమాంసా" గ్రంథానికి మూలభూతమైనదని తెలిసి కూడా ప్రాచీన పండిత పరిశోధక విమర్శక మండలి దీన్ని ప్రత్యేక దర్శన గ్రంథంగా పరిగణించడం కేవలం పొరపాటు. "కర్మధర్మమీమాంసా" పరమై పదహారు అధ్యాయాలతో విరాజిల్లే జైమినీయ దర్శనగ్రంథం విశిష్టమైన కర్మ-ధర్మ పరమైన, కర్మధర్మ ఫలితగ్రంథం. ఈ స్వతంత్ర దర్శన గ్రంథాన్ని 'పూర్వ మీమాంసా గ్రంథమనీ-బ్రహ్మసూత్రాలమీద మహాభాష్య-విపులవ్యాఖ్యా గ్రంథాలుగా అవతరించిన వివరణాత్మక గ్రంథసముచ్చయాన్ని ఉత్తర మీమాంసా గ్రంథమనీ - ప్రాచీనులు వ్యవహరించడం శుద్ధ పొరపాటు. షడ్దర్శనాల్లోని ప్రతిదర్శనంలోనూ - యేదోకఒక మీమాంస ఉండనే ఉంటుంది. "మీమాంస" అంటే 'చర్చ' అని 'జిజ్ఞాస' అనీ అర్థాలున్నాయి. ఏ విధమైన మీమాంస లేకుండా యే ఒక్క దర్శన గ్రంథమూ లేదు. అయినప్పుడు జైమినీయ కర్మ ధర్మ మీమాంస గ్రంథానికి "పూర్వ మీమాంస" అనీ - బాదరాయణుని" "బ్రహ్మ సూత్రా"ల మీద అవతరించిన వివిధ భాష్యవ్యాఖ్యా గ్రంథ సముచ్చయానికి "ఉత్తరమీమాంస" అనీ-పేర్లు పెట్టడం పొరపాటు. వాస్తవానికి భాష్యాలూ, వ్యాఖ్యానాలూ, టిప్పికలూ అవతరించని గ్రంథమంటూ ఏ ఒక్క దర్శనం కూడా షడ్దర్శనాలలో లేదు. భాష్య, వ్యాఖ్య, వృత్తి, టిప్పికాది రూపాలలో వున్న గ్రంథాలే దర్శన గ్రంథాలయితే మరి అసలు దర్శన గ్రంథాలేమౌతాయి? నిజానికి బాదరాయణుని "బ్రహ్మసూత్ర" గ్రంథాన్ని "వేదాంత దర్శనమని ప్రాచీనులందరూ భావిస్తూ వచ్చారు. కాని కేవలం ఆ "బ్రహ్మసూత్ర గ్రంథం మాత్రమే

"వేదాంత దర్శనం" కాదు వాస్తవానికి ప్రతి దర్శనమూ ఆ రూపంగా న్యాయ, వైశేషిక, కర్మ-ధర్మ మీమాంస, బ్రహ్మసూత్ర సాంఖ్య, యోగ దర్శనాలు ఆరూకూడా వేదాంత దర్శనాలే, "వేదాంతం" అంటే వేదానికి చివరి గ్రంథమనీ, వేదం కంటే గొప్ప గ్రంథమనీ ప్రాచీనులు భావించి సాంప్రదాయ సిద్ధంగా గుడ్డెద్దు చేలో పడినట్లు ఆ అర్థాన్నే చెప్పుకొంటూ పప్పులో కాలు వేశారు. "వేద" శబ్దంతో "అతి-అవి-బంధనే" అన్నట్లుగా బంధనార్థకమైన "అంత" శబ్దం కలిసి "వేదాంత" శబ్దం రూపొందింది. "వేదాంత" మంటే వేద బద్ధమైన విషయమని అర్థం. వేదబద్ధంకాని విషయమంటూ-విజ్ఞానమంటూ వేరే యేదీ ఈ విశాల విశ్వంలోనే లేదు. వేదాతీతమైన దంటూ యేదీ అసలు లేనేలేదు. ఈ అంతర్యాన్ని గుర్తించలేని అజ్ఞానులు "అనంతావై వేదాః" అన్నట్లు అనంతాలైన దేవవేదశక్తులను, వేదదేవశక్తులను, గుర్తించ లేక అజ్ఞతా విలసితంగా "వేదాంత" శబ్దానికి పెడర్థాలు చెప్పడం జరిగింది.

అనంతమైన వేదవిజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని గుహ్యాతి గుహ్యంగా అంతరాంతరాలలోకి వెళ్ళి పరిశీలిస్తే షడ్ దర్శనాలు ఏకార్థ దాయకాలు కావనీ అనేకార్థదాయకాలనీ అవగతమౌతుంది. అనేకార్థదాయకాలంటే ఏకార్థకాలు మాత్రమే కావని అర్థం. ఈ అనేకార్థకతలో ద్వ్యర్థి, త్ర్యర్థి, చాతురర్థి, పంచాద్యర్థకత్వాలు కూడా అంతర్గతమై ఉన్నాయి. దర్శనాలకున్న ఈ అనేకార్థకతను వాటి అవతరణ తరువాత వాటిని పరిశీలించి పరిశోధించిన ప్రాచీనులుకాని, ఆధునిక పండిత పరిశోధకులు కాని గుర్తించనేలేదు, షడ్దర్శనాలలో వాస్తవానికి "న్యాయ" వైశేషిక, కర్మ-ధర్మ మీమాంస, బ్రహ్మసూత్ర "గ్రంథాలైన, నాలుగు దర్శన గ్రంథాలూ మోక్ష విశేష విషయక వివరణ గ్రంథాలుకాని, మోక్షదాయక గ్రంథాలుకాని కానేకావు. మోక్ష మార్గ నిర్దేశక గ్రంథాలూ, మోక్షదాయక గ్రంథాలూ, సాంఖ్య యోగ దర్శనాలు మాత్రమే, ద్రవ్యగుణ విశేషాలను తెలిపే న్యాయ, వైశేషిక దర్శనాలూ, కర్మ,-ధర్మ వ్యవస్థనూ తత్ఫలితాలనూ మామూలుగా లౌకిక సృష్టికి బ్రహ్మ పదార్థ విజ్ఞానానికీ మూలభూతాలైన కర్మ-ధర్మ మీమాంసా గ్రంథమూ - బ్రహ్మసూత్రాలూ దిక్కాలాత్మకాలే గాని, దిక్కాలాలకతీతమైనవి మాత్రం కావు-బ్రహ్మసూత్రాలలో అనేకార్థక దృష్టిలో ఒకానొక విశిష్ట దృక్పథంతో మామూలు సృష్టిరూప బ్రహ్మకతీతమైన "పరబ్రహ్మ" తత్త్వ వివేచనం కూడా ఉన్నది. అయినా ఈ "పరబ్రహ్మ" తత్త్వం మహా ప్రళయాంతంలో సైతం నిలువగల దిక్కాలాతీతమైన మహా విష్ణు శక్తితో సమానమైనది కాదు. కాబట్టి ఈ 'పరబ్రహ్మ' తత్త్వాన్ని కూడా దిక్కాలాత్మకంగానే మనం భావించవలసివున్నది. సాంఖ్య, యోగాలలో దిక్కాలాత్మకాలై లౌకికాలైన వివిధ సిద్ధుల గురించి వివరించినా తదతీతమైన మోక్షసిద్ధిగురించి కూడా - జననమరణ రాహిత్య పరమైన కేవలత్వ (కైవల్య) సిద్ధి గురించికూడా - అనేకార్థకతతో విశిష్టంగా వివరించడం జరిగింది. న్యాయ - వైశేషిక దర్శనాలలో "పృథివ్యాపస్తేజోవాయు రాకాశ కాలోదిగాత్మా మనస్సులు" అనే ద్రవ్య విశేషాదుల గురించీ - వాటి గుణాలను గురించీ - విశ్వ సృష్టిలో వాటి వ్యవస్థ గురించీ - స్వరూప స్వభావాలను గురించీ - అమేయంగా వేదబద్ధంగా వివరించడం జరిగింది. ఈ ద్రవ్యగుణాల కర్మల గురించీ - కర్మఫలితాల గురించీ- "కర్మ-ధర్మ మీమాంసా" దర్శనంలోనూ - ఈ ద్రవ్యగుణకర్మ ఫలితాలకు ఒకానొక విశిష్ట సమున్నత స్థాయిలో మూలభూతమైన బ్రహ్మ పదార్థం గురించీ - ఆ బ్రహ్మకు మూలభూతమైన పరబ్రహ్మ పదార్థం గురించీ - బాదరాయణుని "బ్రహ్మసూత్రా" లలోనూ బహుముఖంగా అనేకార్థకత్వంతో వివరించడం జరిగింది. న్యాయ - వైశేషిక దర్శనాలలో నవద్రవ్య గుణ ఫలితాలపరంగా శ్లేషతో ప్రయోగించబడిన "నిఃశ్రేయస" శబ్దానికి ప్రాచీనులు పొరపాటుగా "మోక్షం" అని అర్థం చెప్పుకొని మొత్తం దర్శనాల వ్యవస్థను తారుమారు చేయడమే కాక రూపుమాపారనే చెప్పవచ్చును. ఈ దర్శనాలలో ప్రయుక్తమైన "నిఃశ్రేయస" శబ్దానికి "నితరాం శ్రేయస్సును కలిగించేది" అంటే "ఎల్లప్పుడూ శ్రేయస్సును కలిగించేది అని ఒక అర్థం కాగా "శ్రేయో రాహిత్యాన్ని కలిగించేది"-అంటే "అపకారం చేసేది, నాశనం చేసేది" అని వేరొక అర్థం ఉన్నది. అణుపరమాణువులు విశ్వశ్రేయస్సుకూ - విశ్వశాంతి సౌభాగ్యాలకూ- విశ్వ వినాశనానికీ, అపకృతికీ - రెండు విధాలుగానూ ఉపయోగపడతాయన్నది నిత్యసత్యమై పరమవైజ్ఞానికమైన విషయం. ఈ నిత్యసత్యమైన వైజ్ఞానిక విషయాలను దృష్టిలో పెట్టుకొని మన ప్రాచీన మహర్షులైన వేదవిజ్ఞానులైన గౌతమ కణాదాదులు సూక్ష్మాతి సూక్ష్మంగా విశ్వ విరాట్స్వరూప స్వభావాల గురించీ తత్తత్ ఫలితాల గురించీ వివరించారు. "నిఃశ్రేయస" శబ్దానికి మోక్షం అని అర్థం లేదన్నంతమాత్రంచేత "నిఃశ్రేయసాధిగమనం" అంటే మోక్షం అని అర్థం లేదనుకోరాదు. "అధిగమనం" అంటే దాటడం అని అర్థం-"నిఃశ్రేయసాధిగమనం" అంటే శాశ్వత శ్రేయస్సును శాశ్వత శ్రేయో రాహిత్యాన్ని దాటడం అన్నమాట. శాశ్వత శ్రేయస్సుకు - శాశ్వత శ్రేయోరాహిత్యానికి భిన్నంగా - అతీతంగా జీవించడమంటే మోక్షాన్ని పొందడమన్నమాటే. అంటే నిరాకార నిరంజన నిర్వికల్ప సచ్చిదానందాత్మతను పొందడ మన్నమాట. సార్థకంగా అనేకార్థకంగా ప్రయుక్తమైన ఒక్క "నిఃశ్రేయస" శబ్ద అంతర్యాన్నే గుర్తించలేని ప్రాచీనులు షడ్ దర్శనాలలోని అనేకార్థకతను గుర్తించకపోవడంలో ఆశ్చర్యకరమైన విషయమేమీ లేదు. కాగా ద్రవ్యగుణ విశేషార్థ ప్రతిబింబకాలైన న్యాయ - వైశేషిక - దర్శనాలలోని విశిష్టతలను అనేకమంది రకరకాలుగా వివరించారు. వాత్స్యాయన, విశ్వనాథభట్ట,

ఉద్యోతకర, గౌతమ, వాచస్పతిమిశ్ర, ఉదయనాచార్య, వర్ధమాన పండిత, కేశవమిశ్ర, గోవర్ధన, గౌరీకాంత, మాధవదేవ, చెన్నుభట్టు, రామలింగపండిత, భావసర్వజ్ఞ, జయసింహసూరి, రాఘవభట్టు, గంగేశ పండిత, జయదేవ, రఘుదేవ, రుచిదత్త, మధురాంతక, రఘునాథ తార్కిక శిరోమణి, గదాధరభట్ట, భవానంద, జయరామ, దినకర, జగదీశాది పండితులు భాష్య, వృత్తి, వార్తిక, సూత్ర, వ్యాఖ్యాన, టీకాదులను న్యాయదర్శన పరంగా విరచించారు. వాత్స్యాయనుడు, ప్రశస్తపాదుడు, శ్రీధరపండితుడు, శంకరమిశ్రుడు, వ్యోమశివాచార్యుడు, శ్రీధరాచార్యుడు, ఉదాయనాచార్యుడు, శ్రీవత్సాచార్యుడు, జగదీశుడు, పద్మనాభమిశ్రుడు, శంకరమిశ్రుడు, జయనారాయణ తర్కపంచాననుడు, సర్వదేవసూరి, శివాదిత్యుడు, శిరోమణి భట్టాచార్యుడు, వర్ధమానుడు మొదలుగాగల అనేకమంది పండిత ప్రకాండులు వైశేషిక దర్శనానికి భాష్య వ్యాఖ్యారూపాలైన విశేష విషయ వివరణ గ్రంథాలను విరచించారు. ఎవరెన్ని గ్రంథాలు రచించినా అసలు షడ్దర్శనాలు శ్లేష గ్రంథాలన్న సంగతి గుర్తించలేకపోయినందువల్లనూ - అసలు ద్రవ్యగుణ వ్యవస్థలోనే సదసత్తులకూ - మంచి చెడులకూ - శ్రేయస్కరత్వానికీ - శ్రేయోరాహిత్యానికీ - పరిపూర్ణ స్థానం ఉన్నదన్న సంగతి గుర్తించనందువల్లనూ దర్శన వ్యవస్థను ప్రాచీనులూ, ఆధునికులూ వాస్తవికంగా దర్శించలేకపోయారు. "గతాను గతికో లోకః" అన్నట్లుగా "గానుగెద్దువలె" ఏవేవో కొన్ని పరిమిత పరిధుల్లోనే సంచరిస్తూ ద్రవ్యగుణ ఫలపరమైన విశాల విశ్వ విరాట్స్వరూప - స్వభావాలను గుర్తించలేకపోయారు. వాస్తవం పరిశీలిస్తే న్యాయ వైశేషిక దర్శనాల కర్తలైన గోతమ, గౌతమ, కణాద మహర్షుల నామాలలోని "గో "కణాద" శబ్దాలే పరమ వైజ్ఞానికాలని బోధపడుతుంది- 'గో' శబ్దానికి ఆవు, ఎద్దు అని మాత్రమే అర్థాలు కాక "వాక్కు, శబ్దం, గోళం తద్రూపంగా వివిధ గ్రహనక్షత్రాదులు" అని కూడా అర్థాలు ఉన్నాయి. ఈ అనంత విశ్వంలో వివిధ ద్రవ్యగుణాలకున్న శ్రేయోదాయకత్వంవలెనే ఆవు, ఎద్దులలో కూడా అణుఅణువునా విశ్వశ్రేయోదాయకత్వం ఉండటం ఈ సృష్టిలోని మహాద్భుత విషయాలలో ఒకటి. అందుకే మన ప్రాచీన ఋషులందరూ గోమాతగా, నందీశ్వరునిగా పవిత్ర పూజనీయమైన స్థానాన్ని ఆవుకూ, ఎద్దుకూ ఇవ్వడం జరిగింది. "కణా" శబ్దానికి మామూలుగా వివిధార్థాలేకాక అణుపరమాణువులన్న అర్థాలూ - చివరికి "జీవకణ" "నిర్జీవకణా" లన్నఅర్థాలు కూడా ఉన్నాయి. 'ద' శబ్దానికి "మరింతగా సూక్ష్మమైన పదార్థం - ధరించగలిగినది - త్యాగరూపమైనది - చూడగలిగినది - చలించగలిగినది - బహువైనది - శబ్దతత్వం కలది - నిశ్శబ్దతత్వం కలది - పరిశుద్ధమైనది" అని "కణా + అదః" అనీ ద్వివిధాలుగా విభజించి అనేకార్థాలను చెప్పవచ్చును. దీర్ఘ "ణా"కారంతో ఉన్న 'కణాద' శబ్దంలోని 'ద' శబ్దాన్ని 'నఞ్' సమాసం చేసి 'అదః' శబ్దంగా విభజించినప్పుడు పైన ఉదాహరించిన 'ద' శబ్దార్థాలన్నీ తద్విరుద్ధార్థరూపాలుగా రూపొంది మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. ఈ పరస్పర వైరుధ్యం కల అర్థాలు "నిశ్శ్రేయస" శబ్దగతాలైన విరుద్ధ ద్వివిధార్థాల కనుగుణమైనవేకాక మనల్ని మరింతగా సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతుంది. కాగా కణాదుడు తన వైశేషిక దర్శనంలోని అనేకార్థకత్వంతోనే కాక తన నామంలోని అనేకార్థకత్వంతో కూడా విశ్వసృష్టి స్వరూప- స్వభావాలను బహుముఖంగా ప్రతిఫలింపచేశాడు. కణాదునికి 'ఔలూక్య' మహర్షి అని వేరొక నామాంతరం వున్నది. 'ఉలూక' మహర్షి పుత్రుడు కాబట్టి "ఔలూక్య" మహర్షి అని పేరు వచ్చినట్లు ప్రాచీనులు భావించారు. ఇది వాస్తవంగా కనపడదు. ఈ 'ఔలూక్య' మహర్షి నామం కూడా 'కణాదు'నికి పరమవైజ్ఞానిక దృక్పథంతో సార్థకంగా యేర్పడినట్లే కనిపిస్తున్నది. మామూలుగా ప్రాణులు తమ నేత్రాలతో పగలు విశ్వాన్నీ పదార్థాలనూ చూడగలుగుతాయి. కాని పగలు చూడగలిగినంతగా రాత్రిళ్ళు - పైగా అంధకార బంధురత ఆవరించినపుడు చూడడం అసాధ్యమైన విషయం. 'ఉలూక' మంటే 'గుడ్లగూబ' అని ఒక అర్థం వున్నది. 'గుడ్లగూబ'ను 'దివాంధ' మని నామాంతరం కూడా ఉన్నది. 'దివాంధ' మంటే 'పగలు చూడలేనిది' అని అర్థం. గుడ్లగూబకు పగలంతా కటిక చీకటిగా ఏ వస్తు ప్రకృతి ఏమాత్రమూ కన్పించదు. కాని రాత్రిళ్ళుమాత్రం ఎంత కటిక చీకటిలోనైనా గుడ్లగూబకు ప్రకృతిలో ప్రతిదీ కన్పిస్తుంది. గుడ్లగూబ నేత్రాలను ఊడబెరికి ఎడమకంటి గుడ్డునూ, కుడికంటి గుడ్డునూ విడివిడిగా మెత్తగా నూరి ఎడమగుడ్డు పదార్థాన్ని మానవుడు తన కుడికంటికీ, కుడిగుడ్డు పదార్థాన్ని ఎడమకంటికీ కాటుకవలె పెట్టుకుంటే రాత్రిళ్ళు కూడా యెంత కటిక చీకటిలోనైనా సరే ఆ మానవుడు యే పదార్థాన్నైనా చూడగలుగుతాడు. గుడ్లగూబ నేత్రాలలో వున్న ఈ శక్తి గురించి ప్రాచీన భారతీయ వైద్యశాస్త్రాలు వేనోళ్ళతో యెలుగెత్తి చాటాయి. అంతేకాదు. గుడ్లగూబ మొదలైన కొన్నిటి యెముకలను చూర్ణం చేసి 'సర్పభస్త్రి'తో కలిపి ఆ 'సర్పభస్త్రి'ని పశువులకు తగిలించినా ఏ ప్రాణికి తగిలించినా ఆ ప్రాణులు ఎవరికీ కనబడకుండా అదృశ్యమై ప్రయాణం చేస్తాయి. ఈ గుడ్లగూబకున్న వైద్య విషయక రహస్య విషయాలను నా 'కృష్ణశతశతి'లోని ఈక్రింది నాలుగు పద్యాల్లోనూ సూక్ష్మంగా వివరించడం జరిగింది.

"గుడ్లగూబ పెద్ద గుడ్లున్నదైనను
గుడ్డి" దనుచు పల్కునెడ్డి బుద్ధి
గుడ్లగూబ గుడ్ల గూఢత్వమెరుగక
యుగయుగాల నిజము! కృష్ణగీత!॥

గుడ్లగూబ యెంత గుడ్లున్నదైనను
"అసలు తగనిదగు దివాంధ" మనగ
తిట్ట దగునె? వైద్య దీప్తిత్వ మెరుగక
యుగయుగాల నిజము! కృష్ణగీత! ॥

గుడ్లగూబకున్న గుడ్లనూడబెరికి
విడిగవిడిగ చూర్ణమెదల జేసి
యెడపెడ కనుల కిడ నరయనౌనుర రాత్రి
యుగయుగాల నిజము! కృష్ణగీత! ॥

గుడ్లగూబలాది కొమరు "నెమ్మలచూర్ణ
ముంచి "సర్పభస్త్రి" నుంచ ప్రాణు
లసలు కానరాక యానమ్మ లౌనరించు
యుగయుగాల నిజము! కృష్ణగీత! ॥

('కృష్ణశతశతి' నుంచి)

ఈ గుడ్లగూబ నేత్రాలను యీ రూపంగా వినియోగించుకొన్న వారిలో "కౌటిల్యుడు" "చాణుక్యుడు" ప్రాముఖ్యం వహించారు. కణాదుడు తన అఖండ ప్రకృతి పరిశోధనలో బహుముఖమైన వేదవిజ్ఞానిగా ఇతరముఖాలుగానేకాక వైద్యముఖంగా సైతం 'ఉలూకాన్ని' కూడా తన పరిశోధనలకు వినియోగించుకున్నాడనీ - కేవలం పగలు మాత్రమే తన పరిశోధనా కార్యక్రమాల్ని నిర్వర్తించలేదనీ - రాత్రిళ్ళు కూడా తన నిరంతర పరిశోధనలను కొనసాగించాడనీ అర్థమౌతున్నది. తన పరిశోధనలకు 'ఉలూక' శక్తులను కూడా వినియోగించుకున్నందు వల్లనే 'కణాదు'నికి 'ఔలూక్య' మహర్షి అని నామాంతరం వచ్చివుండవచ్చును. అంతేకాదు. 'ఉలూక' శబ్దానికి 'ఇంద్రు' దని కూడా అర్థం వున్నది. ఇంద్రుడు సహస్రాక్షుడు. 'కణాదుడు' సహస్రాక్షునివలె ఒళ్ళంతా కళ్ళుగా రాత్రింపగళ్ళు ప్రకృతి అంతరాంతరాలలోకి వెళ్ళి దాని స్వరూప - స్వభావాల గురించి బహుముఖమైన పరిశోధనలు చేసినవాడు కాబట్టి అతనికి 'ఔలూక్య' మహర్షి అని నామాంతరం వచ్చి ఉంటుందని ఊహించడంలో అనౌచిత్యమేమీ ఉండదు.

బాదరాయణుని 'బ్రహ్మసూత్రా' లలో విశ్వసృష్టికి మూలభూతమైన బ్రహ్మ పదార్థస్వరూప - స్వభావాల గురించి వివేచించడం జరిగింది. వాస్తవానికి సృష్టి - సృష్టికి మూలభూతమనుకుంటున్న బ్రహ్మ - బ్రహ్మపదార్థమూలానికి తత్వభూతమైన పరబ్రహ్మత్వం - అన్నీ శ్రీ మహావిష్ణువు మీదనే అంచెలంచెలుగా, ఒక మాయగా లీలగా ఆధారపడిఉన్నాయనేది విస్పష్టం. అయితే బ్రహ్మసూత్రాలలో బ్రహ్మతత్వానికి సంబంధించి, పరబ్రహ్మతత్వానికి సంబంధించీ సదసద్వివేచనతో - విశ్వపదార్థ తత్వస్వరూప - స్వభావాల గురించి - అనేకార్థకత్వంతో - వేదబద్ధంగా - వేదాంతంగా - పరిశ్లిష్టతతో - వివరించడం జరిగింది. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అన్న సూత్రంలోనే శ్లిష్టత్వంతో 'ధాత' అయిన బ్రహ్మజిజ్ఞాస గురించీ 'అధాత' అయిన పరబ్రహ్మతత్వ జిజ్ఞాస గురించీ పేర్కొని క్రమానుగతంగా బ్రహ్మ - పరబ్రహ్మతత్వ విశేషాలతో అనేకార్థకతతో ప్రవచించడం జరిగింది. వేదభాషాలింగవ్యవస్థను - శ్లేషలో తవర్గ ద్వితీయ - చతుర్థ వర్ణాల (థ - ధ ల) కున్న అభిన్నత్వాన్ని దృష్టిలో పెట్టుకుంటే యీ శ్లేషలోని వైశిష్ట్యం తెలుస్తుంది.

సృష్టి స్వరూప స్వభావాలనూ - సృష్టిమూలకారకత్వాలనూ - బ్రహ్మ పరబ్రహ్మత్వాలనూ అన్నింటికీ మూలమై, అక్షరమై - అక్షయమై - ప్రళయాంతంలో సైతం - లీలగా - హేలగా - పరమానందభరితుడుగా - విరాజిల్లే ఆ శ్రీ మహావిష్ణువును గురించి ఆ దేవదేవుని ప్రభావాదుల గురించి - వైభవాదులగురించి సంకోచ - విశాలత్వాల గురించీ - అంతర్గతంగా - జ్ఞానదీపికగా - దేవవేదం బహుముఖంగా వర్ణించింది. బహుముఖద్వైవీయమై విశ్వసృష్టి వ్యవస్థలోవున్న కర్మకారకత్వాల అవినాభావ సంబంధాల్ని అభివ్యక్తీకరిస్తూ దేవవేదం వేయి విధాలుగా యెలుగెత్తి చాటింది. 'అద్వైత' సిద్ధాంతమన్నదానికి కొందరజ్ఞులు భావించినట్లు ఆదిశంకరుడు మూలపురుషుడు కాదు. ద్వైత - అద్వైత - ద్వైతాద్వైతాది సిద్ధాంతాలన్నీ విశ్వసృష్టికీ - - సృష్టి వ్యవస్థకూ - ప్రతిబింబకాలుగా - వేదంలోనే ద్వైవీయాలుగా ప్రతిబింబితాలైనాయి. యేవో కొన్ని వేదవాక్యాలమీద ఆధారపడి - వేదమంత్ర విద్యావిషయాదుల మీద ఆధారపడి అవతరించగా ఏ పరిస్థితుల్లోనూ వేదభాగాలుగా ఆమోదించడానికి వీలులేనటువంటి ఉపనిషత్తుల్ని వేదాంతర్గతాలని తెలివితక్కువగా అనేకమంది ప్రాచీనులు భావించినట్లే వేదప్రోక్తాలైన "తత్వమసి, తదసిత్వమ్" - "సోఽహం, హంసః" - త్వమేవాఽహం, అహమేవత్వం" - "అహం బ్రహ్మాస్మి, బ్రహ్మైవాహం" "విష్ణ్వహమ్" - "శివోఽహం" వంటి పరిపూర్ణాద్వైత వాక్యాలను - వేదసిద్ధాంత పరంగా అవగాహన చేసుకొనలేక - "త్వమేవాహం వంటి అర్థాద్వైత, ద్వైతపర అసంపూర్ణ వాక్యాల్నే పూర్ణాద్వైత పరవాక్యాలుగా భ్రమాపూరితంగా అజ్ఞానవిలసితంగా భావించడం జరిగింది. ఈ పరిస్థితిలో పవిత్ర ఋషివృత్తి పరమైన 'అజగరవృత్తి' వంటివాటి విషయమై ప్రాచీన పండిత పరిశోధక విమర్శకులలోనే సరైన అవగాహన లేకపోవడంలో విచిత్రమేమీలేదు. ప్రాచీన కాలంలో కొందరు మహర్షులు 'అజగరవృత్తి' నవలంబించి, శాంత్యహింసా పరమైన అత్యంత పవిత్ర వినిర్మల జీవితాన్ని గడిపేవారు. 'అజగరవృత్తి' నవలంబించిన వారంటే 'కొండచిలువ' జీవితంవంటి జీవితాన్ని అవలంబించిన వారనీ - కొండచిలువ తన సమీపంలోకి వచ్చినదాన్నే తన ఆహారంగా స్వీకరిస్తుందనీ - అదేవిధంగా ఏవిధమైన ప్రయత్నమూ

లేకుండా తన సమీపంలో లభించిన వాటినే ఆహారంగా స్వీకరించే ఋషి 'అజగరవృత్తి' తో జీవించేవాడనీ - సాంప్రదాయ సిద్ధంగా - గురుశిష్య పరంపరగా - ప్రాచీన కాలంనుంచీ అర్థం చెప్పుకొనడం జరుగుతున్నది. వాస్తవానికి 'అజగరవృత్తి' అంటే కొండచిలువవృత్తి- శాంత్యహింసా పూరితమైనది యేమాత్రమూ కాదు. కేవలం అశాంతికీ హింసకూ పూర్తిగా తావలమైనది మాత్రమే - కొండచిలువ అసలు సంచరించకుండా కేవలం ఒకచోటే పర్వతంవలే పడివుంటుందను కొనడంపొరపాటు. అది కదలకుండా మెదలకుండా వున్నా - ఒకవేళ సంచరిస్తూ వున్నా తన సమీపంలోకి వచ్చిన ఏ ప్రాణినైనా యిట్టే మింగేస్తుంది. అంతేకాదు ఏదైనా ఒక ప్రాణి కొండచిలువ సమీపం లోకి వస్తేనే దాన్ని భక్షిస్తుందనుకొనడం పొరపాటు. ఏ ప్రాణి అయినా తన సమీపంలోకి రాకుండా కొంతదూరంలో ఉండి - కొండ చిలువ ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు అందుబాటులో ఉండివుంటే తనకు దూరంగా వున్న ప్రాణిని ఉచ్ఛ్వాసరూపమైన వాయుప్రభావంతో తన సమీపంలోకి వచ్చేట్లు చేసుకొని మరీదాన్ని ఆహారంగా స్వీకరిస్తుంది. కాగా మరి "అజగర" వృత్తిలో వున్న ఋషిని యీ కొండచిలువతో పోల్చినప్పుడు ఆ ఋషికూడా "అశాంతిహింసాపూరితమైన జీవితం" గడుపుతాడనీ - తన దగ్గరకు వచ్చిన తనకు లభించిన - ఏ ప్రాణి నైనా ఆహారంగా స్వీకరిస్తాడనీ మనం అర్థం చెప్పవలసివుంటుంది. ఇది విభిన్న స్థాయిలలో వున్న ఋషుల ప్రవృత్తులకే కాక -మామూలు ఋషుల ప్రవృత్తులకూ స్వభావాలకు సైతం బద్ధవిరుద్ధమైన విషయం, వాస్తవానికి "అజగరవృత్తి" అంటే ఆర్షసాంప్రదాయం ప్రకారం చెప్పవలసిన అర్థం వేరేవున్నది. 'జగరి' శబ్దానికి సంస్కృతంలో 'శరీరాన్ని కాపాడే రక్షాకవచ' మని అర్థం. యుద్ధయోధులు ధరించే 'కవచ' మని కూడా అర్థం వున్నది. 'కవచా' లలో వివిధ రకా లున్నాయి. వస్తుపదార్థరూపాలైన ఉక్కు కవచాలేకాక రకరకాల మంత్రపూరిత కవచాలు కూడా వున్నాయి. 'జగర' వృత్తి కానిది 'అజగర' వృత్తి. శరీరరక్షణార్థమై ఎటువంటి కవచమూ లేకుండా శరీరంపట్ల ఏ విధమైన అపేక్షా లేకుండా - నిర్మమత్వంతో, 'యీ శరీరం నాదికా' దన్న దృఢ నిశ్చయంతో, అచంచల విశ్వాసంతో, జీవించడం నిజమైన 'అజగరవృత్తి' అనబడుతుంది. వాస్తవానికి 'అజగరవృత్తి' అంటేనే ఏమిటో తెలియని దుస్థితిలో మన ప్రాచీన మత - వేదాంత ప్రవక్తలుండగా వారికి షడ్దర్శనాల అనేకార్థకత్వం పట్ల ద్వైత - అద్వైత - ద్వైతాద్వైతాది బహుముఖ వేదదేవ సిద్ధాంతాల పట్ల సరైన అవగాహన ఉన్నదనుకొనడం పొరపాటే కాగలదు.

జైమిని మహర్షి కృతమైన కర్మ - ధర్మ దర్శనంలో సృష్టి వ్యవస్థలో వున్న కర్మపరమైన-ధర్మాన్ని గురించీ అంటే స్వభావం గురించీ ధర్మపరమైన కర్మగురించీ - క్లిష్టత్వంతో విశదీకరించడ జరిగింది.

> దెబ్బతిన్న పాము దగ్గున లేచుట
> పిచ్చికాదు, వట్టి రెచ్చుకాదు
> కర్మకలదు కలదు కర్మ ఫలమ్మురా !
> యుగయుగాల నిజము ! కృష్ణగీత !"

అని 'కృష్ణశతశతి' లో నేను విరచించిన ఒక పద్యంలో కర్మగురించీ, కర్మ ఫలితం గురించీ పేర్కొనడం జరిగింది. వాస్తవానికి కర్మ - కర్మ ఫలితం అన్నవి ఒక్క చెడ్డకు సంబంధించి మాత్రమే ఉండవు. ఇవి రెండూ మంచి - చెడులకు రెండింటికీ తత్తత్ కర్మలకనుగు ణంగా, వాటి స్థితి స్థాయిల కనుగుణంగా ఉండడం జరుగుతుంది. ఇది ప్రకృతి ధర్మం. మామూలుగా కర్మ - ప్రాణి - విభిన్న వ్యవస్థ లకు చెందినవని సామాన్యంగా అనుకుంటూ ఉంటారు. ఇది శుద్ధపొర పాటు. కర్మకూ - కర్మఫలితానికీ-విధికీ, విధినిర్వహణకూ, అవినా భావ సంబంధం వున్నట్లే - కర్మ విధులకూ - కర్మవిధికర్తకూ, అవినాభావసంబంధం వుండితీరుతుంది. ఈ సంబంధం మరింతగా అన్యోన్యతను సంతరించుకున్నప్పుడు కర్మతో కర్తకు 'తాదాత్మ్యం' కూడా యేర్పడుతుంది. భక్తి కర్మ యోగాలలో ఈ తాదాత్మ్యం 'సమాధి' స్థితికి కూడా దారితీస్తుంది. ఈ తాదాత్మ్యాన్ని - కర్మ - విధి - ధర్మానికున్న వైశిష్ట్యాన్ని దృష్టిలో పెట్టుకునే శ్రీకృష్ణుడు భగవద్గీతలో 'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన' అంటూ ప్రవ చించాడు. "నీకు కర్మమీదనే అధికారం వున్నది. కర్మకారకత్వం మీదనే అధికారం వున్నది. కాని కర్మఫలాల మీదా - కర్మకారక ఫలాలమీదా నీకు అధికారం లేదు." అని శ్రీకృష్ణుడీసందర్భంగా అన్నంత మాత్రంచేత కర్మ - కర్మణి ప్రయోగపూర్వకమైన కర్మ కారకత్వానికి అసలు ఫలితాలే లేవని అర్థం కాదు. ఇక్కడ శ్రీకృష్ణుడు నిర్దేశించిన విధి కర్మ నిర్వహణ-వాటి తాదాత్మ్యానికి సంబంధించింది మాత్రమే. ఈ దృష్టితోనే 'కర్మధర్మమీమాంసా' దర్శన గ్రంథంలో సదసత్ కర్మలగురించీ, తత్ కర్మల ఫలితాల గురించీ అనేకార్థకత్వంతో బహుముఖంగా వివరించడం జరిగింది.

కపిల మహర్షి విరచితమైన 'సాంఖ్యదర్శనం' లో "అజామే కాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానామ్" ఇత్యాది వేదవాక్యాల కనుగుణంగా "సత్త్వరజస్తమో గుణ" వ్యవస్థలను పుర స్కరించుకునే ఆవిష్కృతమైన విశేష - నానావిధ - గోళ - లోక- సృష్టి జాయమానత్వ విశేషాలను మాత్రమేకాక - అసలు సృష్టి ప్రారంభానికి పూర్వమూ - సృష్టి జరిగిన తరువాత చతుర్దశమన్వంత రాలకు చివరవచ్చే ప్రళయాంతంలోనూ - విరాజిల్లే విశ్వసృష్టి రాహిత్యా

పరమైన "అజత్వ" విశేషాల గురించి కైవల్యాధార భూతమైన మూల తత్వం గురించీ - సాంఖ్యపరమైన కాలవ్యవస్థ గురించీ కూడా శ్లిష్టార్థాలతో వివరించడం జరిగింది. కాలానికీ, శబ్దానికీ అంటే ధ్వనికీ - విశ్వసృష్టిలో వున్న అవినాభావ సంబంధం గురించి ఆ శబ్దంలో కాలపరంగానూ కాలాతీతపరంగానూ ఉన్న కైవల్యం గురించీ దాని అమృతత్వం గురించీ అసాధారణంగా బహుముఖంగా వివరించడం జరిగింది. విజ్ఞాన భిక్షువు తన సాంఖ్య భాష్యా" వతారికలో

కాలార్క భక్షితం సాంఖ్యశాస్త్రం జ్ఞాన సుధాకరమ్

కలావశిష్టం భూయోఽపి పూరయిష్యే వచోఽమృతైః"

అని కాలపరమై 'కాలాతీతపరమై' జ్ఞానసుధాకరంగా శబ్దపూర్వకాలైన వచోమృతాలూ - నిశ్శబ్దపూర్వకాలైన అవచోమృతాలూ నిండి నిమిడీకృతాలై ఉంటాయని పేర్కొనడంలో ఆశ్చర్యకరమైన విషయమేమీ లేదు.

పతంజలి మహర్షి కృతమైన "యోగశాస్త్రం" ఇతర దర్శనాలవలెనే అనేకార్థదాయకత్వంతో బహుముఖ విజ్ఞానపరంగా, విజ్ఞానప్రదంగా వెలుగొందడమే కాక, విశిష్టంగా అయిదర్థాలతో పంచశాస్త్ర సమ్మిళిత గ్రంథంగా అపూర్వంగా అవతరించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రకటించిన 'సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ద్వితీయ సంపుటానికి నేను వ్రాసిన పీఠికలో పతంజలి యోగశాస్త్ర వైశిష్ట్యం గురించి సూక్ష్మంగా ఈ క్రింది విధంగా పేర్కొన్నాను. 'పతంజలి యోగశాస్త్రమే అయిదు అర్థాలతో వ్రాయబడినట్లు 'పతంజలి స్వయంగానే "జన్మౌషధి మంత్రతపస్సమాధి జాస్సిద్ధయః" అన్న సూత్రంలో స్పష్టంగా పేర్కొన్నాడు. అయిదు మార్గాలలో అష్టసిద్ధులు లభిస్తాయన్న లక్ష్యంతో జన్మతః గాని - మందులవల్లగాని - మంత్రజపం వల్ల గాని - తపస్సువల్లగాని - (ధ్యాన) సమాధి స్థితివల్లగాని అష్టసిద్ధులు లభిస్తాయంటూ ఆయా వివిధ విభిన్న మార్గాలను స్పష్టంగా వివరిస్తూ "జీవన గమనసూచిక" గ్రంథంగానూ, ఆయుర్వేద గ్రంథంగానూ, మంత్ర శాస్త్రంగానూ యోగగ్రంథంగానూ, ధ్యానయోగ గ్రంథంగానూ అయిదు విభిన్నార్థాలతో అల్లిబిల్లిగా అల్లుకున్న సూత్రాలతో ఒక మహిమాన్వితుడైన మహర్షిగా పతంజలి మహర్షియోగశాస్త్రాన్ని విరచించాడు. ఈ విశేష విషయాల గురించి "ఆనోఖోడ్ సాధించిన అత్యద్భుత విజయం అన్న శీర్షికతో 1970 డిసెంబరు 10 వ తేదీ ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రకటితమైన నా వ్యాసంలో కొంత వివరించివున్నాను. వేదవిజ్ఞానం మీద ఆధారపడి విరచింపబడిన "పతంజలి" యోగశాస్త్రమే అయిదర్థాలతో కూడియున్న దైనప్పుడు వేదంలో ఎన్నెన్ని విజ్ఞాన విషయాలు ప్రతిబింబితమై వున్నాయో చెప్పడం మామూలు వేదవేత్తలకూ పరిశోధకులకూ సాధ్యం కాదు. (సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత - ద్వితీయ సంపుటం - పీఠిక - 16 వ పేజీ).

పతంజలి తరువాత అతని యోగ శాస్త్ర రహస్యాలనూ - గుహ్యాతి గుహ్యాలైన అనేకార్థకత్వాలనూ గుర్తించిన వారే లేకపోయారు - ఆత్మారామ యోగీంద్రులు రచించిన "హఠయోగ ప్రదీపిక"ను దృష్టిలో పెట్టుకుని గోరక్షణానాథుడు విరచించిన "సిద్ధ సిద్ధాంత పద్ధతి"ని దృష్టిలో పెట్టుకుని-కేవల సాధారణ యోగ పరంగానూ. ధ్యానయోగ పరంగానూ మాత్రమే యోగశాస్త్రాన్ని ప్రాచీన కాలం నుంచీ అధ్యయనం చేయడం జరిగింది కాని 'జన్మౌషధిమంత్ర' శాస్త్రాలపరంగా యోగశాస్త్రం గురించి ఆలోచించినవారే లేకపోయారు. వివేకానంద - అరవిందాది ఆధునికుల మాటెందుకు? ప్రాచీన కాలంలోనే యోగ పురుషులు, సిద్ధపురుషులు, మహా మాంత్రికులు, మహా తాంత్రికులు, అపరధన్వంతరులు" అంటూ గొప్పలకు పోయిన వారు సైతం జన్మౌషధిమంత్ర" శాస్త్రాలపరమై బహుముఖ వేదవిజ్ఞాన పరమైన యోగశాస్త్రాలవిషయాల దరిదాపులకైనా వెళ్ళలేకపోయారు. ఈ మహత్తర విజ్ఞాన విషయాలు వారివారి యోగదృష్టులకూట-ధ్యాన సమాధికూట దేవుడెరుగునుగాని కనీసం స్వప్నమార్గాలలోనైనా - రకరకాలుగా వున్న కలలలో ఏ విధమైన కలలోనైనా వారికి గోచరం కాకపోవడం మనకు విచిత్రంగా కన్పిస్తుంది. అంతేకాదు. ఇంతింతలై యెంతెంతానో యెదిగి పోయారనుకున్న యోగీంద్రులకు మునీంద్రులకు యెవ్వరికీకూడా యోగ శాస్త్ర - 'యోగదర్శన' గ్రంథనామంలో గాని, సూత్రాలలోగాని-పతంజలి ప్రయోగించి నిర్దేశించిన - ఉద్దేశించిన "యోగ" శబ్ద స్వరూప- స్వభావాలు పూర్ణంగా శాస్త్రీయ దృక్పథంతో అవగాహనే కాలేదంటే మనకు మరీ విడ్డూరంగా కనిపిస్తుంది.

పతంజలి మహర్షి "యోగ" శబ్దాన్ని గ్రంథనామంలోనూ, సూత్రాల్లోనూ శ్లేషతో అసాధారణంగా ప్రయోగించాడు. "యోగ" శబ్దానికి మామూలు యోగార్థమే కాక "యుగం యొక్క భావం యోగం" అని రెండు శక్తుల కలయికతో మూడవశక్తి ఉత్పన్నమవుతుందనీ, సామాన్యార్థాలు చెప్పడం జరుగుతుంది. అసలు పతంజలి ప్రయోగించిన "యోగ" శబ్దం అకార ప్రశ్లేషతో కూడినది. దాసః + అహం=దాసోహం అయినట్లు-శివః + అహం=శివోహం అయినట్లు-యః + అగః అన్న శబ్దాలు "యోగ" రూపం దాలుస్తాయి. అకార ప్రశ్లేషతో వున్న సంధి రూప శబ్దాన్ని శ్లేషార్థంతో ప్రయోగించినపుడు ఆ అకార ప్రశ్లేష లోపిస్తుంది. ఇక్కడ ప్రయుక్తమైన "అగ" శబ్దంచేత కుండలిని - సర్పం-వానపాము (చేపలు పట్టడానికుపయోగించే మట్టిలోకూ త్రికే మెరటి వానపాము) చెట్టు-లత - కొండ - రాయి - రాతిమిదం - (మొదుర్కాయి) మొదలైనవి. ప్రతి

గృహీతాలవుతాయి. సమస్తసిద్ధులకూ మూలభూతాలైన "జన్మౌషధి మంత్ర తపస్సమాధి 'శాస్త్ర మార్గాల్లో బహ్వర్థదాయకమైన యీ 'అగ' శబ్దంతో నిర్దిష్టాలైన వాటిల్లో యేదో ఒకటి తప్పనిసరిగా ఉపయుక్తమైతీరుతుంది. సర్వసిద్ధులూ యీ బహుముఖాలుగా వున్న 'అగ' రూపాలలో యేదో ఒకదానిమీద ఆధారపడి ఉపలభ్యమయ్యేవే. అందువల్లనే యః=యే, అగః=అగంవున్నదో దాని శక్తికి సంబంధించిన శాస్త్రం అని యోగశాస్త్రం పేరు సార్థకంగా పెట్టడం జరిగింది. అనేకార్థదాయకమైన యీ 'అగ' శబ్దం చేత "జన్మౌషధి మంత్ర తపస్సమాధు" లకు సంబంధించిన కీలకమైన పదార్థాలు నిర్దిష్టాలయ్యాయి. అసలు యోగశాస్త్రమే అయిదు అర్థాలతో విరచింపబడిందన్న సంగతి గుర్తించలేని ప్రాచీనులు "యోగ" శబ్ద అనేకార్థాలను గుర్తించకపోవటంతో ఆశ్చర్య పడవలసిందేమీలేదు.

యోగ శాస్త్రకర్త అయిన పతంజలీ - పాణిని అష్టాధ్యాయీ వ్యాకరణ మహా భాష్య కర్త అయిన పతంజలీ _ ఒక్కడే ననే అభిప్రాయం ఉన్నది. పతంజలి శరీరశుద్ధికై వైద్యశాస్త్రాన్నీ, వాక్‌శుద్ధికై వ్యాకరణ మహాభాష్యాన్నీ, అంతశ్శుద్ధికై యోగశాస్త్రాన్నీ రచించాడని త్రికరణశుద్ధి గ్రంథకర్తగా అనుస్యూతంగా ఒక ప్రశస్తి ఉన్నది. కాని వ్యాకరణ మహా భాష్యకర్త అయిన పతంజలి వైద్య గ్రంథం కూడా వ్రాయడం వల్ల యీ పతంజలే యోగ శాస్త్ర గ్రంథకర్త అన్న అభిప్రాయం పరిశోధక విమర్శకులలో కలిగింది. ఈ విధంగా అభిప్రాయపడిన వారిలో ఒకప్పుడు నేనూ ఉన్నాను. కాని షడ్దర్శనాల వ్యవస్థను వాటి వేద విజ్ఞాన దృక్పథాన్ని శ్లేషాత్మకత్వాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు షడ్దర్శనాలు పాణిని మహర్షి కంటే అత్యంత ప్రాచీన గ్రంథాలనీ - కాగా యోగదర్శన కర్త అయిన పతంజలి వ్యాకరణ మహాభాష్యకర్త అయిన యిటీవలి పతంజలి కాదనీ-పాణిని కంటే కూడా అత్యంత ప్రాచీనుడనీ - స్పష్టపడుతున్నది. యోగ శాస్త్రం అయిదు శాస్త్రాల సమ్మిళిత - సంకలిత గ్రంథం కావడంవల్ల వైద్యశాస్త్రపరంగా శరీర శుద్ధినీ - మంత్రశాస్త్రపరంగా వాక్ శుద్ధినీ- యోగశాస్త్రపరంగా అంతశ్శుద్ధినీ కలిగించేది కాబట్టి త్రివిధాలుగా త్రికరణ శుద్ధికై పతంజలి ఆ యా త్రివిధ గ్రంథాలను రచించాడన్న దృష్టితో అసలు యోగదర్శన గ్రంథకర్త నుద్దేశించే ఆ "త్రికరణశుద్ధి" గ్రంథకర్త అన్న ప్రసిద్ధి ప్రాచీన కాలంలోనే వచ్చివుండవచ్చును.

అయితే అసలు దేవవేద విజ్ఞానదృష్ట్యా షడ్దర్శనాలకున్న బహుముఖ విషయ ప్రతిబింబకమై అనేకార్థకత్వం యెప్పుడో అత్యంత ప్రాచీన కాలంలోనే కనుమరుగైపోయింది. కాగా ఈ న్యాయ, వైశేషిక, కర్మ - ధర్మమీమాంస, బ్రహ్మసూత్ర (వేదాంతదర్శనం), సాంఖ్య, యోగ, దర్శనాలారింటికీ బహుముఖాలుగా ఉన్న అనేక శాస్త్రత్వాలను నిరూపిస్తూ అనేకార్థకత్వాల దృష్టితో నేను మహా భాష్యాలు విరచిస్తున్నాను.

ఇంక నాస్తిక దార్శనికులైన చార్వాకాదుల గ్రంథాలగురించి సూత్రప్రాయంగా నాలుగుమాటలు. ఖగోళం లేనిదే విశ్వసృష్టేలేదు. ఈ అనంత విశ్వంలో భూగోళం ఒక చిన్న గోలీవంటిది. ఖగోళ విజ్ఞానం లేకుండా విశ్వంలోని యే పదార్థం గురించైనా మాట్లాడే అధికారం యెవ్వరికీ వుండదు. ఈ విశ్వసృష్టి అంతా కాల-శబ్దమయం- కాగా ద్వితీయమైన వేదమంతా అనంత బహుముఖ ఖగోళ ప్రకృతి విజ్ఞాన సంభరితమే, వేదవిజ్ఞాన ప్రతిబింబకాలైన షడ్దర్శనాలకు విరుద్ధంగా అవతరించిన "చార్వా" కాది దర్శనాలు అప్రామాణికాలనడంలో సందేహం లేదు. ద్రవ్యగుణ వివేచనలకూ దిక్కాలశబ్ద వివేచనలకూ - దిక్కాలాతీత వ్యవస్థలకూ - విభిన్నంగా విదూరంగా అవతరించిన యే శాస్త్రమైనా అవాస్తవికమే అవుతుంది. ప్రకృతి విరుద్ధమే అవుతుంది. కాగా అజ్ఞాన విలసితమే అవుతుంది

# చెప్పు తెగింది....

## శ్రీ బండారు పర్వతాలరావు

గమ్యం వేగంగా చేరుకోవాలి
కాని చెప్పు యిప్పుడే తెగిపోయింది
కాలు తీయకుండానే కాలు వేయడం
కష్టాలలోకెల్ల కష్టంగా వుంది.

అన్నార్తుడి కడుపులో పరిగెత్తే
ఎలకల్లా పని తొందర పెడుతూంది
పాదం తొలుచుకు కూర్చున్న బ్రేకులా
పాదరక్ష మొరాయిస్తోంది

తెగిన చెప్పు నవ్వులు చిలుకుతుంది
అందులో అడుగు మనది కానప్పుడు
ఆ సంగతి తరువాత — ముందు
ఓ మేకు కొట్టేవాడిని పట్టాలిప్పుడు

ఈ రావిచెట్టు క్రిందనే ఓ కాబ్లర్
ఎప్పుడూ కూచొనేవాడు
ఇదేం పరీక్షో తెలియదు
ఈరోజు అతగాడు లేడు

ఇవ్వాళ వేసికొచ్చిన పాంటుకు
గుండీలన్నీ ఉన్నాయి - ఖర్మ !
నిన్న వేసుకున్నదయితే సమయానికి
దొరికేది ఓ పిన్నీసన్నా

కష్టాలు ఒంటరిగా రావు
గాజు తలుపుల షో మార్టు తెరచే వుంది
వారం కింద బేరం చేస్తే చెప్పులు
వాడు నవ్విన నవ్వింకా గర్తుంది

వాడి చూపు నానుతోంది నా తెగిన చెప్పుమీద
హేళన కురుస్తూ—
తెగిన చెప్పు జారుతోంది నా గుండెల మీద
కారం రాస్తూ—

వెధవ! కాళ్లు పట్టుకొని తొడుగుతాడు
వెళ్లి కొనేస్తాను ఓ జత
"పాతికే వున్నాయి జేబులో, మరవొద్దు
పాలడబ్బా" — అంటోంది మమత

విసిరి పారేసి పాడు చెప్పులు
విసవిసా నడవనా నిర్భయంగా ?
కాళ్లు కాలినా ఫరవాలేదు
కాని, పరువు పోతుందని బెంగ

'పాపం, సింపిల్' అంటారు చొక్కా చిరిగితే
'పాషన్' అని భ్రమిస్తారు క్రాఫ్ చెరిగితే
'కవి గదా' అని సరిపెట్టుకుంటార్లు గడ్డం మాస్తే
కాని చచ్చిని చావుగదా చెప్పుతెగితే

అమ్మయ్య యిక్కడ దేవుడు కూచున్నాడు
చెప్పులు కుట్టే ముసలాడిలా వచ్చి
తీరా చెప్పులు చూపిస్తే పెదవి
విరుస్తాడేమో యిక బాగుచేయడం కుదరదని చెప్పి

పక్కకు తిరిగి తుపుక్కున ఊస్తాడు
అలవాటేకాని అవమానించాలని కాదు
పావలాకు అర్థ అడుగుతాడు
పేదరికమే గాని పేరాశవల్ల కాదు

తప్పకనే తునాతునకలైనా ఈ
చెప్పును కుట్టిస్తున్నానని తెలుసు
ఆజన్మంగా లేమి బాధలు తెలిసిన
అనుభవం తోపనీయదు అలుసు

మొత్తం మీద యివాళ్టికి
ఎలాగో రక్షించాడు
కాస్త నిలబెట్టాడు, కాని
చెప్పు బాగానే కుట్టిచ్చాడు.

పాపం, వాడే కొంచెం
పాలిష్ కూడా కొట్టాడు

మధ్యతరగతి గాంభీర్యాన్ని
మేకు కొట్టి నిలబెట్టాడు

గబగబా నడుద్దామంటే గడగడ
మళ్ళీ తెగుతుందేమోనని
నిదానంగా పోదామంటే గుండెదడ
పని చెడుతుందేమోనని

గమ్యం గికురిస్తోంది
వేగంగా చేరుకోవాలి
మళ్ళీ ఫస్ట్ వచ్చేదాక నన్నా
చెప్పులు లాగేలా చూసుకోవాలి.

---

# కవి సమ్మేళనాలు !

## శ్రీ యస్. యస్. రెడ్డి

చుర్రుమనే కవితా పంక్తులకు
చర్రుమని కరతాళ ధ్వనులు
చప్పట్లే.... కవితా కొలమానం
అనుకుంటే........
దుడ్డుకర్రే ధ్రువతాళం
అనుకున్నట్లు అవుతుంది
కొందరు బ్రహ్మాండంలా వ్రాసి
బండినడకలా పఠిస్తారు
ఎడింన సెలయేరులా వ్రాసి
ఎగజిమ్మే జలపాతంలా
చదువుతారు మరికొందరు
ఇంద్రధనుస్సులా అల్లి
ఇన కిరణాల్లా గొంతుతంతి
సవరిస్తారు ఒకరో - ఇద్దరో !
ఛందస్సును చెలాకిగా వాడి
చైత్రను తలుకొత్తేలా
చమత్కరిస్తారు ఛాందసులు—
వాచ్యం వచనకవితలో
విచ్చల విడిగా....
అయోమయంగా....
స్వేచ్ఛ సారధ్యం వహిస్తారు
వచన కవితా స్వాములు—
ఇవన్నీ అసంపూర్ణ మార్గాల్లు
వాహనం ఏదైనా
గమ్యం ఒక్కటే కదా ?
వ్యంగపదును
వ్యవహారిక భాషా వొడుపు
క్లుప్త సందీప్తత
వాస్తవ ప్రాప్తకాలజ్ఞత
కవితలకు
సమ్మేళన చవ్రతులకు
ధాణింపు.... !

---




గవర్నరుపేటలో సామాన్యంగా సోమసుందరమును ఎరగని వాళ్లు లేరు. అతనందరికీ వింతగా కనబడేవాడు. సౌమ్యస్వభావుడైనా చిన్ననాటి నుంచీ ఎప్పుడూ ఇల్లు పట్టక తిరుగుతూ ఉండేవాడు. అతనికి సావాసాలెక్కువ. ముఖ్యంగా అతను లక్ష్మీకాంతము గదికి తరుచుగా వెళ్లుతుంటాడు.

లక్ష్మీకాంతము ఒంటరిగా వచ్చి బెజవాడలో చదువుకుంటున్నాడు. పెద్దవాళ్లు కోపపడతారనే భయము లేకపోవడముచేత పగలంతా పదిమంది స్నేహితులను చేర్చి చీట్లాడుతూ కాలము గడిపేవాడు.

వేసంగి ప్రవేశించింది పొద్దుటిపూట స్కూలు పెట్టినారు. ఎండలు చిటపటలాడుతున్నవి. ఎట్టిటి యెండలో కూడా మన సుందరము ఆ చీట్లాడే చోటికి రోజూ పన్నెండు కొట్టేటప్పటికి హాజరయ్యేవాడు. కాని పాపమతనికి చీట్లాడడము బొత్తుగారాదు. బస్తీలో పుట్టి పెరిగి ఇంగ్లీషు చదువుకుంటూ చీట్లాట రాకపోవడము తోడి వాళ్ళకు కేవలము హాస్యాస్పదంగా కనపడేది. వాళ్ళంతా సోమసుందరాన్ని చీట్లాడలేనందున ఎగతాళి చేస్తూఉన్నా, అతను మాత్రము రోజు అక్కడికి వెళ్ళి వాళ్ళాడుతుంటే కాస్తసేపుఊరికే చూస్తూ కూచుని తర్వాత మరి ఒక స్నేహితుని ఇంటికి వెళ్ళుతూ కాలము గడుపుతూ ఉండేవాడు.

మన చీట్లపేక క్లబ్బుకు అవతలి ఇంట్లో మాధవరావు ఉంటున్నాడు. అతనికి పెళ్ల పోకడలేమీ తెలియవు. ఎప్పుడూ చదువేమో తానేమో అన్నట్లు సంచరిస్తూ ఉంటాడు, చీట్లాటలో ఆరితేరిన వాడే. ఐనప్పటికి అతను లక్ష్మీకాంతం ఇంట్లో క్లబ్బులో మెంబరుగా చేరలేదు. ఓర్పులేని తనము వల్లనో మరి ఎందువల్లనో కాని, కొంతమంది మాధవరావు పెద్దమనిషితరహా అంతా పట్టి టక్కరు తనమనేవాళ్ళు.

ఆ వైశాఖమాసములో ఎండలూ, గాడ్పులూ తీవ్రంగా ఉన్నవి. వడదెబ్బకు పాపము కొంతమంది పసి పిల్లలుకూడా పోయినారు. ఒకనాడు మధ్యాహ్నము సోమసుందరము భోజనము చేసుకొని లక్ష్మీకాంతము గదికి వచ్చినాడు. లోపల చాపలు వేసుకొని లక్ష్మీకాంతమూ స్నేహితులు ఆటట్లు ఆడుతున్నారు. ఒకడు ఆటఅన్నాడు. ఇంకొకడు అడ్డు అన్నాడు. ఆటపరతు పై షరతులదాకా పెరిగిపోయింది. దిగుడు చెయ్యి వాడు గంభీరంగా ముక్కదిగినాడు. ఆట అనర్గళంగా సాగిపోతున్నది. అంతపట్టున వాళ్ళు ఆడుతున్నప్పటికీ సోమసుందరము లోపలికి రాగానే సభవారంతా పక్కున నవ్వినారు ఎందుకు నవ్వినారో సోమసుందరానికి అర్థం కాలేదు. అతని మనస్సు పువ్వువలె కోమలమయినది. ఎప్పుడయినా స్నేహితులు ఎగతాళి చేస్తే అతను ముఖము చిన్నబుచ్చుకొనేవాడు. అతనికి కష్టముగాఉన్న కొద్దీ తోడి వాళ్ళు ఎక్కువగా ఎగతాళి చేస్తూ ఉండేవాళ్ళు. కాని ఆరోజు మరీ అతనికది దుర్భరమైనది. అక్కడ వుండలేక బయటికివచ్చి వడగాడ్పు తోలుతూఉన్న పంచలో అరుగుమీద కూచుని శూన్యభావంతో ముందు వైపునకు చూస్తూఉన్నాడు.

అట్లా చూస్తూ ఉండగా సుబ్రహ్మణ్యమనే కుర్రవాడు మాధవరావు ఇంటివైపు రావడ మతనికి కనబడ్డది. సుబ్రహ్మణ్యమూ సోమసుందరమూ మూడవ ఫారం వరకు బెజవాడ హిందూహైస్కూలులో కలిసి చదువుకున్నారు. కాని ఈ మూడేళ్ళనుంచీ చెడు సావాసాలవల్ల సుబ్రహ్మణ్యము సరిగా బడికి పోక చదువులేకుండా తిరుగుతూ ఉన్నాడు అతన్ని చూడగానే షుమారు పందొమ్మిదేళ్ళ ప్రాయమువాడని తెలుస్తుంది. కొంచెము ఎర్రనివాడే. అయినప్పటికీ అందగాడన్ని చెప్పడానికి వీలులేదు. కాని అతనికి మాత్రము ఆ విషయమున అనుమాన మణ

మాత్రమైనా లేదు. మరీ ఈ మధ్య పిలక జుట్టు కత్తిరించుకుని క్రాపింగు పెట్టుకొన్నప్పటి నుంచీ తన ముఖానికి వికాసము హెచ్చిన దనీ అసలు నూతన జీవమే వచ్చినదనీ అద్దంలో మాటిమాటికి చూసు కుని ఆనందించేవాడు.

సుబ్రహ్మణ్యము మాధవరావింటికి రావడమారంభించి కొద్ది రోజులే అయింది. అదివరలో వాళ్ళిద్దరికి విశేషంగా స్నేహమున్న దని మాత్రం చెప్పలేముకాని ప్రస్తుతమురోజూ అతను మాధవరావు గారింట్లో కనపడతాడు. ఇవ్వాళ చక్కగా తలదువ్వుకొని పచ్చటి రాజమండ్రి సిల్కు ఉత్తరీయము కమ్ములు తీర్చి డాబుగా కనపడేటట్లు కప్పుకొని కొత్తగా వస్తున్న కోర మీసాలు దువ్వుకుంటూ తాంబూలము నములుతూ మాటిమాటికి చెయ్యిపెట్టి క్రాపింగు సద్దుకుంటూ వస్తూ వుంటే సుబ్రహ్మణ్యము బహు వింతగా కనపడ్డాడు, వేషమంతా మారి పోయింది. అదేమి, నడక కూడా మారిపోయిందే! వాని కోడిపుంజు నడకా అదీ చూడగానే సోమసుందరానికి నాటకములో వచ్చే వేషాలు జ్ఞాపకము వచ్చాయి.

సోమసుందరానికి పదిహేనేళ్ళ కంటే ఎక్కువ వుండవు. వాని ముఖంలో ఒక విధంగా అమాయకత్వము కనబడుతుంది. అయి నప్పటికీ తెలివితేటలూ ఊహలు తక్కువ లేవని అంతా అనుకునే వాళ్ళు. మాధవరావింట్లోకి పోతున్న సుబ్రహ్మణ్యాని చూచి అతను నవ్వినాడు. సుబ్రహ్మణ్యము ఏమీ మాట్లాడక అతనివైపు కొరకొర లాడుతూ చూస్తూ లోపలికి వెళ్ళినాడు. సోమసుందరము అరుగు మీదనే కూచుని మళ్ళీ శూన్యదృష్టితో ముందువంక చూస్తున్నాడు. అట్లా చూచేటప్పుడతని పెదవులు చిరునవ్వుతో వికసిస్తవి. కళ్ళు కల వరిస్తున్నట్లు కనపడి చూచే వాళ్ళను ముగ్ధులను చేస్తవి.

సుబ్రహ్మణ్యము మాధవరావు ఇంట్లోకి వెళ్ళి రెండు నిముషము లయింది. సోమసుందరుడేదో పరధ్యానంగా కూచుని ఉన్నాడు. ముందు సూటిగా చూస్తూ ఉన్న అతని దృష్టులేలనో మాధవరావింటి వైపు మరలినవి. మెరుపు మెరిసినంతసేపులో అతని కంటికి పచ్చని ధుమాలు గాలిలో ఎగరవేసి ఎవరినో పిలుస్తున్నట్టు కనపడ్డది. సోమ సుందరుని ధ్యానం మరలినది. ఉన్నట్టే ఉండి ఎదురింటి వైపుకు చూపులు మరలించినాడు. అప్పుడు వాని కళ్ళకు చక్కని మెరుపుతీగ వంటి ఒకానొక బాలిక సొంపుగా సింగారించుకొంటూ ఆ యింటి కిటికీ వద్ద కానవచ్చినది.

ఆ మేడలో స్వామినాధయ్యరుగారు ఉన్నారు ఆయన కోయం బత్తూరు వాడయినప్పటికీ తెలుగు జిల్లాలోనే చాలా కాలము నుంచీ ఉద్యోగం చేస్తూ ఉన్నందువల్ల తెలుగు రకంగానే ఉంటాడు. ఆయన పిల్లలు కూడా తెలుగు దేశములోనే పుట్టి తెలుగు బళ్ళలోనే చదువు కుంటూ ఉండటము చేత వాళ్ళు మన పిల్లలవలనే తెలుగు చక్కగా మాట్లాడతారు. ఆయనకు ఆడపిల్ల ఒక్కతే. ఒకసారి వాళ్ళంతా. స్వదేశము చూడటానికి వెళ్ళినపుడు తాతగారూ వాళ్ళంతా అరవమే మాట్లాడడము విని అప్పటికి అందరిలోకి చిన్నదైన కమలం, "ఏమిటి ఈ అరవగోడూ" అన్నందుకు వాళ్ళ తాతగారామెను తన జీవిత కాలములో క్షమించ లేదట. ఆమెకు ఇప్పుడు పదమూడు సంవత్సరాల ఈడు ఉంటుంది. దక్షిణాదిస్త్రీలు ఎప్పుడూ కొర్నాటి చీరెలు కట్టుకుంటూ రెండుమూడు బట్టలతోనే కాలము గడుపుతూ ఉంటార్లని మన వేపున అంతా అనుకుంటారు. ఒకవేళ ఆ మాట నిజమైనప్పటికీ కమల కొర్నాటి చీరలు మాత్రమే కట్టుకోక బొమ్మరంగు చీరలు, ఊదారంగు సిల్కు చీరలు రకరకాలవి కట్టుకొని ఎంతో నాజూకుగా ఉండేది. ఆడపిలుసు ఒక్కతే కావటముచేత తల్లిదండ్రులు ఆమె అడిగినదల్లా కొంటూ గారాబముగా చూచుకొనేవాళ్ళు, ఇంకా పసితనము పూర్తిగా వదలక పోవటమువల్ల ఆమె ముచ్చటగా ఇంట్లో ఇటు అటు తిరుగుతూ ఉండేది.

మంచి గౌరవముగల వంశములో జన్మించిన పదిహేనేళ్ళ కుర్ర వానికి లోకానుభవము చాలా తక్కువగా వుంటుంది. అది మంచీ, చెడ్డ బాగా తెలియని ఈడు. అందులో భయభక్తులతో పెరిగిన సోమసుంద రానికి ప్రపంచములో జరిగే విచిత్ర కార్యాలు ఏమి తెలుస్తవి. అయి నప్పటికీ విద్యావంతుల కుటుంబములో జన్మించిన హేతువున అతని బుద్ధి కుశాగ్రముగనున్నది. అందులో మనస్సుకు కూడా వికాసము అప్పుడే కొద్దిగా ఏర్పడుతున్నది.

పక్కయింటిలో సుబ్రహ్మణ్యము ఉత్తరీయము ఎగరవేయడ మూ ఎదుటిమేడలో అప్పుడే చక్కని మెరుపు తీగవంటి ఒకానొక బాలిక సింగారించుకొంటూ కిటికీ వద్ద కానరావడమూ చూడగానే సోమసుందరుని మనస్సులో ఏదో సందేహము ఏర్పడినది. బాగుగా చూచినాడు. చక్కగా ఆలోచించినాడు. కొంతసేపు పస్తాయించి అరుగు మీదనుంచిదిగి ఇహ ఆరోజు స్నేహితుల ఇళ్ళకు వెళ్ళకుండా సరాసరి ఇంటికి వెళ్ళిపోయినాడు కొంతకాలము గడచినది. సోమసుందరుడు లక్ష్మీకాంతమింటికి మామూలుగానే వస్తున్నాడు. మాధవరావింటికివచ్చే సుబ్రహ్మణ్యము వేషము ఆరోజుకారోజు విచిత్రమవుతున్నది. అతను అంత సంపన్నుడు కాడు. మునుపు మురికిగుడ్డలు కట్టుకొని వీధుల వెంటతిరిగేవాడు. ఇప్పుడు పూటకొక రకము దుస్తులు ధరిస్తున్నాడు. ప్రొద్దునపూట విస్త్రి మల్లు కట్టి పట్టుచొక్కా తొడిగి పైన పచ్చని రాజమండ్రి సిల్కు వేసుకొంటే సాయంత్రానికి అవి తీసి వేసి జరీ పంచె తీర్చి కట్టుకొని, పిండి పెట్టి గ్లాసువలె నున్నగా విస్త్రిచేసిన కప్పులుగల లాంగ్లాతు చొక్కా తొడుక్కుని నడుముకు వలిపెపు ఉత్తరీయము బిగించి మాటిమాటికి స్వామినాధయ్యరుగారి ఇంటివేపు

వ గుంటకళ్ళతో చూస్తూ తెచ్చి పెట్టుకొన్న కొత్త నడకలతో మాధవరావుదగ్గరకు వచ్చి పోతూంటాడు. ఇక అతను క్రాపింగు దువ్వే పద్ధతులకు అంతే లేదు.

ఒకసారి జుట్టు అంతా పైకిదువ్వి" విశాలమైన నుదురు కలవాని వలె కనబడతాడు. ఇంకొకసారి ముందుకు దువ్వి ప్రబంధ స్త్రీల ముంగురులు జ్ఞప్తికి తెప్పిస్తూ ఉంటాడు. మరొకసారి వెంట్రుకలు పక్కకు వంకెలు వంకెలుగా దువ్వి గంగాతరంగములు శిరస్సున ధరించిన సాక్షాదీశ్వరుని అవతారము వలె ఉంటాడు. ఇక వాడు వాడుతున్న తల నూనెలకు, అత్తర్లకు లెక్క లేనేలేదు. సీతాకోక చిలుకవలె ఉంటున్నాడు.

## 2

మండు వేసంగి వెళ్ళిపోయినది. వానలు జోరున కురవడ మారంభించినవి. వానాకాలములో గవర్నరు పేటలో కూడా రోడ్లు శుభ్రంగా ఉండవు. ఎక్కడ చూచినా బురద, రోడ్డుమీద్దనే గుంటలు పడి నీళ్ళతో నిండు తుంటవి. రోడ్డు మధ్యనున్న చెట్లు సుఖప్రదంగా నీడ ఇచ్చినప్పటికి ఇప్పుడు మాత్రము వాన వెలిసిన తరువాత కూడా చిటపట చినుకులు రాలుస్తూ వీధులలో సంచరించేవాళ్ళకు చికాకు కలిగిస్తూ ఉన్నవి.

బెజవాడలో సహాయ నిరాకరణోద్యమము ప్రజ్వరిల్లుతున్నది. గాంధి మహాత్ముడు దేశీయ నాయకులతో వచ్చి వెళ్ళి ఎంతోకాలము కాలేదు. పెద్దలూ, పిన్నలూ, బాలురూ, బాలికలూ , రకరకాల ఖాదీ బట్టలు కట్టుకొని వూళ్ళో అన్ని మూలలా కన్నుల పండువుగా కనబడుతున్నారు.

సోమసుందరము పెద్దవాళ్ళ భయం చేతనో, చదువు మీద నున్న ఆసక్తి చేతనో పాఠశాలా బహిష్కారము మాత్రము చేయలేదు కాని ఖాదీ బట్టలే కట్టుకొనేవాడు. ఒకనాడతను కొత్త బట్టలు కుప్పడము అంచువి కట్టుకొని అనేకమైన రంగులు కలిగి పేముతో చేయబడ్డ చక్కని స్వదేశపు గొడుగు వేసుకొని, విలాసంగా తిప్పుకుంటూ, లక్ష్మీకాంతమింటికి వచ్చినాడు. కాని లక్ష్మీకాంత మింట్లో లేనందున స్నేహితులతో కొంతసేపు కాలక్షేపము చేయకుండా ఊరికే ఇంటికి తిరిగి వెళ్ళడానికి మనస్సు ఒప్పక నెమ్మదిగా వెళ్ళి పోతున్నాడు. కాస్త దూరము సాగిపోగానే మాధవరావు ఎదురయినాడు. అతను సోమసుందరాన్ని చూడగానే ఒరే! పెముకోళ్ళు తక్కువేగాని కాశీకి వెళ్ళుచున్న స్నాతకపు పెళ్లికొడుకులాగా ఉన్నావురా!" అని ఎకసక్కెమాడినాడు. పుష్పకోమలుడైన సోమసుందరుడు సిగ్గుపడి నవ్వగా అతని మనోహర నేత్రములలో సౌందర్యము వెల్లివిరిసింది.

సోమసుందరుడు వీధి వెంట నడుస్తున్నపుడు అతని లేడికళ్ళు ఎక్కడా నిలవక ఊరికే సంచరిస్తూ ఉంటవి, అప్పుడతనిని చూచే వాళ్ళకు ముచ్చటగా ఉంటుంది, మనసోముడి కళ్ళు మనఇంట్లో అందరి వాటికంటే అందంగా ఉంటాయి. అని అతని అక్కచెల్లెళ్లు అంతా అనేవాళ్ళు పూపవయస్కుడైన అతనికా మాటలు ఎంతో ఆహ్లాదము కలిగించేవి. శుష్కప్రియాలు పలికే భట్రాజు స్తోత్రాలకే లోకాను భవము కలవాళ్ళు కూడా ఉబ్బి తబ్బిబ్బులవుతున్నప్పుడు హృదయ పూర్వకంగా వాళ్ళు ఆ మాటలు అన్నపుడు సోమసుందరము పొంగడము లో ఆశ్చర్యమేమున్నది! అతని కన్నులే కాక రూపము కూడా మనోహరమైనది. పచ్చని బంగారము వంటిచాయ కొంచెము ఈడుకు మించిన పొడగరియై మనోజ్ఞమైన లతవలె సుకుమారముగా ఉంటాడు. ఈరోజున మరీ ఆ విచిత్రమైన గొడుగూ చక్కని అంచుల కొత్త ఖాదీ బట్టలూ కట్టుకొనివెళుతుంటే జగన్మోహనంగా ఉన్నాడు. కాబట్టి మాధవరావన్న మాటలలో వింత ఏమున్నది!

తర్వాత కృష్ణాతీరాన చల్లగాలికి తిరుగుదామని వాళ్ళిద్దరూ బయలుదేరి పోతున్నారు.

వాళ్లు నాలుగడుగులు సాగిపోగానే, చక్కని మబ్బురంగు చీరె కట్టుకుని కళ్ళనిండా కాటుక తీర్చి. ఎఱ్ఱ కలువలవంటి పాదాల మీద పసుపు ముద్ద గొలుపుతూ ఉండగా ఒయ్యారముగా అడుగులు వేసు కుంటూ వస్తున్నకమల ఎదురైంది. పేరంటమ్ముచేసే ఆడపిల్లలను చూడ డము ప్రతివాళ్ళకూ నిర్వ్యాజమైన ఆనందము కలిగిస్తుంది. సోమసుంద రానికి పుట్టుకతోనే సౌందర్య తృష్ణ ఉన్నది. ఆ కమల ముగ్ధమనోహర రూపము చూడగానే అతనిలో అప్పుడు నిర్వికారమైన ప్రేమభావ ముద్భవించి ఉల్లాసము కలిగించింది. వాళ్ళు రావడము చూచి కమల పక్కగా తొలిగిపోతున్నది. సోమసుందరమా పిల్లవంక చూచి మాధవ రావుతో, "ఈ అమ్మాయి స్వదేశీ వస్త్రాలు వేసుకుంటే ఇంకా ఎంత బాగుంటుంది!" అని కమలకు వినపడేటట్లుగా పలికి ముసిముసి నవ్వులు నవ్వినాడు. కమలకు అప్పుడే సిగ్గు కాస్త తెలుస్తున్నది. ఆ మాట లామె వినగానే సిగ్గుతో తల వంచుకుని కొంత దూరము నడిచి సోమ సుందరము వంక ఓరచూపొకటి విసిరింది. సోమసుందరమది చూచి నాడు.

పొంగిపొరలుతున్న కృష్ణవేణి మీదుగా మలయమారుతము వచ్చివాళ్ళదేహములను చుంబనము చేసినది. దగ్గరనున్న వేపచెట్టునుంచి పళ్లు జల జల రాలినవి. ప్రపంచమంతా సోమసుందరుని కంటికి నూతన శోభతో కానవచ్చింది. పక్కనున్న కాలవ మీద నుంచి పల్లె వాని ప్రేమపాట వాళ్ళకు కర్ణపర్వమైనది. అప్రయత్నంగా సోమసుంద రుని పెదవులవెంట పున్నాగ రాగము వెలువడినది. మందవాయువుతో

శ్రుతి కలిసి అతనిరాగము అవ్యక్త మాధురి ఒలికింది, ఎగితాళి చేయబోతున్న మాధవరావు కూడా ముగ్ధుడైపోయినాడు.

## 3

సోమసుందరమూ సుబ్రహ్మణ్యమూ ప్రతిరోజూ మాధవరావు ఇంట్లోగాని ఆ సమీపంలోగాని కలుస్తూన్నందువల్ల ఉభయులకూ చిన్న నాటి పరిచయము వృద్ధి ఔతున్నది. ప్రతిరోజూ సాయంకాలము ఇద్దరూ కలిసి ఇటు అటు షికార్లు చేస్తూ ఉండేవాళ్ళు. కమల కనపడి నప్పుడల్లా సుబ్రహ్మణ్యము వికారచేష్టలు చెయ్యడమూ సోమసుందరు డసహ్యించుకోవడమూ జరుగుతూ వచ్చాయి. సాయం సమయమందు చక్కని దుస్తులు ధరించి వాళ్ళిద్దరూ ఒకరితో ఒకరు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అయ్యరుగారింటి వైపు చూపులు మరలించి చూస్తూ ఉండేవాళ్ళు. కమలమ్మ మనస్సును వీళ్ళు ఆకర్షించినారని చెప్పలేము కాని వీళ్ళాదారిన వెళ్ళినప్పుడల్లా ఆమె ముస్తాబై నిత్యము కంటబడేది. దూరదృష్టి సూక్ష్మాలోచనా లేని సుబ్రహ్మణ్యము తన అందం చందం చూచి కమల భ్రమించుతూ ఉందని తలంచి మురుస్తూ ఉండేవాడు. సోమసుందరుని హృదయంలో ఈ గోడే లేదు. చక్కని వస్తువులనూ చక్కని మనుష్యులనూ చూడడమతనికి సరదా. కాబట్టి సౌందర్యరాశి ఐన కమల అతన్ని ఆకర్షించింది.

అది మంగళవారము. సాయంకాలము. సోమసుందరము బడి నుంచి వచ్చి పుస్తకాలు ఇంట్లో పడేసి కమలా దర్శనమునకై వెళ్ళి నాడు. ఆమెను ఒకరోజు చూడకపోతే అతనికి తోచేదికాదు సూర్యాస్త మయము అప్పుడే కాబోతున్నది. కమలమ్మ వాకిట్లో గుమ్మముదగ్గర చాపవేసుకొని వీధివైపు తలపెట్టుకొని పడుకొని ఉన్నది. సోమసుందరు డాదారిన వెళ్ళుతూ 'సుబ్రహ్మణ్యము'! అని కేక వేస్తూ కమల వంక తిరిగి చూస్తూ ఉన్నాడు. కమల అతని కంఠ స్వరము వినికాబోలు. లేవకుండానే తలఎత్తి సోమసుందరుని వంక చూచింది. అతనుకూడా ఆమె వంకచూచినాడు. ఇద్దరి చూపులూ కలిసినవి. సోమసుందరు డుల్లాస పూరితుడైనాడు. చీకట్లు ప్రపంచమున అల్లుకోసాగినవి. ఆహారార్థము పోయిన పక్షులు తమ కాంతలను కలుసుకొన వలె ననే వ్యగ్ర భావంతో గూళ్ళకు చేరుకుంటున్నవి. సోమసుందరుడు ఇంటికి మరలిపోయినాడు.

ఇది జరిగినకొన్ని రోజులకే ఒకనాడు సోమసుందరము చేత పుస్తకాలు పట్టుకొని బడికి వెళుతూ తలవని తలంపుగా సుబ్రహ్మణ్య మును కలుసుకున్నాడు. వీళ్ళిద్దరూ సాగిపోతూ ఉండగా దూరము నుండి ఎదురుగా వస్తూ ఉన్న కమలమ్మ కనబడ్డది. కాలువ అంచు ఖాదీచీరె కట్టుకుని నవ్వు ముఖంతో చేతిలో కరేపాకు విలాసంగా ఇటు అటు తిప్పుతూ మనోహరంగా వస్తున్నది. వర్షము కురిసి ఉండడము వల్ల రోడ్డంతా ఎండీ ఎండని బురదతో నిండి ఉన్నది. పాము మెలికలు తిరిగి ఉన్న ఆ సన్నని కాలి దారి గుండా ఆమె జాగ్రత్తగా వస్తూ ఉంటే నాగ కన్యకలు సోమసుందరానికి జ్ఞప్తికి వచ్చినారు. కవి తాత్మ కలవాడగుట చేత అతను ఆమె లావణ్యమును సుబ్రహ్మణ్యము వంక తిరిగి వర్ణింప సాగినాడు.

మొద్దు సుబ్రహ్మణ్యము పరవశుడైనాడు. "కమలమ్మను చేయ పట్టుకుని పలకరించేదా? అని సోమసుందరాన్ని అడిగినాడు. సోమసుందరము భయముతో "వద్దు" స్త్రీ సౌశీల్యము కాపాడవలసినది" అని కఠినంగా చెప్పినాడు.

ఒక్క నిముష కాలములో కమలవాళ్ళ సమీపానికి వస్తుంది. నిముషమగడిచినది సోమసుందరము కాలిబాట నుండి పక్కకు బురదలోకి దిగినాడు. సుబ్రహ్మణ్యము కదలలేదు. ఉద్రేకముతో అతని దేహము కంపిస్తున్నది; ముఖ మెఱ్ఱబారినది. చెమటలు పోస్తు న్నవి. ఉత్తరీయము జారుతున్నది. సుబ్రహ్మణ్యము మూర్ఖత్వమూ అతని ఆకారము చూచి కొంచెము భయముతో కాలి బాటనుండి అవతలికి తొలగ నుద్దేశించుచున్న కమలమ్మ నతడు హఠాత్తుగా చేయి పట్టుకున్నాడు. పక్కన ఉండి చూస్తున్న సోమసుందరము నిర్ఘాంత పోయినాడు. అతని కన్నులు చీకట్లు కమ్మినవి. ఇంతలో కమల ముఖము చిట్లించుకొని ధుమధుమ లాడుతూ కాల భుజంగివలె చేయి విదిలించుకొని ముందుకు సాగిపోయింది. సుబ్రహ్మణ్యము నిశ్చేష్టుడై నాడు.

కమల కొంతదూరము నడిచిపోయి సోమసుందరము వంక తిరిగి జాలి గొలుపుతున్న చూపులు ప్రసరింపజేసింది. ఆ చూపు అతని హృదయంలో ములుకులువలె నాటినవి. అతనికి కర్తవ్య తాజ్ఞానము వచ్చేలోగా సుబ్రహ్మణ్యము తలవంచుకొని నెమ్మదిగా జారి పోయినాడు. సోమసుందరము కొన్ని క్షణములపాటు అదే తీరున నిశ్చలుడై నిలిచి కొంతసేపటికి ధైర్యము తెచ్చుకుని అతని కళ్ళ ఎదుటనే జరిగిన ఆ భయంకర విషయమును గూర్చి ఏమి విరసము! ఎంత సాహసము! అని ఆలోచిస్తూ నెమ్మదిగా బడికి వెళ్లిపోయినాడు.

ఇప్పుడు సోమసుందరుని మనస్సునందు తరంగములవలె తలంపులు పొరలి వస్తున్నవి. ఉదయమున కమలమ్మను సుబ్రహ్మ ణ్యము అవమానము చేయడము, అప్పుడు తన్ను కమల కరుణరసము ఒలుకుతున్న నేత్రాబ్జములతో చూడడము పదే పదే జ్ఞాపకమువచ్చి అతని మనస్సును కలత పెట్టసాగినవి. స్కూలులో ఉన్నంతసేపు పిచ్చివానివలె వున్నాడు.

సాయంకాలము మామూలు ప్రకారమతడు లక్ష్మీకాంతము గదికి వచ్చినాడు. లక్ష్మీకాంతమూ మాధవరావూ మాట్లాడుకుంటు

న్నారు. వచ్చిన సోమసుందరాన్ని చూడగానే లక్ష్మీకాంతము "ఒరేయి ! నీవు రోజు రోజు కిట్లా అయిపోతున్నావేమిరా ?" అన్నాడు. మాధవరావు లక్ష్మీకాంతాన్ని చూచి వికటంగా కన్నుగీటినాడు. సోమసుందరము మనస్సు అక్కడలేదు. అందుచేత వారి పరిహాసపు మాటలు అతను వినిపించుకోలేదు. ఏమీ బదులు మాట్లాడకుండా కాస్తసేపు అక్కడ ఉండి సోమసుందరము లేచి వెళ్లుతున్నాడు. వెనకనుంచి లక్ష్మీకాంత మాధవరావులు నివ్వెరపోయి అతనివంక లెప్పవాల్చక వికటపు చూపులతో చూస్తున్నారు.

సోమసుందరుని హృదయమంతా కమలతో నిండియున్నది. అతను ఇప్పుడెక్కడికి వెళ్ళుతున్నాడో అతనికే తెలియదు. లక్ష్మీకాంతం దగ్గరకు వచ్చేటప్పుడు గాని నిత్యమూ కనపడే కమల మనో హర రూపము నేడతనికి కనబడలేదు. సుబ్రహ్మణ్యం వేసిన పరిహాస బాణ్యానికి ఆమె ఎంత సిగ్గుపడుతున్నదో ! అతని పక్కనే ఉండి అది నివారించలేకపోయినందుకు తనమీద కూడా కమలకు అసహ్యము కలిగిందేమో ! ఈ విధంగా మనోవేదన పడుతూ కాళ్లు నడిపించుకొని పోయిన చోటికి వెళ్లిపోయినాడు.

రాత్రి ఎనిమిది గంటలయినది. పండువెన్నెల కాస్తున్నది. భోజనమయిన తరువాత వాకిట్లో అరుగుమీద కూర్చున్న సోమసుందరుని మనస్సు తపిస్తున్నది. కమల తనను క్షమించినట్లు తెలుసుకోనిది అతని ఆవేదన శాంతించదు. చివాలున లేచి మాధవరావింటివేపు వెళ్లినాడు.

ఆ వేపుగా ఎవరో పెళ్లివారు ఊరేగుతున్నారు. గుంటూరు నుంచి రామదాసు మేళము వచ్చింది. సన్నాయిమీద రాళ్లు కరిగేట్లు నాగస్వరము వాయిస్తున్నారు. వేరేమీ ఆలోచించకుండా, పెండ్లి కొడుకునూ, పెండ్లికూతురునూ చూడకుండా' సోమసుందరము మేళము వద్దకుపోయి నిలుచున్నాడు. గానము మధురంగా ఉన్నది. రాగం వింటున్న కొద్దీ సుందరము హృదయము అనేక మార్పులు చెందుతూ ఉన్నది. అతని ఆత్మ కొంత శాంతించింది.

సంగీత మాగిపోయింది. ఊరేగింపుసాగిపోతున్నది. అన్ని రకాల వాయిద్యములూ అతని శ్రవణములలో కర్ణకఠోరంగా ప్రవేశిస్తున్నవి. అక్కడనే నిలబడి అయ్యరుగారి ఇంటివేపు చూచినాడు.

వాకిట్లో కమలమ్మ నిలుచున్నది. ఆమె తనవైపు చాలాసేపటినుంచి తదేక ధ్యానంతో చూస్తున్నట్లు గ్లాసులైట్ల వెల్తుర్లో అతనికి స్పష్టంగా కనపడ్డది. వాళ్ల ఇద్దరి చూపులు కలిసి సిగ్గుతో ఒండొంటితో పెనుగులాడినవి. ఆమె అప్పుడు తెల్లని వలిపెపుచీర కట్టుకొని గ్లాసు లైట్ల కాంతిలో మరింత ప్రకాశమానముగా ఉండి పండువెన్నెల శోభను తిరస్కరిస్తూ నిలుచుని ఉన్నప్పుడు సాక్షాత్తు మోహినీ విగ్రహం లాగా సోమసుందరానికి కనబడ్డది. ఇప్పటికెన్నోసారులు ఆమె అతన్ని చూచి ఉన్నది. అతనెన్నో సారులు ఆమెను చూచి ఉన్నాడు. కాని ఈరోజున మాత్రము ఎందువల్లనో ఆమె చూపు అతన్ని కలచివేసింది. మునుపెప్పుడూ తనలో కలగని భావాలు అతని హృదయంలో అప్పుడు మెరుపు మెరిసినట్లు ఉద్భవించి అతనికి అర్థం గాకుండా బాధపెట్టినవి.

కలత చెందిన హృదయముతో సోమసుందరము మాటిమాటికి కమలమ్మ ఇంటివైపు తిరిగి తిరిగి చూస్తూ నెమ్మదిగా ఇంటికి వెళ్లి పోయినాడు. రాత్రి పన్నెండు కూడా దాటింది. అయినా వానికి నిద్ర పట్టలేదు. చాలాసేపు పక్కపై ఇటు అటు అశాంతితో తిరిగి స్వప్నావస్థయేమో కమలచేయి పట్టుకొన్నట్లూ కమల తనవైపు ఏదోగా చూచినట్లూ కలవరిస్తూ పక్కలో నిద్రపోయినాడు.

తెల్లవారింది. రాత్రి నిద్రలేని బద్ధకముతోనూ మనస్సు నింకా వదిలి పోని ఆందోళనముతోనూ సోమసుందరము అరుగుమీద కూర్చుని దంతధావనము చేసుకుంటున్నాడు. ఇంట్లో వాళ్ళంతా ఎవరి పనిమీద వాళ్ళున్నారు. గడచిన రాత్రి జరిగిన సంగతి ఊరకే ఆలోచిస్తూ నోట్లో పెట్టిన వేలు కదపక అట్లే ఉంచుకొని నేలవంక చూస్తున్నాడు. అప్పుడు హఠాత్తుగా వాని అన్నగారు కళ్ళెత్తి చేసుకొని అతని వద్దకు వచ్చి వాని గడ్డము పట్టుకొని మోటుగా ముఖముపైకెత్తినాడు. సోమసుందరము ఉలిక్కి పడ్డాడు. "ఒరే వెధవా ! ఆ వెధవ సహవాసముచేసి చెడిపోతున్నావన్నట్టా !" అని గద్దించి పలుకుతున్న అన్నగారి మాటలు అతనికి వినపడ్డవి. ఈ సందడి విని వాళ్ళక్కగారు ఇంట్లోనుంచి పరిగెత్తికొని వచ్చి అన్న మోటుతనము చూచి పొద్దున్నే లేవగానే చిన్నవాణ్ణి పట్టుకొని అట్లా తిడతా వేమిరా ?" అన్నది ఆ మాటకు మరింత కోపంతో అన్న తమ్ముణ్ణి పట్టుకొని ఇటు అటు విదిలించి 'వీడా ! పాడు సావాసాలవల్ల చెడిపోతున్నాడు !" అన్నాడు.

"ఏమి చేశాడేమిరా ?" అని అక్క అడిగింది.

"ఏమని చెప్పమన్నావు ! చెప్పుకుంటే సిగ్గుకూడాను !" అని అన్న ధుమధుమ లాడుతూ వెళ్ళిపోయినాడు.

అక్కగారా మాటలకు నివ్వెరపోయింది.

ఇప్పటి వరకూ సోమసుందరము ఇంట్లో వాళ్ళెవరి చేతనూ ఒక్కమాట కూడా పడి ఎరగడు. అతని సత్ప్రవర్తనమూ శాంత స్వభావమూ కోమల బుద్ధి ఇంట్లో అందరికి ఆశ్చర్యం కలిగించేవి. అతను అభిమానవంతుడని తెలిసి ఇంట్లో అంతా బహు ఆదరించేవాళ్ళు. అంతలో ఇటువాడు.

ఈ విధంగా అన్నగారు అని వుండడానికి కారణము అతని నిష్కళంక హృదయానికి ఏమీ కనపడ లేదు. తనను ఎప్పుడూ

ప్రేమాతిశయంతో చూచే అకళంకుడైన తన అన్నగారు నిష్కారణంగా ఏ పాపమూ ఎరుగని తన్ను దూషించిన మాటలతని హృదయమును [illegible] చేయించినవి. అది కూడా అక్కగారిముందు తనకు [illegible] మరింత కష్టకారణమైనది.

అతనికి పిచ్చి ఎత్తినట్లయింది. దానికి తోడుగా ఇంట్లో వాళ్ళంతా అతని యెడల ఏదో వింతగా ప్రవర్తించసాగినారు. అవ మానము కలిగిన తర్వాత ప్రథమోద్రేకము కొంత శాంతించిన పిమ్మట అతను అన్నగారి కటువంటి దురభిప్రాయము తనపై కలగడానికి కారణమేమని ఆలోచింప నారంభించినాడు. మనస్సు పరిపరి విధాల పోయింది. తానామధ్యను చేసిన పనులు పలికిన మాటలు మెరుపులు మెరిసినట్లు వెంట వెంట అతని మనోవీధిలో పొడగట్టినవి. కాని అతను ఎంత శోధించుకున్నా సోదరుడు ఆ విధంగా కోపించడానికి తగిన హేతువు కనుపించలేదు. పోనీ, ఎవరైనా గిట్టని వాళ్ళేమైనా కల్పించి చెప్పినారా అంటే అతని కటువంటి వాళ్లు ఎవరూ లేరే! అతన్ని చూచిన ప్రతివానికీ అతని మీద ఒక విధమైన ప్రేమ కలిగేది. ఆలోచించిన కొద్దీ అతని మనస్సునందు కల్లోలము ఎక్కువ కాసాగినది. సుబ్రహ్మణ్యము ఆ వెనకటి రోజున వీధిలో పట్టపగలు కమలచేయి పట్టుకొన్నప్పుడు తాను దురదృష్ట వశాత్తుగా అతనివెంటనున్న సంగతి జ్ఞప్తికి వచ్చినది. అప్పుడెవరో ఒకరిద్దరు చూచి ఉన్నది కూడా పొడ గట్టింది." కాని ఆ విషయములో నేనే పాప మెరుగనే! సుబ్రహ్మణ్యా మును మొదటనే విచారించవలెనని ప్రయత్నము చేసినాను గదా! తర్వాత చీవాట్లు కూడా పెట్టినానే! ఇక నెన్నటికి ఆ దుర్మార్గుని ముఖము వంక చూడనని ఒట్టు పెట్టుకున్నానుగా! అని ఏమేమో వితర్కించుకున్నాడు. లోకానికి మనస్సు ప్రధానము కాదని పాపమా కుఱ్ఱవాని కెట్లా తెలుస్తుంది!

## 5

ఆరోజు మధ్యాహ్నం కమల కానరామికి మిక్కిలి చింతిల్లుతూ సుబ్రహ్మణ్యము కాలుగాలిన పిల్లివలె ఆమె ఇంటి చుట్టూ నడయాడు తున్నాడు. ఇంతలోచేయి కడుక్కుంటూ కమల అతన్నిచూచి లోపలికి పోయింది వాడు కిటికీ వద్దకు వెళ్ళి చూరునీడను నిలుచున్నాడు. వెళ్ళినాడో లేదో అని కమల తొంగి చూచింది. అది సుబ్రహ్మణ్యం కనిపెట్టి గచ్చకాయంత తెల్లని కాగితపుచుట్ట నొకదాన్ని కిటికీలో గుండా లోపలపడవేసి అక్కడ నిలవక గృహాభిముఖుడై గబ గబ నడచి పోతున్నాడు.

ఆ సాయంకాలం సోమసుందరుడు లక్ష్మీకాంతమింటికి వచ్చినాడు. దానిమ్మగింజలవంటి పలువరస కనబడేటట్లు కిల కిల నవ్వుతూ రోజూ వాకిట్లోకూచునే కమల నేడు కానరాకున్నది.మూర్ఖుడైన సుబ్రహ్మణ్యం ఏదో చేసి వుంటాడని ఊహించి అతడు ఉగ్రుడైనాడు. లక్ష్మీకాంతం వాళ్ళు తమ దోవన తాము పేకాడుకుంటూ ఉంటే అతను వెళ్ళి అరుగుమీద విచారమగ్నుడై కూచున్నాడు. సాయంత్రం రిగంట అయినా కమలజాడ కనబడలేదు. ఇహచేసేది ఏమీలేక హృదయభారంతో ఇంటికి వెళ్ళిపోయినాడు.

ఒక నెలరోజులిట్లా గడిచినవి. మాధవరావు ఇంటివద్ద సుబ్రహ్మణ్యం కనబడటములేదు. కాని ప్రతి సాయంత్రమూ సోమసుందరుడు ఒక్కడూ మాత్రము ఆవీధిన లక్ష్మీకాంతమింటికి పోతూ ప్రతి ఇంటిమీదా తన కమలనేత్రములు సారించి అలసట చెందుతున్నాడు. కాని కమల మళ్ళీ ఒక్కసారికూడ అతనికళ్ళ పడలేదు. ఆమె బయటకి రానందువల్ల ఆ బజారు కంతకూ కళ తగ్గిపోయింది. కారణము తెలుసుకోవలెనని సోమసుందరానికి అదుర్దా ఎక్కువవౌ తున్నది. కాని అతనికేమి తెలియరాలేదు. రోజూ కమలా దర్శన వ్యగ్రుడై ఆశతో అతడా వీధిన వెళ్తున్నాడు. కాని రోజూ కొండంత నిరాశతో తిరిగి వస్తాడు.

దసరా సెలవులు వచ్చాయి. బడిలేదు గనుక అతనిప్పుడు ఇంటిపట్టున ఉండక బజార్ల వెంబడి తిరుగుతున్నాడు. ఒకసారు ప్లీడరు గుమాస్తాలంతా కూడే తమలపాకు, బీడీల దుకాణమువద్ద పదిమంది పోగయి బిగ్గరగా మాట్లాడుతూ వుండడము చూచి సుందరము అక్కడికి వెళ్ళినాడు. అతన్నిచూచి ఒకడు మీ బావగారిగుమస్తా ఎవరిప్పుడూ! సూరయ్యేనా? అని ప్రశ్నించినాడు, సోమసుందరము దగ్గరకుపోయి "అవును అని తమలపాకు బీడీ కొంటానికి జేబులు చూచుకుంటూ నిలబడ్డాడు.

గుమాస్తాలంతా కోర్టుసంగతులు మాట్లాడు కుంటున్నారు. "ఏరోయ్, మనస్వామినాధయ్యరుగారిని గంజాము బదలాయించినారట. నాలుగురోజుల్లో ఆయనపోయి చార్జీపుచ్చుకోవాలట బందరునుంచి, ఆయన ఎవరూ! సుబ్బారావుగారుకాబోలు సికోర్టుకువస్తారట అని ఒక గుమస్తా ఇంకొకనితో అంటున్నాడు.

తమలపాకు బీడీ కొని నోట్లోపెట్టుకోబోతున్న సోమసుందరం ఆమాటలు విన్నాడు. ఏమది అతని ముఖమంతా మారిపోయిందే! అతని కన్నులు అశ్రుపూరితము లయినవి. కన్నీటిబొట్లు కారుతున్న దానిని తుడుచుకున్నాడు. పెదవులు విస్మితంగా వణకుచున్నవి. నిర్విణ్ణుడై అతడు ఇంటిబాటపట్టి పోయినాడు.

ఆ రాత్రి అతనికి అన్నము సయించలేదు. వాని తల్లి భోజ నము సరిగా చేయలేదేమిరా? అని అడిగింది. వంట్లో బాగాలేదన్నా

ఉతిను. తల్లి వళ్ళు పట్టుకుని చూసింది. వళ్ళుకాల్తున్నది. తీవ్రమయిన జ్వరంతో నిద్రపోయినాడు.

పొద్దున త్రిఫల కషాయంతో శీతాంశురసము తల్లి ఇచ్చినది పుచ్చుకున్నాడు. కాని జ్వరము రెండురోజులు పట్టిన పట్టు విడవలేదు. చలి పుట్టుతున్నప్పటికీ బయటికి రావాలని ప్రయత్నించినాడు. కాని ఇంట్లో వాళ్ళు పోనీయలేదు. అయ్యరుగారు ఇవ్వాళో రేపో వెళుతారు. సోమసుందరానికి ఆందోళన మరింత ఎక్కువయింది,

మూడవనాటికి సోమసుందరానికి జ్వరము కాస్త జారిఁది. ఆ సాయంత్రము వాకిట్లో అరుగుమీద వచ్చి కాసేపు కూర్చున్నాడు. అప్పుడు రామమోహన గ్రంథాలయము నుంచి తిరిగి వస్తూ లక్ష్మీకాంతము సోమసుందరుని చూచి ఒంట్లో బాగాలేదా !' అని అడిగి పక్కను వచ్చి కూర్చున్నాడు. సోమసుందరము ఆ రోజంతా లంకణ ప్రాయంగా ఉన్నందున బాగా మాట్లాడే శక్తిలేక నీరసించి హీన స్వరంతో మాట్లాడుతున్నాడు.

మాటల సందర్భాన లక్ష్మీకాంతము "మీ బావగారు ఈ మధ్య ఇల్లుకోసము వెదుకుతున్నట్లున్నారు. నేనున్న గదికి ఎదురింట్లో ఉన్న అయ్యరుగారు ఖాళీచేసి వెళ్ళిపోతున్నారు. ఆ యిల్లు బాగానే ఉంటుందనుకుంటాను!" అన్నాడు.

అయ్యరుగారి మాట రాగానే సోమసుందరానికి ప్రాణాలు లేచి వచ్చినది. ఇప్పటికి వెళ్ళిపోయినాడేమో! కమలను ఒక్కసారి చూచేందుకు కూడా వీలులేక పోయిందే అని ఇన్నాళ్ళూ దిగులు పడుతున్నాడు.

'అయ్యరుగారు వెళ్ళుతున్నారా? ఎప్పుడు వెళ్ళుతారేం ?'

'రేపు ప్రొద్దున వాల్తేరు ప్యాసింజరులో'

'ఏ వూరికయినా బదలాయింపు చేసినారా ఏమిః' అని ఎరగని వాని వలె సుందర మడిగినాడు.

"ఎరగవా ఏమిటి ? గంజాము బదలాయించినారుగా !" అన్నాడు లక్ష్మీకాంతం. తర్వాత కొంతసేపు లోకాభిరామాయణము మాట్లాడి అతను వెళ్ళిపోయినాడు.

## 6

ఆ రాత్రి సుందరానికి మళ్లీ జ్వరము వచ్చినది. తెల్లవారేసరికే, జ్వరమింకా పూర్తిగా జారకపోయినా, ఓపిక చేసుకొని లేచి ముఖప్రక్షాళనము చేసుకున్నాడు. జ్వరమింకా విడవనందున కూరగాయ వైద్యాలతో ఇహ లాభం లేదని ఆ పూట డాక్టరు కోసము కబురంపించినారు. డాక్టరు వచ్చి ధర్మామీటరుతో చూచి 102 డిగ్రీల జ్వరమున్నదని ప్రక్కను నిలుచుని ఉన్న సోమసుందరుని తండ్రితో చెప్పి 'సీసా పంపించండి' మందిస్తాను. పిల్లవాణ్ని గాలిలో తిరగనీయక కప్పుకొని పడుకోబెట్టవలెను!" అని మరీ మరీ చెప్పి వెళ్ళిపోయినాడు.

గడియారము ఎనిమిది కొట్టింది. లక్ష్మీకాంతం చెప్పినమాటలు సుందరం మరిచిపోలేదు. వాల్తేరు ప్యాసెంజరు తొమ్మిదింటికి బయలు దేరుతుంది. ఒక్కొక్క క్షణము గడిచిపోయిన కొద్దీ అతని కావేగము ఎక్కువవుతున్నది. మతిపోయిన వాని వలె పక్కమీద కాసేపు పడుకొని కాసేపు లేస్తున్నాడు. 'నేను తప్పక స్టేషనుకు వెళ్ళి నా కమలనొక్కసారి చూచితీరాలి' అని నిశ్చయించుకొన్నాడు. కాని తల్లి ఎదుటనే కూచుని ఉన్నది. అతని ఆందోళన కనిపెట్టిన ఆమె ఎంత సేపటికి అక్కడనుంచి కదలలేదు. ఇక చివరకు సోమసుందరము ఓర్చలేక లేచి నిలబడ్డాడు. 'ఎక్కడికి వెళ్ళుతున్నావురా !' అని తల్లి అంటూనే ఉన్నది.

ఇప్పుడే బయటికి పోయి వస్తానని మెల్లగా వీధిలోకి జారినాడు. వెంటనే అతను అరండల్ సత్రమువద్దకుపోయి బండి ఎక్కి చురుకుగా తోలమని బండి వానిని తొందర చేస్తూ స్టేషనుకు బయలుదేరినాడు. రయిలు దాటిపోతుందేమో అని అతను తహతహ పడుతున్నాడు. బండి స్టేషను వద్ద ఆగింది. సోమసుందరము చురుకుగా దిగి ఆతురతతో వంతెన దాటి ప్లాటుఫారం టిక్కెట్టు తీసుకొని వాల్తేరు ప్యాసెంజరు ఆగే ప్లాటుఫారంమీదికి వెళ్ళినాడు. రైలు ఇంకా ఉన్నందుకు అతనికి కాస్త మనస్సు కుదుట పడ్డది. కాని అప్పటికి రైలు వచ్చి పదిహేను నిముషాలయింది.

సోమసుందరము సరాసరి ఆడవాళ్ళ పెట్టె వద్దకు పరిగెత్తినాడు. అక్కడ కమల కనపడలేదు. వెఱ్ఱి ఎత్తిన వానివలె ప్లాటుఫారము మీద ఈ చివర నుంచి ఆ చివర వరకు పరిగెత్తినాడు. సెకండుక్లాసు బండిలో స్వామినాథయ్యరుగారు కూచున్నాడు. ప్లాటుఫారము మీద గుమాస్తాలు చేతులు కట్టుకుని నిలుచుని వినయంగా మాట్లాడుతున్నారు. కాని ఆ పెట్టెలో కూడా కమల లేదు. ఆమె కూచున్న పెట్టె అతనికి అడావిడిలో కనపడలేదు. అతని గుండెలు తటతట కొట్టుకుంటున్నవి. "వెళ్ళేముందు కమల నొక్కసారి చూచే భాగ్యము కూడా నాకు లేదా!" అని విచారపడ్డాడు.

రైలు కూత వేసింది. గార్డు సిగ్నలు ఇచ్చాడు. దూరదేశము వెళుతున్న మిత్రులవద్ద వారి ప్రేమాస్పదులు సెలవు తీసుకుంటున్నారు. బండిసాగింది. సోమసుందరము దేహము కొయ్యబారుతున్నది. సాగిపోతున్న రైలు ఇంతలో ఆగింది. కమల ఉన్న పెట్టె సుందరానికి కనబడ్డది. అతని ప్రాణాలు లేచి వచ్చినవి. వేరేమో ఆలోచించక అక్కడికి పరుగెత్తి పోయినాడు. 'కమలతో మాట్లాడడము ఎట్లా! పోనీ నా వైపు చూడడమైనా లేదే!' అని దిగులుతో ఏమీ తోచక నిశ్చేష్టుడై నిలవబడ్డాడు. మళ్ళీ రైలు కదలబోతున్నది. గార్డు

జెండా పట్టుకుని నెట్టుకుంటున్న జనాన్ని ఎట్లాగో బండిలోకి ఎక్కించి తలుపువేసి బుజ్జున బిగిలు ఊదినాడు. సోమసుందరుని ఆశలన్నీ అడుగంటినవి. కమల ముఖము కూడా చిన్నపుచ్చుకొనే ఉన్నది. ఆమె హృదయములో ఇప్పుడేమి భావములు నాట్యమాడుతున్నవో ప్రేమ తెలిసిన వాళ్ళకే గాని తెలియవు. సోమసుందరాన్ని ఆమె ఇంకా చూడలేదు. చివరకు సుందరము ధైర్యము చేసి ఓరగా నిలుచుని ఎలుగు బడుతున్న స్వరముతో 'కమలా! అని పిలిచినాడు. ఆ స్వరము బాధ పడుతున్నవాని మూల్గువలె నున్నది, కాని పిలుపుగాలేదు.

కమల అతనివైపు తిరిగి చూచింది. ఆమె ముఖము వెలవెల బారింది. వక్షస్థలము కంపిస్తున్నది. వేడి నిట్టూర్పు విడుస్తూ అమృతము ఒలుకుతున్న దృష్టులతో సోమసుందరాన్ని ముంచి వేసింది.

గార్డు జండా చూపించినాడు. రైలు కూత వేసి కదిలింది. ఇక కంటికి కనబడకుండా కమల ఎగిరిపోతున్నది. కమలా సోమసుందరములు ముగ్ధులై ఒకరి వంక నొకరు చూచుకుంటున్నారు. సోమ సుందరుని హృదయం కొట్టుకోనారంభించింది. హృదయమును వేయి సుత్తులు పెట్టి చితకకొట్టుతున్నట్లు భావించి పరితపించినాడు. కమల కన్నులలో నీరు గిరుక్కున తిరిగింది. నిస్సారముగా నున్న తన బాహులత నామె బయటికి చాచి సోమసుందరుని వంకకు ఊపింది! 'మరచిపోవద్దు' అని కోకిలస్వరము మృదుమధురంగా సోమసుందరుని చెవులలో ప్రతి ధ్వనించి పులకరింప చేసింది.

రైలు ప్లాటుఫారం దాటింది. తన కంబుకంఠము సారించి అతనివైపు చూస్తున్న కమల ముఖబింబము కనబడుతున్నంతసేపూ సోమసుందరుడు తన్మయుడై ప్లాటుఫారము మీద నిలుచున్నాడు. గంటకు ముప్పది మైళ్ళ వేగముతో రైలు అతని వద్ద నుంచి కమలమ్మను క్రూరముగా ఎత్తుకుని పోతున్నది. మళ్ళీ వాళ్ళు జీవితములో ఎట్లా కలుస్తారు !

సోమసుందరము నిశ్చేష్టుడైనాడు. చెమటలు దేహమునిండా కారుతున్నవి. హృదయ భారంతో ఎట్టెట్లో నెమ్మదిగా వంతెన దాటి బండిలో వచ్చి పడ్డాడు. ఇంతవరకూ తాను జ్వరముతో బాధ పడుతున్న సంగతి మరచిపోయినాడు. బండిలో ఎక్కగానే అతని బలహీనత తెలియవచ్చి సొమ్మసిల్లినట్లు పడుకున్నాడు.

బండి అరండలు సత్రము వద్దకు వచ్చి నిలిచింది. సత్రములో బొప్పాయి కాయలను కోసుకో వచ్చిన అతని తమ్ముడు ఎదురై 'నాన్నగారు నీ కోసము వెతుక్కుంటున్నారు' అని చెప్పినాడు. ఆ మాటలు విని సోమసుందరము ఇంటికి పరిగెత్తినాడు. ఎదురుగా తండ్రి వచ్చి 'వెళ్ళవద్దని ఎంత చెప్పినా వినక గాలిలో షికార్లు చేసివచ్చినావా?' అని కోప పడినాడు.

సోమసుందరమా మాటలు వినిపించుకోకుండా ఇంట్లోకి వెళ్ళి పచ్చడము కప్పుకుని కన్నీరు కాల్వలై పారేటట్లు విలపిస్తున్నాడు. కొద్దిసేపటిలో కప్పుకున్న పచ్చడమంతా కన్నీటితో తడిసి పోయింది.

# చలో!!

బ్రతుకుబాటతో
ప్రయాణిస్తున్న వరుడా!
"నిన్న" కృష్ణశాస్త్రి కవిత్వంలాగా"
"శోకమయంగా" కన్పించిందని
ఫికర్ మత్ కరో !!
"నేడు" "తిలక్ అక్షరాలలాగా"
"వెన్నెల్లో ఆడుకునే అందమైన
ఆడపిల్లలాగా"
గోచరించవచ్చు!
"రేపు" "శ్రీశ్రీ నవకవితలాగా"
"కదిలేది-కదిలించేదిగా
మారేది-మార్పించేదిగా
పాడేది-పాడించేదిగా
పెద్ద నిద్దుర వదిలించేదిగా
పరిపూర్ణత్వం బ్రదుకిచ్చేదిగా"
ప్రత్యక్షంకావచ్చు !!........___
సాహసంతోయి!!
నవ్వుతూనే ఉండు!!
ముందుముందుకు సాగుతూనే ఉండు!!

# కోర్కెలు!

పసిపాపల్లాంటివి!
పరమాత్మునిలాంటివి!
ఎంత లాలిస్తున్నా
బుజ్జగిస్తున్నా....
ఎన్ని నైవేద్యాలు పెడుతున్నా....
ముద్దుపులిస్తున్నా
"ఏదో కావాలని"
మారాం చేస్తూనే ఉంటాయి!
సతాయిస్తూనే ఉంటాయి!
పరీక్షిస్తూనే ఉంటాయి!

# చంద్రబింబం!

తగ్గినా మొగ్గినా
మనోరమంగానే
కళ్ళకి ఒళ్ళికి పట్టుగానే ఉంటుంది,
తొలిమిరాంతి తతి చల్లుతూనే ఉంటుంది
మచ్చు గొలుపుతూనే ఉంటుంది.
నా హృదయ కైరవాన్ని
వికసింపజేస్తూనే ఉంటుంది
నా కోరికల పైర్లను పండిస్తూనే ఉంటుంది
నన్ను అనురాగపు కిరణ సందోహం చేత
తడుపుతూ సుఖింపజేస్తూనే ఉంటుంది
వజ్రవైడూర్యాలకు కాదు
నేను యిచ్చే నూలుపోగులకే
సంతృప్తి పడుతుంటుంది.
నా "చెలికలువ"
అది "మనోజ్ఞమౌ చంద్రబింబం !"

# ఎంతటక్కరివి....

గునిసాడేది
"గుప్పెడు మనసులోనే"
కాని
భూగోళాన్నే కంబళించాలని
ఉబ్బతిల్లుతుంటుంది- "ఆశ"
జిలజిల లాడేది
"జానెడు కడుపులోనే"
కాని
బజారు బజారునే మెక్కాలని
ఉవ్విళ్ళూరుతుంటుంది-ఆకలి"
ఎంతటక్కరివి ఈ రెండు
మనిషిని
ఆకాశాన్నుంచి
అధో భువనానికి దిగ జారుస్తున్నవి!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

శ్రీమతి పోలవరపు హైమవతి

# విజయనగర కాలంలో వైవాహిక సమస్యలు

ప్రాచీన ధర్మశాస్త్రాలు బ్రహ్మ, దైవ, ప్రాజాపత్య, ఆర్ష, గాంధర్వ, ఆసుర, పైశాచ, రాక్షస, అనే ఎనిమిది రకాలైన వివాహాలను అనుమతించినప్పటికినీ, కాలక్రమంలో వాటికి ప్రాధాన్యత తగ్గిపోయింది. విజయనగర రాజుల పాలనా కాలంనాటికి 'కన్యాదాన' పద్ధతి వివాహము ఒక్కటే ఆదర్శనీయమైనదైనట్లు మనకు లభ్యమైన ఆధారాలవల్ల తెలియవస్తున్నది.

'కన్యాదాన' వివాహపద్ధతి ననుసరించి వివాహసమయంలో వధువు తండ్రి వరుని పక్షం వారినుండి ధనరూపంలోగాని, వస్తురూపంలోగాని ఎట్టి ప్రతిఫలాన్ని గ్రహింపక తన కుమార్తెను వరునికి పాణిగ్రహణము చెయ్యవలె. కాని, ఈకాలం నాటికి వివాహవ్యవస్థలో కన్యాశుల్కము, వరకట్నము అను దురాచారాలు ప్రబలినవి. సంఘంలో ప్రబలిన ఈ దురాచారాల బాధ గాక నాడు ప్రభుత్వం విధించిన వివాహపన్నుల భారంకూడ ప్రజలను వేధించినది.

నాటి వైవాహిక సమస్యల గురించిన సమాచారాన్ని అందజేసే మూలాధారాలు బహుస్వల్పంగా లభ్యమౌతున్నవి. నాడు విజయనగరాన్ని సందర్శించిన విదేశీయాత్రికుల రచనలనుండి ఈ విషయంలో లభించే సమాచారం స్వల్పాతి స్వల్పము. సాహిత్య రచనలు సైతం ప్రత్యేకంగా రాజులను గాని, ప్రభువులను గాని మెప్పించు నుద్దేశ్యంతో శృంగారరస ప్రధానాలుగా వ్రాయబడుటవల్లను వివాహ సమస్యలకు సంబంధించిన విషయ సేకరణలో చరిత్రకారునకు సూదికొరకు గడ్డివాము గాలించి నంత పని అవుతున్నది. శాసనాధారాలు బహుస్వల్పమైనను ప్రామాణికమైన సమాచారాన్ని అందిస్తున్నవి. విదేశీయాత్రికుల రచనలలోను. సమకాలీన సాహిత్యరచనలలోను అటనిట కానవచ్చు సమాచారాన్ని లభ్యమైన శాసనాధారాలతో పోల్చి పరిశీలించి చూచి, సమన్వయ పరచినట్లయిన నాటి వివాహ సమస్యల గురించిన స్వరూప స్వభావాలు కొంతవరకు అవగత మవుతాయి.

నాడు సాధారణంగా వధువు తల్లిదండ్రులే వరుని వెదకి, నిశ్చయించి వధువు యింటనే వివాహం జరిపించేవారు. బ్రాహ్మణులలో బాల్య వివాహాలు సర్వసాధారణం. వధూవరుల వివాహ వయస్సును మనువు ఈ విధంగా సూచించాడు. వరుని వయస్సు ముప్పది సంవత్సరాలైతే వధువు వయస్సు పన్నెండు సంవత్సరాలుండవలె. వరుని వయస్సు ఇరువదినాల్గు అయినచో వధువు వయస్సు ఎనిమిది సంవత్సరాలుండవలె. బృహస్పతి స్మృతి ననుసరించి ఇరువదియొక్క సంవత్సరాల వయస్సుగల యువకులు ఏడేళ్ల బాలికను వివాహ మాడవలెను. సమకాలీన సాహిత్య రచనయైన విష్ణుపురాణంలో సైతం ఈ విధంగా సూచింపబడినది —

అనఘతన వయసునఁ దృతీయాంశమైన
ప్రాయమునఁగల కన్నియఁ బరమ సాధ్వి
నుభయ కులములఁ దనయట్ల మెప్పుదాని
బెండ్లి యాడంగ వలయు సంప్రీతితోడ[3]

బహుశా ఈ సాంప్రదాయక భావాలను దృష్టిలో ఉంచుకునే కాబోలు బ్రాహ్మణులు చిన్న వయస్సులోనే తమ బిడ్డలకు వివాహం జరిపించేవారు. అయితే వారు బాగా ఎదిగి బిడ్డలను కనగల శక్తివచ్చునంత వరకు కాపురం చేసెడివారు కాదని లిన్షోటెన్[4] అను విదేశీయాత్రికుని రచనవల్ల, ఫెరిష్టా[5] అను పర్షియన్ చరిత్రకారుని రచన వల్ల తెలియవస్తున్నది. మిగిలిన వర్ణములలో యుక్తవయస్సు వచ్చిన తర్వాతనే వివాహం జరిపించడం సామాన్యము.

నాటి వివాహ సమస్యలలో అతిముఖ్యమైనది 'కన్యాశుల్క' ఆచారం. ఈ ఆచారాన్ననుసరించి వధువు తండ్రి వరుని వద్ద నుండి ధనరూపంలోగాని, వస్తురూపంలో గాని, కొంత ఫలితాన్ని గ్రహించి తనకుమార్తె నిచ్చివివాహం జరిపిస్తాడు. ఈ విధమైన ఆచారం ప్రాచీన కాలంనాటి 'ఆసుర' వివాహపద్ధతిలో ఉన్నది. దీన్ని విమర్శిస్తూ మనువు ఈ విధంగా చెప్పాడు. "ధర్మమెరిగిన ఏ తండ్రి తన కుమార్తె నిచ్చి ప్రతిగా ఏ చిన్న ప్రతిఫలాన్ని కూడా స్వీకరింపడు. ఎవరైనా ఆశ కొద్దీ ప్రతిఫలాన్ని గ్రహించినట్లయితే అతడు తన కుమార్తెను అమ్ముకున్నవాడవుతాడు.[6] ఈ విధంగా ధర్మశాస్త్రం ఈ

పద్ధతిని నిరసించినప్పటికినీ అది సాంఘికాచారంగా కొనసాగుతూనే ఉంది. ఆ విధంగా సాగిన సాంఘికాచారం విజయనగర కాలంనాటికి పెద్ద సమస్యగా తయారైంది. ఇది ముఖ్యంగా బ్రాహ్మణులపట్ల బ్రహ్మ రాక్షసిలా పరిణమించినట్లుంది. దీని బాధను పడలేక 'పడై వీడు' రాజ్యానికి చెందిన బ్రాహ్మణులందరూ సమావేశమై ఒక తీర్మానానికి[7] వచ్చిరట. ఆ తీర్మానాన్ననుసరించి పడైవీడు రాజ్యంలో నున్న కన్నడిక తమిళ, తెలుగు, ఇలాటి మొ॥ ఏ శాఖకు చెందిన బ్రాహ్మణులైనప్పటికినీ కన్యాదాన వివాహ పద్ధతినే అనుసరించవలె. ఎవరైనను దాని నుల్లంఘించి కట్నమిచ్చినను, పుచ్చుకొన్నను రాజదండనకు గురియగుదురనియు, కులమునుండి వెలివేయబడుదురనియు, నిర్ణయం చేయబడింది. ఆ రోజులలో సాంఘిక దురాచారంగా ఏదైనను భావింపబడినపుడు ఆయా ప్రాంతీయ ప్రజలే దానిని నిర్మూలించుటకు నిర్ణయించుకొని తగిన తీర్మానాలు చేసేవారని దీనివల్ల విదితమవుతుంది. అదే విధంగా సదాశివదేవ మహారాయల పాలనాకాలంనాటి నందవరం (కర్నూలు జిల్లా) శాసనాలు రెండు[8] ఇదే విధమైన తీర్మానాల గురించిన సమాచారాన్ని అందిస్తున్నాయి. దీనినిబట్టి ప్రజలు ఎప్పటికప్పుడు ఈ దురాచారాన్ని రూపుమాపుటకు అప్రమత్తులై కృషి చేశారని గ్రహించవచ్చు.

కన్యాశుల్క ఆచారమే గాక వరకట్న దురాచారంకూడ నాడు ప్రబలినది. దీనిని దాదాపు స్త్రీధనంగా పరిగణించారు. ఇది రాజ కుటుంబాలలోను, ప్రభువర్గపు కుటుంబాలలోను విస్తృతంగా ఉంది. రాజ్యాలు, గ్రామాలు, భూములు, పండితులు, గుర్రాలు, ఏనుగులు, దాసదాసీజనం, విలాసవస్తువులు వంటివి కట్నంగా యివ్వబడేవి.[9] 'పారిజాతాపహరణ'మ్ని రచించిన ముక్కు తిమ్మన శ్రీకృష్ణదేవరాయల భార్యలలో ఒక దేవేరి తరపున అరణంగా వచ్చిన కవి అని ప్రతీతి[10] క్రీ.శ. 1879 నాటి ఒక తమిళ శాసనం[11] నంబి ఇరవిశెట్టియార్ అనునతడు ఏంగై ఏళ్ళి అను గ్రామాన్ని తన కుమార్తె కుమారులకు కట్నంగా (ఇవ్వవలసిన దాని క్రింద ?) ఇచ్చివేసినట్లు చెప్పబడినది. బహుశా నంబి ఇరవిశెట్టియార్ తన కుమార్తె కివ్వవలసిన కట్నము చాలా కాలానికి ఆమె పిల్లలపేర రిజిష్టరు చేసి శాసనం వేయించినట్లున్నది. బ్రాహ్మణేతరులైన మధ్య తరగతివారు వరకట్నము లేదా స్త్రీధనము ఇవ్వటం కొంచెం కష్టతరంగా భావించి వుండవచ్చు. మాంగాడు (చెంగల్పట్టు జిల్లా) అనే గ్రామంలోని ప్రజలు స్త్రీధనంగా తమ గ్రామంలోని భూములను ఇతర గ్రామస్థులకు ఇవ్వరాదని శాసనం చేసుకొన్నారు.[12] ఈ విధంగా మరి ఇతర గ్రామ్యులవారు కూడ చేసికొన్నారో లేదో గాని దీనివల్ల ఆ బాధను కొంతవరకు రూపుమాపవచ్చని భావించినట్లున్నారు. కాని అంతతేలికగా ఈ సమస్య పరిష్కరింప బడలేదు. ఎంతోమంది భూములను అమ్మి వివాహము చేయ నారంభించారు. క్రీ. శ. 1404 నాటి ఒక శాసనం[13] విఠప్ప అనునతడు 'వివాహ నిమిత్తం' కందపళ్ళి గ్రామం, తదితర భూములతో సహా అమ్మివేసినట్లు తెలియజేస్తున్నది. అట్లే క్రీ. శ. 1424 నాటి మరొక శాసనం[14] వల్ల అళ్వప్రభు బొమ్మి యక్క హెగ్గడితి కుమారుడు 'వివాహ నిమిత్తం' కొంత భూమిని బొవణ్ణ అయ్యకు అమ్మినట్లు తెలియవస్తున్నది. స్త్రీధనంగా భూముల నివ్వడానికి వీలులేనందు వల్లను, పెండ్లి వైభవోపేతంగా జరిపించే నాటి ఆచారంవల్లను పెండ్లి సుంకాల భారం వల్లను వారా విధంగా భూములను అమ్ముకొనవలసి వచ్చి ఉంటుంది.

నిమ్నజాతీయులలోను, ఆర్థికంగా వెనుకబడినవారిలోను, 'ఓలి' ఇచ్చే పద్ధతి ఉండేది. ఇదికూడా "కన్యాశుల్క" పద్ధతివంటిదే వరుసిపక్షం వారు వధువు పక్షంవారికి కొంతధనంగాని ఏదైనా వస్తువునుగాని యిచ్చి వివాహం జరిపించేవారు. ఈ సమస్యను పరిష్కరించుకొనుటకు నాటి ప్రజలు కృషి చేసినట్లు శాసనాధారం ఉంది. క్రీ॥ శ॥ 1558కు చెందిన ఒక శాసనంలో[15] కొండపల్లినుండి రాజమహేంద్రపురము వరకు గల ప్రజలందరూ కూడి ఒక నిర్ణయం తీసికొనినట్లున్నది. దీనిననుసరించి ఇకమీదట 'ఓలి' 21చిన్నాల బంగారంకంటే మించరాదు. పెండ్లిలో వధువు పక్షంవారు 20½చిన్నాల బంగారం, వరుని పక్షంవారు 12½(తులాల) వెండి పెట్టవలె. అంటే వధువుపక్షంవారు 21చిన్నాలబంగారం ఓలిగా గ్రహించి 20½చిన్నాలు పెండ్లిలో తమకుమార్తెకే అప్పగిస్తారు. దీనివల్ల వధువు తండ్రి పొందేది ఏమీలేదు. బహుశా వధువు తండ్రికివ్వవలసిన ఓలి బారినుండి తప్పించుకొనుటకు ఈవిధంగా తీర్మానం చేసికొన్నట్లు భావించవచ్చు.

ఈవిధంగా వివాహ సమయంలో వధూవరుల పక్షాలలో ఏదో ఒక పక్షంవారు ప్రతివర్గంలోను బాధలనెదుర్కొన్నారు. ఇవిగాక ఆరోజుల్లో వివాహపన్ను ఒకటి వుండేది. కన్య అయిన వధువు వివాహమైతే ( వధువుకది మొదటి వివాహమైతే) యిరు పక్షాలవారు ప్రభుత్వానికి పెండ్లిసుంకం కట్టవలె,[16] పెండ్లిసుంకాల అస్తిత్వాన్ని తెలిపే శాసనాలెన్నో లభ్యమౌతున్నప్పటికినీ ఆపన్ను ఎంత వుండేదో తెలియరావడం లేదు. వివాహం చేసికొన్నందుకు కట్టవలసిన పన్నుగాక పందిరివేసుకున్నా వూరేగింపు చేసినాకూడా ఒక్కొక్కదానికి 'ఇంత' అని పన్ను కట్టవలసివచ్చేదట. అందువల్లనే ఎందరో పురుషులు ముసలివారయ్యేవరకు అవివాహితులుగా వుండేవారుట[17].

వివాహవ్యవస్థను అంటిపెట్టుకొని ఉన్న ఈసమస్యలు సంఘంలో ఎన్నో దుష్ఫలితాలకు దోహదం చేసినవి. ఉదాహరణకు బ్రాహ్మణులలో స్త్రీలకు చాలచిన్నతనంలోనే వివాహంచేసి అరణాలు సంపాదించి తమకుమారులకు వివాహం చేయసంకల్పించే అవకాశం ఉన్నది. అయితే ఆ రోజుల్లో మరి ఆవిదంగా చేసేవారో లేదో మనకు

తగిన ఆధారాలు లేవుగాని బాల్యవివాహాలు జోరుగా సాగాయని అనడానికి అనేక ఆధారాలు ఉన్నాయి.

నాగరికత ప్రవర్థమానమవుతున్న నాటినుండి దేవదాసీలు, వేశ్యావృత్తి వుంటూనే వచ్చినవి. కాని ముఖ్యంగా ఈకాలంలో వేశ్యల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. ఒక్క విజయనగరంలోనే 12,000 మంది వేశ్యలున్నట్లు పేస్ రచనలవల్ల తెలియవస్తున్నది.[18] అబ్దుల్ రజాక్, డొమింగోపేస్. అనే విదేశీయాత్రికులిరువురు విజయనగరంలోని వేశ్యలగురించి, వారి వాడలగురించి విపులంగా వర్ణించారు[19]. నాటి సాహిత్యరచనలలో దాదాపు అన్నింటిలోను వేశ్యవాడల వర్ణన ప్రత్యేకంగా కనిపిస్తుంది. వేశ్యలు లెక్కలేనంత ధనాన్ని సంపాదించినట్లు, ఆనాడు అన్ని వ్యాపారాలకు మించిన గొప్పలాభసాటి వ్యాపారమని బార్బొసా అనే మరో పోర్చుగీసు యాత్రికుడు పేర్కొన్నాడు[20]. విదేశీయాత్రికులందరి దృష్టిని ఆకర్షించిన వేశ్యావృత్తి బహు విస్తృతమైనదై ఉండి వుంటుందనే విషయం నిర్వివాదాంశం. ఇంత విస్తృతమగుటకు నాటి వివాహ సమస్యలే చాలవరకు కారణమై ఉండియుండవచ్చు. ఈ దృక్కోణంలో పరిశీలించినట్లయితే నాటి సామాజిక పరిస్థితులిట్లున్నవి.

1 కన్యాశుల్క, ఓలి సమస్యలవల్లనూ, వివాహపన్నుల భారంవల్లనూ, పలువురు పురుషులు అవివాహితులుగా ఉండిపోయారు.

2 బ్రాహ్మణులలోను, నిమ్నవర్గాలలోను, కన్యాశుల్కము, ఓలి అనే ఆచారాలు బాల్యవివాహాలను ప్రోత్సహించాయి.

3 మిగిలిన ఇతరకులాలలో, ముఖ్యంగా మధ్యతరగతిలో, వరకట్న దురాచారంవల్ల ఆడపిల్ల పెండ్లి ఒక పెద్ద సమస్యగా పరిణమించినది.

4 'పేదరికంలో బ్రతుకు వెళ్ళదీస్తున్న తల్లితండ్రులు కొందరు తమ కుమార్తెలకు వివాహం చేయలేక భోగస్త్రీలకు వారిని అమ్మేవారు ఆ భోగస్త్రీలు వారిని పెంచి పెద్దచేసి వారాంగనామణులుగా తీర్చి దిద్దేవారు'[21].

5 'భోగస్త్రీలకు సమాజంలో నాడు గౌరవనీయమైనస్థానం ఉంది సమాజంలో అత్యంత ఉన్నతస్థానంలో నున్న స్త్రీలతో సమాన స్థాయిని వారుపొందిఉన్నారు[22].

6 గౌరవనీయుడైన ఏ వ్యక్తియైనను నిరాక్షేపంగా వారి (వేశ్యల) ఇండ్లకు వెళ్ళవచ్చు[23].

ఈ విధమైన సామాజిక పరిస్థితులే నాడు స్త్రీ, పురుషులలో జారత్వాన్ని ప్రోత్సహించినవి. కులటలుగా మారిన కుల స్త్రీల, కుల కన్యల గురించి[24] "కోడెవితంతువుల" జారత్వాన్ని[25] గురించి నాటి సాహిత్యరచనలలో సమాచారం ఉంది. "ఆ రోజులలో ఆ వృత్తిలో చేరదల్చుకొన్నస్త్రీలు ఎవరైనను ఎట్టి ఆక్షేపణలేకుండా చేరిపోయే వీలుందని" డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు పేర్కొన్నారు.[26]

నాటి ప్రభుత్వం ఆ వృత్తిని అన్ని వృత్తులతోపాటు ఒక వృత్తిగా గుర్తించి వృత్తిపన్ను విధించినది [27] భోగలాలసత అధికమైన నాడు కులస్త్రీలకంటె భిన్నంగా వేశ్యలను, వారి వృత్తిని గుర్తించి వేరుగా ఉంచని యెడల సంఘంలో దుర్నీతి ప్రబలి సామాన్య కులస్త్రీ మానానికి భద్రతలేకుండా పోతుందనే ఉద్దేశ్యంతోను, సంఘం కలుషితమౌతుందనే వెరపుతోను కావచ్చును, ప్రభుత్వం ఆ వృత్తిని గుర్తించి చట్ట బద్ధం చేసింది.

నాటి వివాహ వ్యవస్థను చుట్టుముట్టియున్న ఈ సమస్యల నిర్మూలనకు ప్రభుత్వ ప్రయత్నం చాల తక్కువ అనే చెప్పాలి. ప్రజల ఆచార వ్యవహారాలలోను, సాంప్రదాయాలలోను ప్రభుత్వం జోక్యం చేసికొనేది కాదు. ప్రజలే తమకు బాధాకరంగా పరిణమించిన ఆచార వ్యవహారాలను రూపుమాపుటకు సాంఘికంగా తీర్మానాలు

చేసికొనేవారు కన్యాశుల్క విషయంలో వేర్వేరు ప్రాంతాల బ్రాహ్మణులు సాంఘికంగా చేసికొన్న తీర్మానాలలో శిక్షలుగా కుల బహిష్కరణతోపాటు రాజదండన సూచించ బడింది. ప్రజలు ఆ విధంగా తీర్మానాలు చేసికొంటే ఆ తీర్మానాల ననుసరించి వాటి అమలుబాధ్యత చక్రవర్తి గైకొనవలె. కాలక్రమంలో ప్రజలు వివాహపన్ను రద్దుచేయవలసిందిగా కూడ రాజుకు విజ్ఞప్తులు చేయనారంభించారు. సాళువ తిమ్మరుసు కృషివల్ల వీరనరసింహరాయల కాలంలో కొంత ప్రాంతంలోను,[28] కృష్ణదేవరాయల కాలంలో రాజ్యంలో పూర్తిగాను పెండ్లి సుంకాలు రద్దుచేయబడ్డాయి.[29] ప్రజల సమస్యల గురించి ప్రభుత్వము స్వీయంగా పరిశీలించి చొరవ తీసికొనక పోయినప్పటికిని ప్రజలు పరిష్కారానికి పూనుకొన్నట్లయితే మాత్రం ప్రభుత్వం తన పూర్తి సహకారాన్నందజేసేదని దీనివల్ల విదితమవుతుంది.

విజయనగర ప్రజలు పరిష్కారానికి చేపట్టిన కుల బహిష్కరణ శిక్ష తీవ్రమైన శిక్షనిచ్చినను, పుచ్చుకొన్నను, వారు జాతి బాహ్యులుగను, అధర్మ పరులుగను హేయంగా చూడబడి కులం నుండి బహిష్కరింపబడెడివారు. ఇది ఆ రోజులలో రాజ దండన కంటెను భయంకరమైన శిక్ష. ఇది ఎంతవరకు సత్ఫలితాన్నిచ్చిందో గాని ఒక్కని నివారణ మార్గము. అదే విధంగా స్త్రీ ధనంగా భూమి ఇవ్వరాదని సాంఘికంగా శాసనం చేసికొనుట, ఒలిపరిమితి తీర్మానాలు చేసికొనుట వంటివి సైతం ఆయా సమస్యల తీవ్రతను తగ్గించుట కుపకరించేవిగా ఉన్నవి. ఏమైనను, సాంఘికంగా తమ సమస్యలేటు వంటివో గుర్తించి, వాటి పరిష్కార మార్గాన్వేషణలో విజ్ఞత చూపి, త్యాగమత్తులై కృషిచేసిన "మరువబడిన సామ్రాజ్య" ప్రజల ప్రయత్నాలు మరువరానివి. అవి నేటికినీ ఆదర్శనీయములు.

## అధోజ్ఞాపికలు


1. మనుస్మృతి, 9, 94, పుట 344.
2. విజ్ఞాన సర్వస్వము, వాల్యూ. 3. పుట 48.
3. వెన్నెలకంటి సూరన, విష్ణు పురాణము, 4-182
4. లిన్షోటెన్, పర్చాస్, పిల్గ్రిమ్స్, 10, 258.
5. ఫెరిష్టా, బ్రిగ్స్, దిరైజ్ ఆఫ్ మహమ్మదన్స్, 2, పు, 380
6. మనుస్మృతి, 8, 51, 53 54, పుటలు 94-95.
7. యాన్యువల్ రిపోర్టు ఆన్ ఎపిగ్రఫి, నం. 47 ఆఫ్ 1887. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, సం. 1. నెం 56. పు. 83-84;
8. యాన్యువల్ రిపోర్ట్ ఆన్ ఎపిగ్రఫి, నం 13 ఆఫ్ 1943-44; నం 4 ఆఫ్ 1943-44
9. మొల్లరామాయణము, బాలకాండ, పద్యము 82; మనుచరిత్ర అధ్యాయం 5 పద్యాలు 98నుండి 102 వరకు.
10. శ్రీ ఆరుద్ర, సమగ్రాంధ్ర సాహిత్యము. మలిరాయల యుగము, పుట 144.
11. ఎపిగ్రాఫికా కర్నాటికా. సం 9, హెచ్.కె. 108 మరియు 109
12. ఏ. ఆర్. ఇ నెం, 354 ఆఫ్ 1908
13. ఎపిగ్రఫియా కర్నాటికా, సం 8, టి.యల్, 134, పుట 190
14. ఇబిడ్ టి. యల్ 175, పుట 199.
15. ఎ. ఆర్. ఇ. నం. 337 ఆఫ్ 1892.
16. ఎ. ఆర్. ఇ. నం 516 ఆఫ్ 1906; నం 214 ఆఫ్ 1938
17. డా యన్. వెంకటరమణయ్య, స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ ఆఫ్ విజయనగర, పుట, 271; ఎపిగ్రాఫికా కర్నాటికా, సం. 11 హెచ్ కె 17.
18. రాబర్ట్ సూయల్, ఫర్గాటెన్ ఎంపైర్, 1970, పుట 271.
19. ఇలియట్, హిస్టరీ ఆఫ్ ఇండియా, సం. 6. పుటలు 111-12; రాబర్ట్ స్యూయల్. ఆప్సిట్, పుట. 234.
20. బార్బోసా, సం 1 పు. 228.
21. ఇబిడ్.
22. రాబర్ట్‌స్యూయల్, ఫర్గాటెన్ ఎంపైర్, 1970, పు.234.
23. ఇబిడ్.
24. ఉద్భటారాధ్య చరిత్రము. ఆ. 2, ప. 126.
25. క్రీడాభిరామము, పద్యాలు 157 నుండి 172, 203 నుండి 215
26. డా. యన్. వెంకటరమణయ్య, స్టడీస్ ఇన్ ది థర్డ్‌డైనాస్టీ, పు. 284
27. ఇలియట్, హిస్టరీ ఆఫ్ ఇండియా, సం. 4, పుటలు 111-12
28. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, 4 నం, 808.
29. ఎపిగ్రఫియా కర్నాటికా, సం 12, పు, 84.

# విశ్వవిద్యా-లయం

గంటల తరబడి సుత్తి కొడుతూ
ఊకదంపుడు ఉపన్యాసం చేస్తాడు కాబట్టి
"ఉపన్యాసకుడు" !
ఆపుస్తకంలోంచీ ఈపుస్తకంలోంచీ
తీసి తీసి వ్రాసే ఉద్గ్రంథం కాబట్టి
'థీసీస్సు' !
చదివిన విషయాలు పూర్తిగా ఒంటబట్టించుకోకుండా
కచ్చా పచ్చాగా పచ్చడిచేసే కోర్సు కాబట్టి
'పి హెచ్. డి' !
విశ్వంలోని నిజమైన విద్యలన్నీ
ఇక్కడ నామరూపాలు లేకుండా లయమవుతాయి కాబట్టి
ఇది 'విశ్వవిద్యా-లయం' !!

# పరమపద సోపానపటము

వేలు ఖర్చుపెడితే పంచాయితీ సమితి ప్రెసిడెంటు-
పాళెగాడు !

లక్షలు ఖర్చు పెడితే ఎం. ఎల్. ఏ. - సామంతరాజు !
కోట్లు ఖర్చుపెడితే సి. ఎం. మహారాజు !
స్విస్సు బ్యాకుల్లో లెక్కలేనన్ని ఎక్కౌంట్లుపెడితే పి. ఎం.
ఏకచ్ఛత్రాధిపత్యం

సర్వం సహాచక్రవర్తి !!
ఇది మనరాజకీయ అదృష్టాధ్వగమనం
పదవుల పరమపద సోపానపటం !!
"బలేమంచి చౌక బేరము - మించినన్ దొరకదు
సుజనులార ! బలేమంచి చౌకబేరము" !

డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

# మృత్యుచుంబనం

## శ్రీమతి సీతా శరత్ చంద్ర

తెలిసో తెలియకో
ఈ లోకాన్ని చూద్దామని
ఆతృతగా రూపుదిద్దుకుంటున్న
పసిగుడ్డును అతి చిన్న పసిగుడ్డును
కుటుంబ సంక్షేమం కోసం అంటూ
నిర్దయగా చిదిపేస్తే
చట్టసమ్మతమే నన్న ఈ నాటి వ్యవస్థ
చెదలు తిన్న చెక్కముక్కలా
కుదరని దీర్ఘరోగాలతో
మృత్యు ఖడ్గంమాత్రమే
పెళ్ళగించ గలిగిన
కుళ్ళిన రాచ కురుపులతో
కుమిలిపోతున్న నన్ను
చంపేయమని వేడుకున్నా
మృత్యువు కోరుకున్నా
చట్ట సమ్మతం కాదంటూ
చల్లని చావు సందిట్లో
చేరనీయదేం ఈ వ్యవస్థ !
నిప్పు మూతుల పురుగులు
విలువెల్లా నాకేస్తుంటే
దయాలోచనాలెట్టుకొని
నిర్దయగా చూస్తారెందుకు
నన్ను దయతో చంపేయడమే నాకు మందు
మెర్సి కిల్లింగ్ చేసెయ్ ముందు
చివికిన ఈ దేహం విడిచి
కొత్తచొక్కా తొడుక్కొని
వస్తా-మళ్ళీ నీముందు.

# శ్రవ్యనాటిక
# రాజు-రజని
## భట్టిప్రోలు కృష్ణమూర్తి

పాత్రలు

| | |
|---|---|
| సుజాత (రజని) | రాజసింహుడు |
| మంజరి | విజయేంద్ర సింహుడు |
| యామిని | మదన సింహుడు |
| వసంత (రాగిణి) | అజిత వర్మ |
| జయంతి | దేవ వర్మ |
| మాధవి | బలవంతవర్మ (రామజోగి) |

(నీళ్ళచప్పుడు - పడవతెడ్లచప్పుడు !
స్త్రీకంఠం పాట దూరంనుండి దగ్గరకు వస్తుంది)

పాట : మరపు రాదె ఓ యమునా !

అతని చేష్టలీతీరమునా - మరపు॥ (స్త్రీకంఠాల నవ్వులు)
(దూరంగా కోయిల కూత)

వసంత : అదిగో కోయిల ! దానికి పండు వెన్నెల రాత్రి పడుకో డానికి బుద్ధి పుట్టలేదు కాబోలు మనలాగే !

సుజాత : మామిడి చివుళ్ళ కాలం అయిపోయి కొద్దిరోజులలోనే వసంతం చెల్లిపోతుందని దానికి భయమేమో ! అందుకే మేలుకొని ఉంది ఈ రాత్రి అదికూడా.

జయంతి : అయినా రాజకుమారీ, జీవితమంతా ఒక వసంతమే ఎందుకుండదు ? ఎప్పుడూ పండువెన్నెలే ఎందుకు నిలిచిపోదు ?

వసం : (వేళాకోళంగా) అప్పుడు మనం గొంతుకు తీరిక ఇవ్వకుండా ఇలాగే పాటలు పాడుకుంటూ నిద్రాహారాలక్కర్లేకుండా విహార యాత్ర చేస్తూఉండుము ఎల్లవేళలా ! కదూ జయంతీ ?

జయం : ఊ, పోదూ వసంతా ! అస్తమానం వేళాకోళమే నీకు, నేనేదన్నా.

సుజా : వసంత వేళాకోళంగా అన్నా అందులో ఎంతో నిజముంది.

జయంతి : నువ్వన్నట్లే అయితే నాలుగు రోజులలోనే మొహం పోతుంది. మళ్ళీ ఈ సరస్సు, పడవా, వెన్నెలా పీటివంక కన్నెత్తి చూడం మనం చీకటీ - వెన్నెలా,వెలుగూ - నీడా, వసంతం - హేమంతం అన్నీ ఉన్నప్పుడే నిండుధనం జీవితానికి.

(దూరాన కేకలు - కోలాహలం)

వసం : ఏదో కలకలం !

జయం : సుబల రాజ్యపు నౌకలు మన సరిహద్దు దాటి ఈ వైపు రాగా మన రక్షక దళాల నౌకల వాళ్ళు అడ్డగిస్తున్నట్లున్నారు. కూర్చో వసంతా ! పడవ తిరగబడగలదు !

వసం : ఏమిటో ఆ గోల - చూద్దాం ఉండు.

జయం : మనకెందుకు పోనిద్దూ ... ....

వసం: నీకేదీ అక్కర్లేదు - పాటలు పాడుకుంటూ పడవలో తిరగడం తప్ప!

సుజా : (నవ్వి) ప్రధానగూఢచారి బలవంతవర్మగారి కుమార్తె కదూ ఈ వసంత!

జయం: అందుకనే ఆ ఉబలాటం రాజకుమారీ పనిమీదవెళ్ళే వాళ్ల నాన్నతో అప్పుడప్పుడూ వెళ్తున్నది కదూ ! అందుకని తానూ పెద్ద గూఢచారినయి పోయాను అనుకుంటున్నది!

వసం: రాజకుమారీ! రాజకుమారీ! అది చేపలుపట్టే వాళ్ళ పడవకాదు. సుబలయువరాణి మంజరినౌక !మన రక్షకదళంవాళ్ళు ఆనౌకను మనవైపు గట్టుకు తరలిస్తున్నారు.

సుజా: ఆ!యువరాణి మంజరినౌకా! దాన్నెందుకు అడ్డగిస్తున్నారు ? వాళ్ళూమనలాగే నౌకా విహారానికి వచ్చి ఉంటారీరాత్రి.

జయం: నౌకావిహారానికి వచ్చినవాళ్లు వాళ్ళవైపు నీళ్లలో తిరగాలి గాని, సరిహద్దు స్తంభాలు దాటి మనవైపుకెందుకు రావడం? తగినశాస్తే అయింది.

సుజా: ఆ నౌకపొరపాటున సరిహద్దు దాటివుంటుంది. అంతమాత్రాన అడ్డగించాలా మనవాళ్ళు? హెచ్చరిస్తేసరిపోదూ!
జయంతీ! వసంతా, మన నౌకను కూడా ఒడ్డుకు చేర్చండి మనవాళ్ళను మందలించి యువరాణి నౌకను విడిపిద్దాం పాపం ఎంత బాధపడుతున్నదో ఆ అమ్మాయి.

వసం : అమ్మా! అమ్మా ! మన నౌకలో ముఖ్య రక్షకాధికారి యువరాజు దేవవర్మగారే ఉన్నారమ్మా !

సుజా : ఆ అన్నయ్యే ఉన్నాడా! ఆశ్చర్యం! వేగం పదండి.

## 2

దేవవర్మ : రా, సుజా - సమయానికి వచ్చావు. మీ జయంతీ, వసంతా ఉన్నారు కదూ? ఇప్పుడే కోటకు కబురు పెట్టాను. ఎవరన్నా చెలికత్తెలను "పంపించమని" మరి అవసరం లేదు.

సుజా : అన్నయ్యా - యువరాణి మంజరి నౌకను అడ్డగించి తెచ్చారట. ఏరీ వాళ్ళు ?

దేవ : అవతలి గుడారంలో ఉన్నారు. వాళ్ళను సోదా చేసి కారాగారానికి పంపాలి. రామచంద్రా-వెళ్ళి జయంతినీ వసంతనూ రమ్మని చెప్పు ఒకసారి.

సుజా : ఆగు రామచంద్రా! ఏమిటిదంతా అన్నయ్యా ? ఏదో పొరపాటున యువరాణి నౌకి సరిహద్దును దాటి.........

దేవ : హుఁ! పొరపాటుకాదు సుజా! ఆ యువరాణి నౌకను చాలా సార్లు హెచ్చరించారు మనవాళ్ళు. కాని మొండిగా వాళ్ళు



మన వైపు వచ్చి చేపలు పడుతున్నారు. రక్షకదళాల అభియోగం విని చివరకు నేనే స్వయంగా వచ్చానివాళ.

సుజా : అన్నయ్యా-చేపల వ్యాపారంచేయటం లేదు కదా యువరాణి ! సరదాకోసం పట్టిఉంటారు. అంత మాత్రాన.........

దేవ : ఇది సరదాకు కాదు – పంతం కోసం. మనం ఊరుకుంటే మరి పది పడవలు వచ్చి పడతాయి మన నీళ్ళలో.

సుజా : మన నీళ్ళు ! ఏమిటో అన్నయ్యా - ఈ నీళ్లూ చేపలూ మనుష్యు లెవళ్లూ సృష్టించినవి కావు. అంతా ఆ భగవంతుని సృష్టి. సుబల రాజ్యపు ప్రజలైనా సునీల రాజ్యపు ప్రజలైనా అంతా ఆ దేవుని కన్నబిడ్డలే. ఈ కృత్రిమమైన సరిహద్దులూ చిలిపి కయ్యాలూ... ....

దేవ: చిలిపి కయ్యాలు కావమ్మా ఇవి - జీవన న్యాయాలు. మన రాజ్యంలో ఎన్నో కుటుంబాలు ఈ నీలీ సరస్సు చేపలమీద ఆధారపడి బ్రతుకుతున్నాయి. వాళ్ళ జీవికా భద్రతా సంరక్షించే బాధ్యత మన మీద ఉంది.

సుజా : ఏమైనా అన్నయ్యా. యువరాణి నౌకను అడ్డగించి వారిని బంధించడం నాకు సవ్యంగా అనిపించదు. మన రాజ్యాల నడుమ మనస్పర్థలు మరింతగా.... ...

దేవ : ఇప్పుడు ఎక్కువగా లేవు కనుకనా ? నీకు తెలియదమ్మా సుజా !

సుజా : అవును - నాకీ రాజకీయాల సంగతి తెలియదు. (ఆగి) అన్నయ్యా....

దేవా : అమ్మా........

సుజా : (అతి మృదువుగా గోముగా) అన్నయ్యా -ఈ ఒకసారికి యువరాణి నౌకను వదిలి వేయమని ప్రార్థిస్తున్నాను. నా మాటను తీసివెయ్యవని నా నమ్మకం.

దేవ : (వాత్సల్యంగా నవ్వి) అలాగే కానీ చెల్లీ ! కాని ఒకటి - నువ్వు వెళ్ళి ఆ యువరాణితో ఈ సారి సరిహద్దుదాటి ఇటు వైపు రావద్దని చెప్పు.

## 3

సుజాత : యువరాణి మంజరీదేవికి అభివాదనలు.

మంజరి : బందీలకు అభివాదన అందుకునే అధికారంలేదు. ఎవరునువ్వు ?

సుజా : సునీల రాజకుమారి సుజాతను.

మంజ: (నవ్వి) ఓ, నువ్వా! అపర రతీదేవి, భూలోక సుందరి అని అందరూ పొగిడే సుజాతవు నువ్వా ! (వేళాకోళంగా నవ్వు)

సుజా : ఆ అతిశయోక్తుల సంగతి నాకు తెలియదుగాని నా పేరు సుజాత జరిగినదానికి మన్నించమని మిమ్మును కోర్తున్నాను. మీ నౌక రేవులో సిద్ధంగా ఉంది. స్వల్పమైన ఆతిథ్యం.... ఇదిగో ఫలహారాలు దయతో స్వీకరించి.... ....

మంజ : ఇక్కడెవరూ పస్తులతో లేరు - ఫలహారపు పళ్ళెరాలు చూడగానే ఎగబడడానికి ! శత్రురాజ్యపు, మనుషుల దయాదాక్షిణ్యాల కోసం, తేనె పూసిన కత్తుల మాటలకోసం తహతహలాడే దుర్బలప్రాణులం కాదు మేము.

సుజా : క్రోధావేశమెందుకు యువరాణీ? మరొకసారి క్షమాపణకోరు తున్నాను. సునీల రాజ్యం పక్షాన........

మంజ : ఈ రాజ్యం పక్షాన మాట్లాడటానికి నీకున్న హక్కేమిటి ? అజితవర్మరాజు, దేవవర్మ యువరాజు ఇక్కడ....

సుజా : (నవ్వుతూ) మీరన్నది నిజమే! యువరాణీ, సుబల రాజ్యానికి వారసులు మీరు. ఇక్కడ నేనేమీ కాను ఉత్త రాజకుమారిని మటుకే. అయితే సరిహద్దు రక్షక దళాల ముఖ్యాధికారి అను మతితో మాట్లాడుతున్నాను. ఈ ఆతిధ్యాన్ని స్వీకరించి, మీ కెప్పుడు తిరిగి వెళ్ళాలని ఉంటే అప్పుడు మీ నౌకలో .......

మంజ : నన్నూ నా చెలిక త్తెలనూ బంధించిన ఆ....ఆ....ఆ....

సుజా : యువరాజు దేవవర్మ ........

మంజ : ఆ దయ్యపు వర్మ! వాడే వచ్చి నాకు క్షమాపణ చెప్పుకునే టంత వరకు........

సుజా : చూడండి యువరాణీ - నిజం చెప్పాలంటే తప్పు జరిగినది మీవల్ల! అందువల్ల జరిగిన దానికి చింతిస్తున్నామని మీరంటే మా అన్న కూడా వచ్చి జరిగినదానికి........

మంజ : తప్పా? (నిరసనగా నవ్వి) మాదేమి తప్పుకాదు. ఈ నీలీ సరస్సంతా మాదే! నీలీనదికి ఆనకట్ట కట్టినది మా పూర్వులు. ఈ సరస్సుకు రూపురేఖలు తీర్చి దిద్దినది మా రాజవంశం! రెండు దశాబ్దాల క్రితం మీ వాళ్ళు బలవంతాన దీన్ని ఆక్రమించి, అప్పటికి దుర్బలంగా ఉన్న మా రాజ్యాన్ని బెదిరించి, మా తాత గారిని సంధికి ఒప్పించి, ఈ సరస్సులో సగం లాగుకున్నారు అన్యాయంగా, సుబల రాజ్యపు ప్రజ ఈ ఈ దురాక్రమణ ఎన్నడూ సహించదు. మా శరీరాల్లోని ప్రతీ రక్త బిందువూ ........

సుజా : ఆవేశపడకండి యువరాణీ !

మంజ : ప్రతీకారాన్ని కోరుతుంది !

సుజా : నాకీ రాజకీయాల సంగతి తెలియదు. అయినా ఎవరితోనూ వాదించే అలవాటు కూడా లేదు నాకు. యువరాణీ ! ఎప్పుడు మీరు వెళ్ళడానికి సిద్ధమైతే అప్పుడు తిరిగి మీ రాజ్యానికి వెళ్ళవచ్చు. శుభాకాంక్షలు మీకు. వస్తాను. (తనలో అను కున్నట్లుగా) మీ గురించి ఎంతో విన్నాను-ఎనలేని సౌందర్యం సంస్కృతాంధ్ర ప్రాకృత భాషలలో పాండిత్యం, కవిత్వం చిత్రలేఖనం, గానం నృత్యం, అన్నిటిలో ప్రావీణ్యం కల మీ వంటి వ్యక్తులతో స్నేహం నెరపాలని కోరికగా ఉండేది. (జాలిగా నవ్వి) కాని ఈవాళ అది నిరాశ అయింది. వస్తాను.

మంజ : (నిరసనగా నవ్వుతూ) నీతోనా నాస్నేహం.

## 4

(కోటలో తూర్యనాదాలు. వాద్యాలు దూరంగా)

విజయేంద్రవర్మ : యువరాణి కధనం విన్నావు కదూ సేనాధిపతీ?

రాజసింహుడు : విన్నాను మహాప్రభూ.

విజ : దీనికి ప్రతీకారం?

రాజ : (ఆశ్చర్యంగా) ప్రతీకారమా?

మంజ : అవును - ప్రతీకారం! ఈ సుబల యువరాణికి జరిగిన అవమానానికి ఆ పొగరు బోతు దేవవర్మకు తగిన శాస్తి జరిగితీరాలి. ఈ నా శరీరంలో అణువణువూ కణకణమూ...........

విజ : శాంతించు తల్లీ........

మంజ : మీకు తెలియదు నాన్నా ఎంత అవమానం జరిగిందో నాకు ! నా నౌకను ముందూ వెనకా అడ్డగించి, అక్కడ గుడారంలో నన్నొక మామూలు దొంగలా నిర్బంధించి, చివరకు నన్ను - యువ రాణిని - సామాన్య దాసీ కన్యలచేత సోదాచేయించడానికి సిద్ధపడిన ఆ దుష్టుడు... ఆ నీచుడు.... ఛండాలుడు........

విజ : ఆవేశపడకు మంజరీ. రాజసింహా - మనకర్తవ్యం ?

రాజ : కర్తవ్యనిర్ధారణ చేయవలసింది మహా మంత్రులవారూ, తమరూ - కర్తవ్య నిర్వహణ మటుకే నావిధి మహా ప్రభూ !

విజ : దండెత్తి వెళ్ళి ఆ యువరాజును బందీచేసి తీసుకు రావాలని కోరుతున్నది యువరాణి. దానికి తగినబలం మన సైన్యాని కున్నదా అన్నది ప్రశ్న. దానికి నీ అభిప్రాయం ముఖ్యం రాజసింహా !

రాజ : ప్రస్తుతం ఉభయ రాజ్య బలాలదీ ఇంచుమించు సమాన ప్రపత్తి మహాప్రభూ ! కొద్దిగా మనదే పైచెయ్యి. అయితే వాళ్ళకు పడమటివైపున మనం ఒక్కళ్ళమే శత్రువులం. మనకు మటుకు తూర్పున వాళ్ళూ, ఉత్తరాన ప్రతాపరాజ్యం. రెండు వైపులా శత్రువులే. సునీల రాజ్యంతో మనం తలపడిన అదను చూసి ప్రతాపరాజ్యాధిపతి కయ్యానికి కాలు దువ్వుతే పరిస్థితి విషమించిపోతుంది.

విజ : ఊఁ, అయితే దండెత్తి వెళ్ళడం అన్నది. ఆచరణ యోగ్యం కాదన్న మాట ?

రాజ : చిత్తం మహాప్రభూ !

మంజ : ఆ దేవవర్మ నౌక మనవైపు నీళ్ళలోనికి వచ్చినప్పుడు అదను చూసి దాన్ని పట్టుకుంటే ?

రాజ : లాభంలేదు యువరాణీ ! మన సరిహద్దు రక్షకదళాల ముఖ్యాధికారి మదనసింహుడు చెప్పినదాన్ని బట్టి వాళ్ళు సంధి నియమాలు తూచా తప్పకుండా పాటిస్తున్నారు. ఇటువైపెప్పుడూ. వాళ్ళ నౌకలు రావు. నిజానికి అప్పుడప్పుడు మన.... ....

మంజ : (అర్థోక్తితో అందుకుని) యువరాణినౌకే అటువైపువెళ్తూంటుంది. నేనే కయ్యానికి కాలుదువ్వుతున్నాను. అంతేకదూ నువ్వనేది?

రాజ : నిజమనుకోడానికి చేదే! కాని చేదని భయపడితే భావిపరిణామాలు భీషణంగా మార్తాయి.

మంజ : తర్జన భర్జనలే కాని నీ మరదలికి జరిగిన అవమానానికి ప్రతీకారం మటుకు చేయలేవు. నువ్వు కదూ బావా ?

రాజ : బావగా మాట్లాడడం లేదిక్కడ నేను యువరాణీ! ఈ సుబల రాజ్యాన్ని సంరక్షించే బాధ్యతకల ముఖ్య సేనాధిపతిగా మటుకే చెప్తున్నాను.

మంజ : పోనీ బావగా నీ అభిప్రాయం ? .... .... మాట్లాడవేం?

విజ : (నవ్వి) చెప్పు రాజసింహా - సందేహించకు.

రాజ : సకల మర్యాదలతో సమ్మానాదరాలతో వాళ్ళు యువరాణిని మన సరిహద్దులలో దిగబెట్టారు. ఎవరైనా రాయబారిని పంపి మన కృతజ్ఞత వారికి తెలుపుకోవడం ఉత్తమం. తూర్పు సరిహద్దుల్లో శాంతి నెలకొనడానికి అది దోహదకారి అవుతుంది మహాప్రభూ !

మంజ : మరి నాకు కలిగిన అవమానం సంగతి ?

రాజ : తప్పు మనదై నప్పుడు ఎందుకలా అనుకోవాలి ? చూడండి యువరాణీ! మన హెచ్చరిక ఉల్లంఘించిన వాళ్ల నౌకను మన వాళ్లు వదుల్తారా! ఇదీ అంతే,

మంజ : ఎంత సులువుగా తేల్చేశావు ! సమయానికి ఆ రాజకుమారి రాకపోతే ఒక సామాన్యదాసి.... ....

రాజ : సరిహద్దు దాటే ముందే ముందు వెనుకలు ఆలోచించుకోనవలసింది.

మంజ : అంత ముందు వెనుకలు తెలియని దాన్నా నేను ?

రాజ : వాదన వద్దు యువరాణీ! మహాప్రభూ - తమ ఆజ్ఞ శిరసావహించేందుకు సర్వదా సన్నద్ధుడీ సేనాధిపతి - శెలవివ్వండి.

విజ : వీలయితే ఆ దేవవర్మ నౌకను నిర్బంధించి తెమ్మని మదనసింహుడికి ఉత్తర్వులు పంపండి.

రాజ : ఆజ్ఞ మహాప్రభూ !

## 5

మదనసింహుడు: రావాలి యువరాణి మంజరీదేవికి. రండి కూర్చోండి యువరాణీ!

మంజరి : అబ్బా సంపెంగ అత్తరువు వాసనల్తో ఊపిరి తిరగకుండా చేసేశావేమిటి గుడారమంతా ! ఆ తెరలు పైకెత్తించు. పరిశుభ్రమైన గాలి వస్తుంది లోపలికి.

మదన : చిత్తం.

మంజ : హుం ! ఎన్ని కలశాలు ఖాళీచేశావ్ ఉదయంనుండి ? కళ్ళు అంత ఎర్రగా ఉన్నాయి ! అత్తర్వులో ద్రాక్షమధువు వాసన దాస్తావేమోగాని (నవ్వి) కళ్ళేం చేస్తావు ?

మదన : (గాబరాగా) కలశాలా ? అలాటిదేమీ లేదు యువరాణీ ! ఆ రకమైన ద్రవ్యాలు ముట్టడంమాని.... ...

మంజ : ఒక ఘడియ దాటింది. అంతేకదూ ? (నవ్వు) సరేగాని చూడు మదన్, ముఖ్యసేనాధిపతి ఉత్తర్వులు నీకందాయా ?

మదన : ఏ ఉత్తర్వులు ? ఓ.. అదా ? అందాయి, యువరాణీ - దేవవర్మ నౌక మన నీళ్ళలోనికి వస్తే నిర్బంధించమని .... అందాయి.

మంజ : మనవైపు వస్తే ఏ భటుడన్నా బంధించగలడు దాన్ని. మరి నీ గొప్పేమిటి ? అప్పుడే ఒక రోజు దాటింది ఆ ఉత్తర్వులు వచ్చి - ఏం చేశావిప్పటికి ?

మదన : చెయ్యడానికేముంది ? ఒకరోజు కాదు - ఒక సంవత్సరమైనా ఆ ఉత్తర్వులు ఆచరణలో పెట్టడం సాధ్యం కాదు యువరాణీ !

మంజ : ఏం ? అంత చేతకాని వాడివా నువ్వు మదన్ ?

మద : చేతకాని తనం కాదు. వాళ్ళ నౌకలు నిజానికి ఎన్నడూ మన వైపు రావడం లేదు. రావు కూడా, సంధి నియమాలు అక్షరాలా పాటిస్తున్నారు వాళ్ళు.

మంజ : ఇలాటి మాటలు చెప్పేవాడివి కనుకనే ఇంకా ఇలా ఉన్నావు. అన్నదమ్ముల సంతానంలో ఎంత తేడా! తమ్ముడిగారబ్బాయి ముఖ్య సేనాధిపతి అవుతే అన్నగారి అబ్బాయి సరిహద్దు రక్షక దళాలలో ఒక చిన్న అధికారి!

మద : రాజు-అన్న నాకంటే రెండేళ్ళు పెద్ద. అంతేగాని........

మంజ : అలా అనుకుని తృప్తి పొందుతూ ఉండు. (ఆగి) చూడు మదన్.... నీ రక్షక దళాలు సరిగా పనిచేసి నీకు సమాచారం అందజేస్తున్నాయా అని అనుమానంగా ఉంది.

మద : అండీ?

మంజ : దేవవర్మ మామూలుగా మధ్యాహ్నం పూట ఎక్కడ ఉంటాడో తెలుసునా నీకు?

మద : ఎందుకు తెలియదు ? నీలి సరస్సు ఉత్తరదిశ విశ్రాంతి గృహం ముందు....

మంజ : చేపలు పడ్తుంటాడు. అప్పుడు ఎంతమంది అంగరక్షకు లుంటారక్కడ ?

మద : ఒకళ్ళో ఇద్దరో.

మంజ : అంతేగా చూడు మదన్.... ఈ వజ్రపుటుంగరం ఎలా తళ తళా మెరుస్తుందో! దీని విలువెంతో తెలుసా?

మద : అమూల్యం అది యువరాణీ

మంజ : నీకిది కావాలా ? ఒక వేయి సువర్ణ నాణాలతోపాటు?

మద : (నవ్వి) ధనమెవడికి అక్కర్లేదు!

మంజ : కాని, దాన్ని సంపాదించుకునే అర్హత గడించాలి మనిషి. ఆ దేవవర్మను నిర్బంధించి తెచ్చి నా కప్పగిస్తే ఇది నీదే అవుతుంది. నాణాల సంచీతోపాటు.

మద : ఏమిటిది యువరాణీ? లంచం తినమంటున్నారా నన్ను ?

మంజ : (నవ్వి) లంచం కాదు – కాబోయే మహారాణీ నీ చేసిన సేవకు తృప్తి పొంది నీ కిచ్చే ఉపహారం.

మద : న్యాయంగా చేసే పనైతే అంతే,కాని ....

మంజ : నీ దేశపు యువరాణికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం చేయడం న్యాయం కాదా మదన్? ధర్మరాజంతటి వాడే తన గురువు ద్రోణుడిని చంపడానికి అబద్ధమాడాడు!

మద : ఏమో-ధనవాంఛతో.........

మంజ : ఇలాటి మెమ్మెలతో మాట్లాడడం సమయనష్టం. వస్తాను.

మద : ఆగండి యువరాణీ! కక్కుర్తిపడ్డా కడుపు నిండాలి చూడండి- ఉపముఖ్య సేనాధిపతి పదవిలో ఎవరూ లేరిప్పుడు. నేనీ పని చేస్తే నన్నా పదవిలో నియోగించడానికి మీరు సాయపడ్తా నంటే.........

మంజ : మదన్ – నిచ్చెన ఎక్కేటప్పుడు ఒక్కొక్క మెట్టే ఎక్కాలి. నీకు లభించేది ప్రస్తుతం ఈ వజ్రపుటుంగరమూ, నాణాల సంచీ మటుకే, తక్కిన మెట్ల సంగతి నీ భావిప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది. మాకు విశ్వాసపాత్రుడివిగా ఉంటే ...

మద : ఉప్పతిని ద్రోహం చేసే మనిషి కాడీ మదన సింహుడు యువరాణీ ! శపథం చేస్తున్నాను – సూర్యచంద్రులసాక్షిగా – ఒక వారం లోగా ఆ దేవవర్మను............

మంజ : బంధించి నా కప్పగించాలి. ఈ విషయం మ్మరెవ్వరికీ తెలియ రాదు.

మద : ఆజ్ఞ యువరాణీ!

## 6

అజితవర్మ : యువరాజు అదృశ్యమై అప్పుడే వారం దాటింది బలవంత్ ! ఇంతవరకు ఏ జాడా తెలియలేదు. ఏమి చెయ్యడమింక?

బలవంతవర్మ : మన రాజ్యంలో దాయాదు లెవ్వరికి దీనితో సంబంధం లేదని రూఢిగా ఋజువయింది మహాప్రభూ ! ఇప్పటికి వేగులవారి ద్వారా అందిన సమాచారాన్ని బట్టి ఒక్కటే ఆశా కిరణం కనిపిస్తున్నది.

అజిత : ఏమిటిది?

బల : అంగరక్షకులతో పాటు యువరాజు అదృశ్యమైన నాటి మధ్యాహ్నం సుబలరాజ్యాంతఃపుర రక్షక దళంలోని ఖోజ్జాల గుంపు ఒకటి సరస్సు ఉత్తర దిశగా వెళ్ళిందని తెలిసింది. ఆ రోజు సాయంత్రం సుబల యువరాణి వాళ్ళ సరిహద్దు దళాల ముఖ్యాధికారి గుడారం లోనికి వెళ్ళి కొంత సేపుండి వచ్చినదట. ఈ రెండింటినీ సమన్వయించి చూస్తే..............

అజిత : పున్నమిరాత్రి తనకు జరిగిన అవమానానికి ప్రతిగా ఆ యువరాణి మంజరి మన దేవవర్మను బందీ చేసి అంతఃపురంలోనే నిర్బంధించి ఉండవచ్చును. అంతే కదూ ?

బల : అదే బలంగా అనుమానిస్తున్నాను మహాప్రభూ! సుబలరాజ్యం తప్ప మరెవరూ మనకు అపకారం తలపెట్టే వారులేరు. ఆ సుబలరాజ్యపు కారాగారాలన్నీ గాలించారు మన వాళ్ళు. సైన్యాధికారులు వాడే నిర్బంధ గృహాలు కూడా చూశారు. కాని అక్కడెక్కడా మన యువరాజును బంధించిన జాడలేదు. ఒక్క అంతఃపురం విషయం మటుకు ఏదీ తెలియలేదు.

అజిత : నీ ఊహ సరి అయినదే అనిపిస్తున్నది. బలవంత్! ప్రస్తుత పరిస్థితుల్లో మనం ఆ రాజ్యం మీదికి దండెత్తి వెళ్ళే అవకాశం లేదు. ఉన్నా యువరాజు క్షేమం దృష్ట్యా ఆపని చెయ్యలేము. అందువల్ల ఏదో భేదోపాయం లోనే దేవవర్మ జాడ తెలుసుకుని విడిపించాలి మనం,

బల : నేనే స్వయంగా మా వసంతతోపాటు వెళ్ళి వసంతకు అంతఃపురం లోనికి ప్రవేశం కలిగించి కూపీ తీయాలనుకుంటున్నాను. అయితే వసంతతో పాటు మరొక యువతి కావాలి– అమెకు తోడుగా ఉండడానికి, అమె చర్యలను కప్పిపుచ్చడానికి, తగిన వ్యక్తి కోసం చూస్తున్నాను మహాప్రభూ !

అజి : జయంతి !

బల : ఊహూఁ లాభంలేదు మహాప్రభూ – అస్త్ర శస్త్రవిద్యలలో, ఈతలోస్వారీలో ఆట పాటలలో నైపుణ్యం ఉన్న వ్యక్తి

కావాలి. వసంతకు చిన్ననాటి నుంచీ తగిన శిక్షణ అన్నిటి లోనూ ఉంది.

సుజా : వర్మగారూ నేను పనికిరానా ?

అజిత : నువ్వా సుజా !

బల : నువ్వా రాజకుమారీ ?

సుజా: అవును మీ రాజ్ఞోదిస్తే నేను సిద్ధం రావడానికి. ఆ దురాగ్రహం కారి మంజరి నిరబంధమే అయితే అన్నయ్య ఎంతగానో బాధ పడుతూ ఉండాలి. సాధ్యమైనంత త్వరలో విడిపిస్తేనేగాని నా కూరట కలగదు.

బల : మీ రన్ని విధాలా తగిన వారే. కాని అది విపత్కరమైన కార్యం తల్లీ.

అజిత : ఇప్పటికే మన అజాగ్రత్త వల్ల దేవశర్మకు ఆపద తెచ్చి పెట్టాం. కోరికోరి నిన్నుకూడా......

సుజా : అన్నయ్య కోసం ఎంత ఆపదైనా ఎదుర్కోవాలి నాన్నా. అయినా నాకే ఆపదా కలగదని ఎదో అంతర్వాణి చెప్తున్నది. ఒక్కగానొక్క కుమార్తె వసంతనే వర్మగారు ఉపయోగించ డానికి సిద్ధ పడగా లేనిది.........

బల : అది మా వృత్తి తల్లీ!

సుజా : మీ వృత్తి కావచ్చు. కాని వసంత వృత్తి కాదే! అడ్డు చెప్ప కండి. నాన్నా, నన్ను వెళ్ళనీండి.

అజిత : బలవంత్ !

బల : అప్రమత్తతగా ఉన్నంతవరకు ఏ ప్రమాదమూ జరగదు మహా ప్రభూ! నేనూ అంతఃపురం దరిదాపులలోనే ఉంటాను. మరి కొంత మంది అనుచరులతో. అక్కడి వాళ్ళకు ఛద్మవేషంలో అంధభిక్షుకునిగా నేను బాగా పరిచయమే. ముఖ్య సేనాధిపతి రాజసింహుని తల్లి యామినీదేవి ఉండే అంగణం వద్ద అంత పెద్దగా భద్రతాచర్యలుండవు. ఆ లోపలకు సులభంగా ప్రవేశం సంపాదించవచ్చు.

సుజా : ఎంతవేగం వెళ్తానా అని ఉబలాటంగా ఉంది. ఊఁ అనండి నాన్నా.

అజిత : నీ యిష్టమే కానీ తల్లీ !

( ఇంకా ఉంది )

# నాటకాంతము

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శన్

నాటకమున నే నేర్చిన మాటలెల్ల
శక్తి కొలది పలికినాడ, రక్తికట్టె
పాత్ర పోషణమనిరి సభాసదులును,
నాటక విషాద ముటికి కన్నీటుముంచె !

నేనెవ్వరో యెరుగని అ
జ్ఞాన స్థితి నాకు వెక్కసమ్ముగ దోపన్
దీనత ప్రశ్నించితి నా
లోని గళము, సంవదించు లోలో నెపుడున్

"నీవు నటుడవు, భోక్తవు:నేను సాక్షి;
నీకు గల వేషరూపాలు నాకు లేవు
నీకు గల దేశకాలాలు నాకు లేవు
నీకు గల వచోభివ్యక్తి నాకు లేదు!"

అగుచో అస్తిత్వము నీ
కగుటెట్లని అబ్బురమున నడిగితి దానిన్-
నగవొక్కటి నీరవమై
విగళితమౌచు హృదయమ్ము విస్మృతమొనర్చెన్

ఆ నవ్వు నేనె నవ్వితి
నో? నను జూచి యితరు లెవరోనవ్విన వా
రో? నశ్వరమగు సర్వము
ఆనందము దప్ప! అదియె అస్తిత్వ మగున్!

ఓ రసాకృతీ! అపరోక్షమైరమించు
నీ రవళియె వంశీనాదమై రహించె;
అదియె నాలోని లోలోని యెదవసించి
సంవదించెడి నే కాంత సమయములను!

నాట్య నాటక లక్ష్యమానందసిద్ధి;
మోద ఖేద జీవిత, మనుభూతి సర్వ
మౌను వివిధ సంశ్లిష్ట రసామృతమ్ము;
జీవితము పైనిక తెర వాల్చెదను గాక !

నీవు-నీ వక్కడున్నావు నేడు నాకు
నిన్న-నిన్న లేరెవ్వరు నన్ను బిలువ;
నిష్క్రమించి నిన్ జేరగ నేను కదల,
"ఉండి సాగింపు" మను అజ్ఞ యుక్తమౌనె!

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి

# ప్రబంధరత్నాకరము - తృతీయాశ్వాసము ప్రత్యంతర విశేషములు

(గత సంచిక తరువాయి)

త్రిపురారి ప్రేమాభిరామము :

కళాభిరామముతోపాటు ప్రేమాభిరామమును ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు కలదు. ప్రేమాభిరామము అనగానే వల్లభామాత్యుని క్రీడాభిరామము గుర్తునకు వచ్చుట సహజము. క్రీడాభిరామము వివిధ ముద్రణము లందును ఇట్లు కలదు.

"రావి పాటి త్రిపురాంతకదేవుండను కవీశ్వరుండానరించిన
ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను
రూపకంబు తెనుగు బాస రచియించినవాఁడు -33

ఆతఁడెంతటివాఁడు ప్రేమాభిరామ
మనఁగ నెంతటి యది దాని ననుసరించి
వీథి యను రూపకము మది వెఱపులేక
తిప్పవిభు వల్లభుండెట్లు తెనుఁగుఁజేసె" -34

ఇందలి 'ప్రేమాభిరామ నాటకంబు, తెనుఁగుఁజేసె' అను మాటలను బట్టి రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము సంస్కృత నాటక మని స్పష్టము, కాని, పెదపాటి జగన్నాధకవి ప్రబంధ రత్నాకరములోని త్రిపురారి ప్రేమాభిరామము సంస్కృత నాటకము కాదు సరికదా, తెలుగుకామశాస్త్రము. ప్రబంధ రత్నాకరము ప్రత్యంతరమునందు ఇట్లు కలదు -

'భద్రదత్త కూచిమార పాంచాలురు త్రిపురారి ప్రేమాభిరామము :

ఇచ్చ యెఱుంగఁ డెట్టి ధనమీఁదదె యూరక కన్నులార్చి మై
బచ్చనఁజూపి కూర్పుమని పట్టిన నెట్టనఁ గూర్పవచ్చుఁగ
న్నిచ్చలిఁబాఱి నెమ్మనము లిత్తురె మానినులెల్ల నొల్ల నా
మెచ్చులు గావు భద్రు వెలి మిన్నక నవ్వులు కప్పఁబ్రవ్వులన్ 1

ఈఁగి మిగులనిచ్చు బెట్టిఁగి యింపెఱుఁగదు
తన సుఖంబె కోరి పెనఁగుఁగాని
తలిరుబోణి రోయి దత్తకుఁ జేకొను
టంకమునకుఁ బసిఁడి యందుకొనుట -2

తక్కులుఁజొక్కు లొల్లములుఁ దాఁపరముల్ నగముల్ విడంబముల్
మొక్కలు రిత్తవాదములు ముచ్చటలాలము లింద్రజాలముల్
మక్కువలాన నద్దములు మందులు మ్రాఁకులు పువ్వుబోండ్లకున్
జిక్కులఁబెట్టు మిండఁడని చెప్పకు చప్పకు కూచిమారునిన్ -3

బాలల నిందు జవ్వనుల ప్రౌఢల లోలలఁజేరి వారికే
కేలి భజించునట్లు తమకింపక యింపులు ముంపనేర్చుఁ బాం
చాలుఁడు చాలుఁ గౌగిలికిఁ జల్లనివాఁడగు వాని చందముల్
మేలని పొందిరేనిఁ బెఱమిండలకున్ గొఱకారు కామినుల్ -4

ఇవి నాలుగు పద్యములును లక్ష్యలక్షణ సంగతిని బట్టి త్రిపురారి ప్రేమాభిరామములోనివే అగును కనుక ప్రేమాభిరామము - కళావిలాసము, కళాభిరామమువలె - కామశాస్త్రము కావలయును.

మఱి త్రిపురారి అన త్రిపురాంతకుడు. ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసము నందు "భారతివై" అను అంబికాశతకములోని పద్యమునకు ముందు 'రావిపాటి త్రిపురారి' అని కలదు. ప్రత్యంతరము నందును 'రతినాథుండు' అను తారావళిలోని పద్యమునకు ముందు 'రావిపాటిత్రిపురారి' అని కలదు. అంతేకాదు. ప్రబంధరత్నాకరము నందు ఇంటిపేరు లేకుండ, కవిపేరు పేర్కొనుట కూడా కలదు. కనుక అంబికాశతకము, తారావళి వలె ప్రేమాభిరామమును రావిపాటి త్రిపురాంతకుని గ్రంథము కావచ్చును. రావిపాటి త్రిపు

రాంతకుని ప్రేమాభిరామము సంస్కృత గ్రంథము కాదు,[10] అగును[11] అను వాదములను కలవు. కాని ప్రేమాభిరామము సంస్కృత నాటకముగను, తెలుగు కామశాస్త్రముగను రావిపాటి త్రిపురాంతకుడే రచించుట సంశయము కలిగించునది. కనుక ప్రేమాభిరామ కామ శాస్త్రమును రచించిన త్రిపురారి మఱొక త్రిపురాంతకుడుకావచ్చును. అయ్యలరాజు త్రిపురాంతకుని ఒంటిమిట్ట రఘువీరశతకము నందు –

చెడుగన్ గష్టుఁడ దుష్టచిత్తుఁడ బరస్త్రీలోలుఁడన్ బాలుఁడన్
జడుఁడన్ మూఢుఁడఁగొండెగాడను దురాచారిన్ నిషేధాత్ముఁడన్
గడుసన్ గా కరి గల్ల గుల్లఁ గపటిన్ గర్విన్ననున్ గావుమా
రడి యున్నాఁడను నీవె దిక్కు రఘువీరా! జానకీనాయకా! 17

పరనారీ కుచకుంభపాళికలపైఁ బాదాబ్జయుగ్మంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలతటిపైఁ గంఠంబుపైఁ గొప్పుపైఁ
బరువుల్ వారెడు నా తలంపులు మిమున్ భావింపఁగాఁజేసి స
ర్వరసాధీశ్వర నన్నుఁబ్రోవు రఘువీరా! జానకీనాయకా! 18

అను పద్యములు కలవు ఏవంవిధ గుణగణగరిష్ఠుడైన అయ్యల రాజు త్రిపురాంతకుడు ప్రేమాభిరామ కామశాస్త్రమును రచించిన త్రిపురారి అగునేమో!

భాస్కరుని శృంగార రత్నాకరము :

ప్రబంధ రత్నాకరము తంజావూరి ప్రతి యందు 'కళావిలాసము' లోని 'తొడవులు పెట్టి' అను పద్యమునకు అనంతరము 'లలనలు గొందఱు' అను పద్యము కలదు. ఆకరము లేదు. కాని, తత్పూర్వ పద్యమునకు ఆకరము 'కళావిలాసము' అని తంజావూరి ప్రతి యందు కలదు. గావున, 'లలనలు గొందఱు' అను పద్యమును కళావిలాసములోని పద్యమని ప్రథమతః మానవల్లి రామకృష్ణ కవి గారి ప్రతిపాదనము.[12] తదుపరి నిడుదవోలు వేంకటరావు గారి నిర్ణయము.[13] కాని 'లలనలు గొందఱు' అను పద్యము అముద్రితమైన ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను లక్షణ గ్రంథమునందు భాస్కర ప్రెగ్గడ రసాలంకారములోని పద్యముగ కలదు గావున, కళావిలాసములోని పద్యము కాదని పూర్వోక్తము.[14] అది ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు ఇట్లు కలదు –

కూర్మి, భాస్కరుని శృంగార రత్నాకరము :

లలనలు గొందఱాత్మవరులన్ దమహూడిన చెయ్వులన్నియున్
దలఁచి సఖీ జనంబులకుఁ దప్పక చెప్పెడువారు పుణ్య జీ
వులు చెలియా మదీశుని కవుంగిలి డాయుడు నాకు వల్పురే
ల్డాలగు బెఱుంగఁబోలు నట తోఁపవు మీఁద రతిప్రయోగముల్

ఇందు 'లలనలు గొందఱు' అను పద్యమునకు ఆకరము ఇది మిశ్రముగ కలదు. ఇందలి భాస్కరుడు అందలి భాస్కరప్రెగ్గడ అగును. కనుక శృంగార రత్నాకరము రసాలంకారమును కావచ్చును. అథవా, ఒకవో ప్రమాద పతితము కావలయును. ఏమైనను 'లలనలు గొందఱు' అను పద్యము కళావిలాసములోనిది కాదనుట మాత్రము యథార్థము.

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతి యందు, ప్రత్యంతరము నందును ఆకరములు లేని పద్యములు కలవు అవియెల్ల పూర్వాకరపురస్కారములు కావు. అయినవి. కానివి కలవు. అది గమనింపక పోవుట వలన వేటూరి ప్రభాకరశాస్త్రి గారు సంఘటించిన ప్రబంధరత్నావళి యందు ప్రమాద పతితములు కలవు.

కానుకొల్లు అన్నమరాజు అమరుకము

అమరుకవి రచించిన సంస్కృతశతకము అమరుకము అత్యంత ప్రసిద్ధము. అందలి శ్లోకములకు ఆంధ్రీకరణము శ్రీనాథుని శృంగార నైషధము నందు భీమ ఖండమునందు మాత్రమేగాక వీధినాటకము నందును కలదు. అమరు కావ్యమునకు పెదకోమటి వేమారెడ్డి శృంగార దీపిక అను వ్యాఖ్యానమును సంతరించెను. సప్తశతిసారమునకు భావ దీపికవలె – బహుశః సప్తశతివలె అమరుకమును శ్రీనాథుడు ఆంధ్రీకరించెనేమో అనుటకు వీథినాటక పద్యము అవకాశము. శ్రీనాథుని తర్వాత కానుకొల్లు అన్నమరాజు అమరుకమును తెనిగించినట్లు ఉదాహరణ పద్యములు అను సంకలన గ్రంథము నందు రెండు పద్యములు కలవు అవి ప్రబంధరత్నావళి యందును కలవు. కాని పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరములోని కానుకొల్లు అన్నమరాజు అమరుక పద్యము ప్రబంధరత్నావళి యందు లేదు. కారణము ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతియందు కానరాకపోవుట మాత్రమే. అది. ప్రత్యంతరము నందు ఇట్లు కలదు.

అలుకలు, కానుకొల్లు అన్నమరాజు అమరుకము

ఏమిటి కింతలేసి హృదయేశ్వరి ముద్దుఁడవోలె నాలుగో
ఝామున వచ్చి పాదజలజాతము లొత్తెద వక్కటా భవ
త్కోమల పాదపద్మములకున్ దగుఁగాక మదీయసేవ యే
యే మదిరాయతేక్షణల యిండ్లకు నింతనిదాసినాఁడవో

ఇది శృంగారదీపికయే కాని, శృంగారదీపికతోడి అమరు కావ్యము నందు దీనికి మూలభూతమైన శ్లోకము లేదు. అంత మాత్రమున శంకనీయము కాదు. సప్తశతి సహస్రాధిక మయినట్లు, అమరు శతకము శతాధికమయినది. అధిక శ్లోకములు కొన్ని మాత్రమే

అందుబాటులో కలవు. ఉదాహరణ పద్యములు అను సంకలన గ్రంథము నందు ఉట్టంకింపబడిన 'చులుకన, తివిరిరాశికి నెక్కి' అను రెండు పద్యములను అమరు శతకములోని మొదటి రెండు శ్లోకములకును తెనుగు సేతలే. అధికశ్లోకములను కానుకొల్లు అన్నమరాజు తెనిగించి యుండును. కనుక ప్రబంధ రత్నాకరము ప్రత్యంతరములోని పయి పద్యము కానుకొల్లు అన్నమరాజు అమరుక పద్యమే అగును.

## పణిదపు మాధవుని ప్రద్యుమ్న విజయము

ప్రబంధ రత్నాకరము తంజావూరి ప్రతియందు పణిదపు మాధవుని ప్రద్యుమ్న విజయములోని పద్యములు కలవు. ప్రథమాశ్వాసము నందు ఎనిమిది, ద్వితీయాశ్వాసమునందు ఒకటి, తృతీయాశ్వాసమునందు నాలుగు పద్యములు కలవు తృతీయాశ్వాసమునందు 'గాఢతరకాంతికై' అను పద్యమునకు ఆకరములేదు. అది ప్రద్యుమ్న విజయములోని పద్యము కావచ్చును. కాకపోవచ్చును. 'ప్రాంతియే యింక' అను పద్యమునకు తంజావూరి ప్రతియందు 'ప్రద్యుమ్న విజయము' అని ఆకరము కలదు. అయినను ప్రబంధరత్నావళి యందు పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్న చరితము లోనిదిగ ప్రభాకర శాస్త్రిగారు అనుసంధించుట ప్రామాదికము కావచ్చును. ప్రబంధ రత్నావళిలోని 'అత్రిముని కంటి' అను పద్యము ప్రద్యుమ్నవిజయము లోని పద్యము కాదు. అది తపతీసంవరణోపాఖ్యానములోని పద్యమని నిడుదవోలు వేంకటరావుగారి నిర్దేశము[15] అట్లు ప్రబంధ రత్నాకరము ప్రత్యంతరము నందును కలదు. మఱొక పద్యమును ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు కలదు.

## చీఁకటి, పణిదపు మాధవుని ప్రద్యుమ్న విజయము

నెఱయఁగ బ్రహ్మాండంబును
గరళమ్మునఁగాటుకడుసు గలిపిన భంగిన్
గిఱిగొని చీకటి కన్నులు
దెఱచిన మూసినను నొక్కతెఱఁగై యుండెన్ -1

## చకోరసంవాదము, పణిదపు మాధవుని ప్రద్యుమ్న విజయము :

ప్రాంతియే యింక గల్గు లేఁతవెన్నెల సిగ్గు
నూరి పట్టెద నీకు నూరకుండు
మునుపుగా నీకిత్తు ముదురు వెన్నెల సోగ
సంతసంబున నుండు జాలిమాని
వేగిరింపకు నీకు వెలఁది వెన్నెల క్రొవ్వుఁ
గుడిపింతుఁ జిన్నారి కడుపు నిండ
నింత ముచ్చటవాయ నీవంతు పండువె
నెలలు వెల్లినులుకు నిన్నఁజేరి
కూయకుఁడు మీరు సంతుష్టి గూరినపుడు
శీతలంబుగ వెన్నెల చిగురుఁబావ్ర
నంచు నిడి నిద్రపుచ్చెద నను చు నాద
రించె బిడ్డల నొక చకోరీపురంధ్రి -2

ఇది చక్కని, చిక్కని, రసచిక్కణమైన పద్యము. ఇందు తిర్యగ్గతమైనను - మునీంద్రసమ్మతమని విశ్వనాథుడు మొదలించిన వత్సలరసము సహృదయ హృదయంగమముగ కలదు.

ఇంత చక్కగ ప్రద్యుమ్నవిజయమును రచించిన మాధవుని ఇంటిపేరు తంజావూరి ప్రతియందు, ప్రత్యంతరమునందు పణిదపు, పణిదపు,పణిదపు అని బహువిధములుగ కలదు. ఇంటిపేరు లందు పుంప్వాదేశము ప్రసిద్ధము - మైలవరపు, అమలాపురపు, అసన పురపు - పణిదము అను శబ్దము గుడపాకము అనుఅర్థమున కలదు. కనుక మాధవుని ఇంటిపేరు పణిదపు కావలయును 'పణిదెపు' అను ఇంటిపేరు కలవారు ఇప్పుడును కలరు. పణిదపు మాధవుని ప్రద్యుమ్న విజయములోని పద్యములు మొత్తము పదునాలుగు లేక పదునైదు ప్రబంధరత్నాకరము నందు కలవు.

## తులసి బసవయ్య సావిత్రి కథ

ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతి యందు తులసి బసవయ్య సావిత్రి కథలోని పద్యములు కలవు. ప్రథమాశ్వాసము నందు పది కంటు, ద్వితీయాశ్వాసము నందుతొమ్మిది, తృతీయాశ్వాసము నందు ఆరు పద్యములు కలవు. అవి ప్రబంధరత్నావళి యందును కలవు. అందులేని, ఇందుచేరని ఇంకొక పద్యము ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు కలదు.

## చంద్రోదయము, తులసిబసవయ్య సావిత్రి కథ :

జగదేకవైభవాస్పదమైన తన మేను
వేల్పుల కెవ్వాఁడు విందు సేసె
మన్మథాంతకు జటామండలం బెవ్వాఁడు
దిట్టయై తోరణ గట్టుకొనియె
వనజాతవాసిని కనుఁజూడై యెవ్వాఁడు
వేడ్క నంబోధి నావిర్భవించె
గాఢాంధకార సంఘములపై నెవ్వాఁడు
ధవళాంశుపటలంబు దాడిపెట్టె
నట్టి వేల్పు నిశాధ్యక్ష పట్టబద్ధుఁ
డత్రికాసారరాజహంసార్భకంబు
తారక లోక సౌఖ్య ప్రథా విభూతి
నమరఁగళలకుఁదానకంబనఁగఁబొడిగి"

ఇది, అవి కలిసి ఇరువదియేడు పద్యములు. చతుర్థాశ్వాసము నందు మఱొక పద్యము కలదు. మొత్తము ఇరువదియెనిమిది పద్యములు. సావిత్రి కథ మహాభారతము లోనిది. అది మహాభారత విమర్శకులకు ప్రశంసాపాత్రమయినది. అట్టి సావిత్రి కథను అధికరించిన తులసి బసవయ్య సావిత్రి కథ అనుకావ్యములోని ఇరువది యెన్మిది పద్యములును అభిజిత్తుతో కూడిన ఇరువది యేడు నక్షత్రముల వలెప్రకాశించునవి.

లక్కాభట్టు శతపక్షి సంవాదము :

ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు ఇట్లు కలదు -

రాత్రి, ఉభయకవి లక్కాభట్టు శతపక్షి సంవాదము ':

నీవీబంధము వీడు మోవి యధరన్ నేత్రంబు లల్లాడుఁ జన్
గ్రేవల్గానఁగవచ్చుఁ గ్రొవ్వెద విరుల్ పృథ్వీస్థలిన్ రాలు హృ
ద్భావాగారములోనఁ జెమ్మగిలుఁ జిత్తంబుత్తలం బొందునా
నావిభ్రాంతులు పుట్టు నింతులకుఁ బొంతన్ వింతవారుండినన్

ఇది ఛందము లేక బాలబోధఛందస్సు లేక సర్వలక్షణసారము అను అముద్రితలక్షణగ్రంథము నందు రెండు స్థలము లందు కలదు. ఒక స్థలము నందు 'పృథ్వీస్థలిన్ ' అనుచోట మాత్రము 'పృష్ఠస్థలిన్' అను పాఠాంతరము కలదు.

ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతి యందు గాని, ఉదాహరణ పద్యములు అను సంకలన గ్రంథము నందు గాని, తత్తదనుసారి ప్రబంధరత్నావళి యందు గాని లక్కాభట్టు శతపక్షి సంవాదము ప్రసక్తి లేదు. ఈ లక్కాభట్టే తెలుగు క్షేమేంద్రుడు.

పెదపాటి సోమయ అరుణాచలపురాణము :

ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతి యందు పెదపాటి సోమయ అరుణాచల పురాణములోని పద్యములు కలవు. ప్రథమాశ్వాసము నందు పది, తృతీయాశ్వాసము నందు ఒకటి కలవు. ప్రథమాశ్వాసములోని 'ప్రతిభా విలంఘిత' అను పద్యమునకు ఆకరము లేదు. కనుక అరుణాచల పురాణములోని పద్యము కావచ్చును, కాకపోవచ్చును. ప్రథమాశ్వాసములోని పది పద్యములు ప్రబంధరత్నావళి యందు కలవు గాని, తృతీయాశ్వాసములోని ఒకపద్యము లేదు. కాని 'గ్రంథ నామము కర్త నామము తెలియరానివి' అను శీర్షికను అదేపద్యము కలదు. తంజావూరి ప్రతి యందు ఆ పద్యమునకు ఆకరము లేదు. ప్రత్యంతరము నందు ఇట్లు కలదు.

'వేఁగుఁదెమ్మెరలు, కవిలోకబ్రహ్మ అరుణాచలపురాణము

గొజ్జంగివిరులపై కుప్పించి కుప్పించి
కన్నెగేదఁగులపై గంతు గొనుచు
పకుళగుచ్ఛములపై వర్తించి వర్తించి
పున్నాగతతులపై పూన్కి నెఱపి
గురువిందపొదలపై గ్రుమ్మరి గ్రుమ్మరి
విరివాదిలతలపై విశ్రమించి
మల్లికావళులపై మసలాడి మసలాడి
సురపొన్న తరులపైఁ బొరలుపెట్టు

ననుదినము నిట్లు పుష్పవాసనలఁదేలి
యంగజాభంగ రతులందు నసఁగి పెసఁగి
యలసి పడియున్న జనముల యలఁతమాన్చు
మలఁగి యప్పురి ప్రాభాతమారుతంబు'

ఇందు అరుణాచలపురాణము కర్త కవిలోకబ్రహ్మ అని కలదు. అది పెదపాటి సోమయ బిరుదు. ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతి యందు ప్రత్యంతరము నందును కవిలోకబ్రహ్మ పెదపాటి సోమయ అని బహుస్థలము లందు కలదు. కనుక పెదపాటి సోమయ అరుణాచల పురాణములోని పద్యములు మొత్తము పది లేక పదకొండు తృతీయాశ్వాసము వఱకు కలవు. చతుర్థాశ్వాసము నందు మఱొక మూడు, నాలుగు పద్యములు కలవు.

కవిలోక బ్రహ్మ రత్నావళి :

కవిలోకబ్రహ్మ పెదపాటి సోమయ అరుణాచలపురాణము కేదార ఖండము, శివజ్ఞానదీపిక అను గ్రంథములలోని పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము నందు కలవు. శివజ్ఞానదీపికలోని పద్యము కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహము నందునుకలదు. పెదపాటి సోమయ త్రిపురవిజయములోని పద్యములు ఉదాహరణపద్యములు అను సంకలన గ్రంథము నందు కలవు. ఇంతవఱకు తెలిసిన పెదపాటి సోమయ కృతులు నాలుగు మాత్రమేఁ అయిదవకృతియును కలదు అది రత్నావళి. ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు ఇట్లు కలదు-

'చంద్రోదయము, కవిలోకబ్రహ్మ రత్నావళి

చిత్రజాంతకశిరః సింహాసనంబుపై
నిండువేడుక గొలువుండు రాజు
ప్రొద్దు ప్రొద్దుకుఁ దండ్రిఁబోడగన్న నివటిల్లు
ప్రేమంబుతోడను బెంచుకొడుకు

భటులకుఁ బగలిచ్చి పని దప్పిపోకుండ
రాత్రులు గొలువిచ్చు రమ్యమూర్తి
నిర్జరావలి నెల్ల నెలనెల దప్పక
పడిపట్టి బ్రోచిన ప్రభువరుండు
ప్రొద్దు వెన్నంటి కలువలప్రోదికాఁడు
జారచోరుల పాలింటి చల్లజంపు
కొలఁది దప్పిన విరహుల గుండె దిగులు
చందురుఁ డుదయించెఁగాంతి నిస్తంద్రుఁడగుచు'

ఇది కవిలోకబ్రహ్మ అనగా పెదపాటి సోమయ రత్నావళి లోని పద్యము. విషయము చంద్రోదయ వర్ణనము. కనుక రత్నావళి లోని కథావిషయము తెలియదు. కాని, శ్రీహర్షుని రత్నావళి నాటకము ప్రసిద్ధము. నిపుణకవి అయిన శ్రీహర్షుని రత్నావళి నాటకమును కవిలోకబ్రహ్మ శ్రవ్యకావ్యముగ ఆంధ్రీకరించెనేమో !

**అజ్ఞాతకవి నిజలింగ చిక్కని కథ :**

ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందు మరొక గ్రంథము కలదు.

'చోరకులు, నిజలింగ చిక్కని కథ :

కలికము నీలికాసెయును గన్నపుఁగత్తియు మేనికాపు ముం
దలములు బంతి కుంచెయును దాలము చేయును. బొక్కుమందుకు
క్కలు గుదిగట్టు తుమ్మెదలు గమ్మిన క్రోవియుఁ గొంకి నారసం
బలవడఁబూని చిక్కని మహాత్ముఁడు చోరకులావతంసుఁడై

ఇందు నిజలింగచిక్కని కథ అని గ్రంథనామమున్నది. కవి నామము లేదు. తెలిగె నిమ్మనాథుని నిజలింగ చిక్కయ్య కథ అను యక్షగానము నందు పయి పద్యము కానరాదని తిరుమల శ్రీధరమూర్తి గారు తెలిపిన సంగతి[16] కనుక నిజలింగచిక్కని కథ మరొక గ్రంథము కావలయును. పద్యము నందు 'శాళముచేయి' కలదు. ఇందలి 'చేయి' అన్యదేశ్యము. 'షావి' అను పోర్చుగీసు పదమునకు వికృతి అయిన 'చెవి'కి రూపాంతరము.[17] కనుక అజ్ఞాతకర్తృకమైన నిజలింగచిక్కని కథ పదునారవ, లేక పదునేడవశతాబ్ది గ్రంథము కావలయును. అందలి పద్యమును సంకలించిన ప్రబంధరత్నాకరము తదనంతర గ్రంథ మగుట తథ్యము. ప్రబంధరత్నాకరము పదునెన్మిదవశతాబ్ది గ్రంథమని పూర్వోక్తము[18] ఇది తదుపబలక సాధనము.

ఇవి పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము నందలి తృతీయాశ్వాసములోని విశేషములు. ఇక చతుర్థాశ్వాసములోని ఇతోధిక విశేషములు మరొక వ్యాసము.

## సూచికలు

1. కుమారసంభవము, ప్రథమాశ్వాసము, పీఠిక, పు. 1
2. ఆంధ్ర కవుల చరిత్ర, ప్రథమ భాగము, ద్వితీయ ముద్రణము, పీఠిక, పు. 7
3. ప్రబంధరత్నావళి
4. అదే, పీఠిక, పు. 1
5. ఒకటి వలె
6. మూడువలె, ద్వితీయ ముద్రణము, పు. 41
7. ఆరువలె, పీఠిక, పు 40
8. నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీన గ్రంథమాల, పుటలు 244-5
9. అదే పుటలు 245-8
10. ఆంధ్రకవితరంగిణి, నాలుగవ సంపుటము, పు 48
11. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపు. 2, పు. 389
12. ఒకటి వలె
13. ఆరు వలె
14. ఎన్మిదివలె, పుటలు 243 - 4
15. మూడు వలె
16. 15. 6. 1985 వ తేదీ లేఖ
17. తెలుగు వ్యుత్పత్తికోశం, మూడో సంపుటం, పు. 118
18. ఎన్మిది వలె, పు. 287

( అయిపోయింది )

# సంధ్యాపుష్పాలు

సాయంవేళ
మా పెరట్లో
పూచిన రుద్రాక్షలేచాలు
నా జీవితాన్ని
నవనందనం చెయ్యడానికి
ఎర్రగా తెల్లగా పచ్చగా
మూడూ కలిసి ముచ్చటైన మణిప్రవాళ వర్ణంగా
ఎంత ముద్దొస్తాయి
పరమేశుడు సైతం ఈ మాలికను
పార్వతి సిగలో అలంకరించేందుకు సంబరపడతాడు.
ఎందుకో తెలుసా
ఇవి ధరించిన గిరిజ
ఎంతో సౌందర్యంతో దీపిస్తుంది
లక్ష్మీనారాయణులకిష్టమైనవి రుద్రాక్షపువ్వులని
మా అమ్మమ్మ మనవరాళ్ళకు చెబుతుంటే
కల్పనే ఐనా నాకు
కమనీయంగా తోచింది
పాదాల పరికిణీలు జీరాడగా
పడుచులు పుష్పాపచయం చేశారు
మాలికలు సిద్ధం చేశారు
తలనిండా రుద్రాక్షమాలికలు దాల్చి
రుద్రాక్ష అలంకరించిన బొడ్డెమ్మలను
వాకిళ్ళలో పెట్టి
పాట పాడుతూ ఆటాడుతుంటే చూడాలి
అరుణ సంధ్యలో
అందంగా శోభించే రుద్రాక్షసుమాలని
మా పెరట్లో
మల్లెలు లేవన్నబాధ నాకు లేదు
సంపంగులు దొరకవన్న దిగులు లేదు
రుద్రాక్షలు
నా జాతీయ పుష్పాలు
జానపద సోయగాల్ని వెలారుస్తాయి
ఏకృత్రిమతనూ దరికి రానీయకుండా
స్వచ్ఛంగా
సుందరంగా
పూచే రుద్రాక్షలంటే
నాకు వల్లమాలిన అభిమానం
గులాబీలూ వద్దు గుల్మొహర్లూ వద్దు
హృదయాన్ని రాగరంజితం చేసే
ఈ రుద్రాక్షలే
మా పల్లెపడుచుల కాత్మీయం
నా జీవితాన్ని
నవనందనం చేసే
సంధ్యాపుష్పాలు
మా పెరట్లో పూచే
రంగురంగుల
రుద్రాక్షలు రుద్రాక్షలు

# దీపమ్

ఇక్కడంతా శూన్యం
ఈ శూన్యంలో ఆశవినువ్వు
ఇదంతా అరణ్యం
ఈ అరణ్యంలో దారివినువ్వు.
ఇప్పుడంతా నిబిడాంధ్యం
ఈ అంధకారంలో దివ్వెవినువ్వు
ఇదో అగాధసముద్రం
ఈ సముద్రంలో నావవినువ్వు
ఇదో బాధల జీవితం
ఈ జీవితంలో మాధుర్యానివినువ్వు
ఇదో సుదూర ప్రయాణం
ఈ ప్రయాణంలో పాథేయంనువ్వు
నా ఆశవినువ్వు
నా దివ్వెవి నువ్వు
కవితా !
ఓ
కవితా !

"తిరునగరి"




(గ త సం చి క త రు వా యి)

**3**

ఈ గుళ్ళి చెట్టు లాంటిదే యింకో ప్రధానమైనది. ఉత్తర వాసలో పడమటి వేపు వున్న చివరి యింటి గోడకు ఆనుకుని వున్న అరుగు. అరడుగుల పొడుగున్నా యీ అరుగు వెడల్పు రెండడుగులకు మించి వుండదు. ఈ అరుగుకు జేగురురంగు పూసి దానిపై తెల్లని గుళ్ళ సున్నంతో వేసిన ముగ్గులు మెరిసిపోతుండేవి. ఆ అరుగు మీద యెప్పుడూ ఒక నిలువెత్తు విగ్రహం ప్రత్యక్షం. ఆవిడే మా తాతమ్మ. అంటే మా అమ్మ తండ్రి తల్లి. ఆవిడ పేరేంటో నాకు గుర్తు లేదు గానీ తాతమ్మ అని పిల్చేవాడిని. తన పదివేళ్లూ చూపించి యెనిమిది సార్లు లెఖ్ఖపెడ్తే యెంత వస్తుందో అంత వయసు నాది అంది. నేను ఒకసారి యెనిమిది సార్లు లెఖ్ఖపెట్టి యెనభయ్ అన్నాను. నల్లగా వుండేది. ఆవిడ భర్తను నేను చూడలేదు గానీ అతను కాంతమ్మత్త లాగే వుండేవాడట. అంటే తాతమ్మ యెదరగా ఆ భర్త నిల్చుంటే భుజాలవరకైనా వచ్చేవాడు కాదన్నమాట. ఇల్లరికం రాడానికి ఒప్పుకున్నాడు. కాబట్టి యీ యిల్లాలిని అపురూపంగా చూసుకునేవాడట. ఐదుగురు కొడుకులూ యీవిడ యెముకల బలాన్ని పుంజుకున్నారు. అందరూ అంత యెత్తు మనుషులే కానీ ఆ నలుపు కడసారి కొడుకు సీతయ్యకు తప్పించి యింకెవరికీ రాలేదు. పెద్దవాడు నరసింహులు, మూడోవాడు ఆదెన్నకు అతని తెలుపు వచ్చింది. రెండోవాడు లక్ష్మీ నారాయణకు తెలుపు నలుపు కలిపిన ఛాయ వస్తే - నాలుగోవాడు కాశీపతిది మాత్రం రాగిఛాయ శరీరం. వీళ్ళందరిలో ఆమెకు తన రంగులో వున్న కడసారపు కొడుకు సీతయ్య అంటే మహా యిష్టం. అందుకే ఆ కొడుకు గదికి ఆనుకుని వున్న అరుగుమీద మకాం వేసిందనుకుంటాను. యెనభయ్యేళ్ళయినా తాతమ్మకు నడ్డి వంగలేదు. గానీ యెప్పుడూ వూళ్ళో తిరగటం అలవాటు కాబట్టి ఒకసారి వర్షంలో కాలుజారి పడటం వలన ఒకకాలు కొద్దిగా చొట్టపడింది. చొట్ట పడినా తిరగటం తగ్గలేదు. ఆవిడ జుత్తులో నలుపు వెంట్రుకలు అక్కడక్కడ వుండేవి. నాకు సాధారణంగా యేదో తింటున్నట్లే కనపడేది. ఆమె పెద్ద కొడుకు పళ్లు రాలిపోయాయిగానీ ఆమెపళ్లు అన్నీ దిట్టంగానే వున్నాయి. వాటి బలం అవి చూపించడానికి కామోసు యేమి దొరుకుతుంది. యెలా నములుతానన్న చిక్కిన అర ఏనుగులా కనపడేది.

పై మనిషి నారెమ్మ నాకు పిల్చి, పండూకాయా యిచ్చేది. కానీ యీ తాతమ్మ ఒక్కనాడు నాకేదీ యిచ్చినట్లు గుర్తు లేదు. ఒకోసారి కోడళ్ళు ఆవిడ మీద విరుచుక పడేవారు. ఊరంతా దండు కొచ్చి తింటుందని! నేను దండుకోలేదు. వాళ్లు పిల్చి యిచ్చారని అనేది. ఇంకా వాళ్ళ నోళ్ళు వూరుకోకపోతే కూతురు కాంతమ్మను పిల్చి తగిలించేది. ఆవిడ గుళ్ళిచెట్టు క్రింద కెళ్ళి అంత మానధనం వున్న వాళ్ళు ఉండా పండూ చేసి మా యమ్మకి యివ్వలేకపోయారా!" అన్నట్లు వాళ్ళ గుట్లన్నీ బయట పెట్టేసేది. ఈగుట్లు కొన్ని యిప్పటికి నాకు గుర్తున్నాయి. అందరూ కలిసి వున్న రోజుల్లో చిన్న కోడలు ఒక సారి వడ్డించినప్పుడు మొగుడు గిన్నె అడుగున రెండు వండిన గుత్తి వంకాయలు పెట్టేసి పైన అన్నం సర్దేసి పెట్టేసింది. ఆ మొగుడన్న అమాయకుడు నెమ్మదిగా తినేకండా ఆవేవో చచ్చిన యెలికలను కున్నాడేమో ఒక్కగెంతేసి యిదేమిటి అంటే అక్కడే వున్న కాంతమ్మ బుడ్డీ వెలుతుర్లో యీ రహస్యం కనుగొంది. మూడో కోడలు అటకమీదనించి ఒకరాత్రి పడిపోయింది. ఈ రాత్రి అటకెందు కెక్కిందని కాంతమ్మ అప్పటికప్పుడే అటకెక్కి చూస్తే పైన కుండలో రహస్యంగా కన్నవారు పంపిన దాచుకున్న అరిసెలు తినడానికి ఎక్కిందని తెలిపోయింది.

మా తాతమ్మ తండ్రికి ఒక్కర్తె కూతురు కదా. చిన్నప్పటి నించీ ముద్దు ముచ్చటా తీర్చుకుంటూ పెరిగింది కదా! పరాయి బిడ్డలు వచ్చి యేలుబడి చేస్తే యెందుకొప్పుకుంటుంది? మొగుడికి శాశించగలిగింది కానీ యీ చిన్నకోడలుండే - కవీశ్వరుడి కూతుర్ని శాశించలేక పోయింది. నేరక దీన్ని కోడలుగా చేసుకున్నానని విసవిసలాడేది. గానీ చిన్న కొడుకుమీద మమకారం కొద్దీ 'ఛి' అన్నా 'ఛా' అనేది కాదు.

ఒక సాయంత్రం యీ అరుగుమీద కూర్చునే మా తాతమ్మ బాగా ముదిరిన కొబ్బరి ముక్కలు పరపరా నమిలేస్తోంది. నేను యిసుక దిబ్బలమీద ఆడి అలసి వచ్చానేమో యేదో తినాలని నాకు మనసు పుట్టడంచేత దగ్గరగా వెళ్ళినిల్చున్నాను అలా నములుతోందే గానీ తినమని ఒక చిన్న ముక్కయినా యివ్వలేదు. నేను కళ్ళప్పచెప్పి అలా నోరు తెరచి చూస్తున్నాను. నా కళ్ళయెదుట నాకు పెట్టకుండా చెక్కకు చెక్కా నమిలేసి చిన్నముక్కను మాత్రం చీరగ్గెనంలో దోపుకుని లేచిపోయింది. దాచిన ఆ చిన్న ముక్కయినా యిస్తుందేమోనని వెంట పడ్డాను. అలా జాలారి వెంకన్న యిల్లుదాటి ముందుకు పోయింది. ఏటిఒడ్డున పెద్ద సిరిసించెట్టుంది. దాన్నిక్రింద ఒక యెరుకలి కుటుంబం వుంది. వలలతో పాటు వలవేసి పట్టుకున్న రెండు తెల్లని కొంగలున్నయ్. ఒక ముంగిసకూడా ఆ చెట్టు వేరుకు కట్టి

తుంది. ఆ యెరుకలిదాని కొడుకు నా వయసువాడే. వాడి వంటి మీద ఒక మాసిన గోచి తప్పించి బట్టలేదు: తల గుండు గాదీ గుండుగా లేదు. అద్భుతంగానే వున్నాడు. చీరచెంగులో దాచిన కొబ్బరి ముక్కను తీసి "వాలిగా......ఇందరా" అని వాడిచేతిలో ముట్టుకోకుండా యెత్తి మరీ వేసింది. నాకు కళ్ళంటనీరు వచ్చినట్లు గుర్తు. నా ఒంటి మీద చెయ్యివేస్తే తప్పిరయ్యకుని కదలిపోయాను.

"నీ కేందులో యిస్తారు. వాడికేవరిస్తారు" అన్నది.

మా తాతమ్మ చావు నేను చూసాను. గాలివాన వచ్చింది. మా గడ్డి యింటి కప్పులన్నీ యెగిరిపోయాయి. సరంబీ యిల్లు కారి జబ్బుతో వున్న మా తాతమ్మ మీద చినుకులు రాలి తడిచిపోయింది. గాలి హోరు తగ్గాక "ముదుమనవడివి. నా మీద పేలాలు జల్లవా?" అంది నాకు కొబ్బరిముక్క యివ్వని తాతమ్మ మీద పేలాలు జల్లననుకున్నానుగానీ, నన్ను ఆమె శవం ముందు నడిపించి పేలాలు జల్లించిన దృశ్యం గుర్తుంది.

## 4

మా తాతయ్య అంటే మా తల్లి తండ్రి వున్నాడే నరసింహులు. అతనిది ఒక ఉనికి అని లేదు. ఇంట్లో యెప్పుడూ చూసినట్లు గుర్తు లేదు. నాకు గుర్తున్నదల్లా పెరటసాలలో పశువుల మధ్యా, ఊరిబయట, పొలాల మధ్య ఉండేవాడు. ఆ వూర్లో మరో ముగ్గురు నరసింహులు పేరు గలవారున్నారు. కాబట్టి ఇతనిని బంగారం నరసింహులు అనేవారు. ఇతని శరీరం బంగారుఛాయ యితని మనసు బంగారం. మనిషి బంగారం అనేవారు. ఇతని చెవిలో ఆడాళ్ళు ధరించే బంగారం తమ్మెట్లుండేవి. మిగతానరిసింహులకు లేవు. ఆడవారి నగలు ధరించినా ఆడారినరసింహులు అని యెవరూ అనటంవిన లేదు. నాకు బాగా గుర్తుంది. ఒత్తుగా వున్న జుత్తులో గుండ్రంగా రెండుసుడులుండేవి. వ్యవసాయం, పశుసంపదకి ఒక సుడి అనీ - యింకోసుడి చక్కటి పెళ్ళాం అని చెప్పేవాడు. రెండూ నిజమే అని నమ్మక తప్పలేదు. ఇంతచక్కని పెళ్లాం మీద చిటికి మాటికి అలిగేవాడు. అలిగే ఆరుగురు బిడ్డల తండ్రి అయ్యాక్కూడా. పదిమందికి తాత అయినా కూడా ఆ అలక తగ్గలేదు. మా అమ్మమ్మ యీ అలకలను విసుక్కుని అత్త గారితో 'మామగారి దగ్గర అడిగి యీ కొడుకును కన్నారా' అని నిలదీసి అడిగితే – ఆవిడగారు మెలకవగా "ఆడిపుట్టుకేఅంత. కట్టుకున్నావు కదా యెవరికోసం భరిస్తావని?" అధాటితో జవాబిచ్చింది.

ఇప్పటికీ దిగవపొలంలో కాలవగట్టుమీద ఒంటి యీతచెట్టు నాకు బాగా గుర్తుంది. ఆ చెట్టు క్రింద కూర్చొని మురీలవాడి దగ్గర మా తాత కొన్న బెల్లం ముడి ముద్దలని తింటూ పైకి చూసే దృశ్యం. ఈతచెట్టు మీద బంగారు పిచ్చుక గూళ్ళు – ఆ గూళ్ళతో ఆడుతున్న బంగారు పిచ్చుకలు. నా మనసులో యింతో అంతో మధురమైన వూహలు మొసలడానికి నా చిన్ననాట ముద్రవేసుకున్న ఘట్టాల్లో యిదొకటనుకుంటాను. ఆ విశాలమైన పచ్చని వరిచేలు బంగారు రంగుగా మారేటప్పుడు కొడవళ్ళతో కోస్తూ -

"కోత కొయ్యండమ్మ తుమ్మెదా
సేలు కోత కొయ్యంశమ్మ తుమ్మెదా
భాగ్యాలే పండాయి తుమ్మెదా
కోత కొయ్యండమ్మ తుమ్మెదా...."

ఈ లయబద్ధమైన గానంవింటూ మురీముద్దలు తినిలేచిన వాణ్ణి లేచినట్టుండక యింత బంగారు పిచ్చుకలకి విసిరి పట్టుకోడానికి వెళ్తే అవి దొరుకుతాయా ? ఆ పరాభవం మరచి చెట్టు మొదట్లో నీదివేపు 'నన్ను ముట్టుకుంటే నేను ముడుచుకుపోతానన్న తుప్పమీద కాలు వేశాను. ఇక్కడే మా తాతయ్య బంగారు హృదయం గుర్తుకొస్తుంది. ఆ చేతులు బంగారుచేతులే. ఊర్లో చేరిన పేదా బిక్కితోపాటు నన్ను తేలి ముట్టుకోమనేవాడు. లేక అంటే - కోసినచేను బండిమీదకు యెత్తేటప్పుడు పొలాలలో వద్దన్నా కొన్ని కంకులు రాలిపోతాయి. ఈ



కంకులు యేరుకోడానికి యెందరో పిల్లలు వస్తుండేవారు. వాళ్ళతో పాటు నేనూ లేకి యేరాక నన్నేకాకు అందర్నీ పిలిచి చివరి కుప్పలో యెవరు మొయ్యగలిగినంత వరిచేను వాళ్ళను తీసుకవెళ్లిపొమ్మనేవాడు.

ఆ వ్యవసాయం ఆ తాతయ్య అన్నట్లు అతనితోనే సరి. వాళ్ళకున్న జిరాయితీ పొలం తక్కువే. మా పొరుగూరు పోతయ్య వలస పొట్టినాయుడు ఆరెకరాల పొలం అంబారానికి దున్నేవారు. ఈయన పోయాక పొట్టినాయుడు కొడుకు పొలం అమ్మేసుకుని విశాఖ పట్నం ప్లీడరు ప్రాక్టీసు పెట్టుకోడానికి పోయాడు.

ఈ బంగారం తాతయ్య చనిపోయినప్పుడు నేను మా వూర్లోనే వున్నాను. అంత వయసు వచ్చినా మనిషి పికపికలాడుతున్నాడు. శరీరం వుబ్బినట్లు అనిపించింది. మెరిసిపడి పోతున్నాడు. నేను పట్నం నించి తీసుకవెళ్ళిన నెయ్యితో చేసిన మిఠాయితిని 'మనపడా – మా బేషుగా వుందిరా' అన్నాడు ఆ చచ్చిననాడు కూడా పెళ్ళాంమీద అలిగాడట. నేను తెచ్చిన కాజా బాగుంది. యింకొకటిమ్మంటే అంతా మీరే తినేస్తే యెలాగ అని మా అమ్మమ్మ అందని అలిగాడు. అలిగి యేటి ఒడ్డుకు బహిర్భూమికి వెళ్ళే యింకా యేం రాలేదని లైటు పట్టుకుని వెళ్లేసరికి ఒరిగి పోయివున్నాడు నలుగురు మోసుకొచ్చి వాకిట వేసాం. ఏడుస్తున్న పెళ్లాంతో యేదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. గానీ ఆ ప్రయత్నం ఫలించకుండానే రాత్రి పదిగంటలకే మెదడులో రక్తనాళాలు తెగిన జబ్బుతోపోయాడు.

## 5

మా రెండో తాత లక్ష్మీనారాయణ వున్నాడే అతను వస్తున్నాడంటే అంత దూరంనించే చప్పుడు వినిపించేది. ఆ కిర్రుచెప్పుల చప్పుడు లానే అతని మాటల ధాటీ! చేతిలో కలానికి నోటిలో మాటకీ తిరుగు లేదనేవారు. కిరీటంలేని చక్రవర్తి ఆ చుట్టుపట్ల యెవరంటే అతనే అనేవారు.

అతని గొప్పతనం యేమిటంటే యెదుటివాడు మాటాడుతున్నంతసేపు అతని గొంతుక యెత్తేవాడు కాదు. కాగితంమీద ఏమిటి రాసాడో చదువురాని ప్రజ యెదరగా అదే చదివేవాడు. చెడుగైనా యెదుటి వానికి చెప్పి మరీ చేసేవాడు. పనిచేసి చూపించాకే యేదైనా పుచ్చుకొనేవాడు. పని చెయ్యంచుకుని తన కష్టానికి తగ్గ ఫలం ముట్ట చెప్పకపోతే వాడికి నానా తిప్పలూ పెట్టేసేవాడు. అ నక్కచిక్కుల నుంచి తప్పించుకోడం సర్కారు ఉద్యోగులకు కూడ చేతనయ్యేదికాదు.

ఉందికూడా, లేదని, తనకు రావలసినది తగ్గించి యిచ్చిన వాడితో "నువ్వు నా అన్నదమ్ముడివీ బావమరిదివీ కావు. వీళ్ళని పోషించినట్లు నిన్ను పోషించడానికి అనేవాడు. ఆ బాధ్యత నిర్వహించడానికే కామోసు ఒక పనికాదు యెన్నెన్ని పనులో చేసేవాడు. పండిన పంట అంబారాలు, విత్తనాలు, మదుపులు పోను యీ ఉమ్మడి కుటుంబంలో ప్రతిపూటా పాతిక ముప్ఫయి కడుపులు నిండడానికి ఓ ఐదు నెలల గ్రాసమైనా మిగిలేదికాదు. సంక్రాంతి కొక సారి అందరికీ బట్టలూ పాతలూ కొనేసరికే సరి. ఇక పెళ్లిళ్లూ, పేరంటాలు, పురుళ్ల వుండనే వున్నాయి రాతకోతలూ, తగువుల పరిష్కారాలు, విడాకులు, తెంపడాలు, వెదుళ్ళ వ్యాపారం అంతా చేసేవాడు. అతనికి తెల్లియని లా పాయింట్లు లేవని అతన్ని కోర్టుపక్షి అనేవారు. ఇతనికి హోదావుంటే యీ తెలివితేటలతో చాకచక్యంతో ప్రపంచాన్నే యేలేసేవోడంటారు. ఆ చిన్న పరిధిలో అతను సామభేద దండోపాయాలు లేనిది యేమీ చెయ్యలేమని నిరూపించాడు. అతను వూర్లో తీర్చిన కొన్ని తగవులు చూశాను కాబట్టి అవి గుర్తుకొస్తున్నాయి.

ఒకసారి అతని దగ్గరకు విడాకులు తెంపేయండి బాబూ! ఈ లిద్దరి మతం కుదరలేదని వచ్చారు. తీర్పుచెప్పవలసినపుడల్లా ఆ తాత వాకిట్లో వున్న పొన్నచెట్టు క్రింద కూర్చొనేవాడు.

"ఏమే? నీ పేరేంటే?"

"సూరి"

"సూరీ! ఎన్నాళ్ళయిందే కాపరానికెళ్లి?"

"నాలుగు నెలలు"

"ఈడ్ని వదలడం నీ కిష్టమేనా?"

"ఊఁ"

"నీకు విడాకులు కావాలి. తీసుకో. వాడికి యింకో పెళ్లాం సులువుగా వస్తాది. నీకు మొగుడు సులువుగా వస్తాడా?"

జవాబు లేదు.

"మరి నాకు జవాబు చెప్పు"

"రాకపోయినా పరవాలేదు. ఈడితో పడలేక పోతన్నాను"

"ఒక మాటంటాను కోపగించుకోవా?"

"సెప్పు బాబూ!"

"వాడి అమ్మలాంటి ఆడదానివి నివ్వు. అది తొమ్మిదిమాసాలు యీ బరువు మోసింది కదా – నివ్వు పది నెలలైనా మొయ్యకుండా యీడిని దించేస్తే యెలాగే? ఇంకో అరు నెలలు పోయేక రా. అప్పుడు యిదాకులు తెంపేస్తాను అన్నాడు. ఏడాది తరవాత వాళ్ళు పిల్లడ్ని యెత్తుకునే యిద్దరూ వచ్చారు.

ఇంకోసారి డబ్బు ముందు పుచ్చుకుని ఆడపిల్ల మెడలో తాళి కట్టలేదు ఒక మగాడు.

"నాయనా కట్నం పుచ్చుకున్నావు కదా! ఇప్పుడు పుస్తె కట్టనంటావు. నీ దగ్గర డబ్బు యెంత మిగిలింది చెప్పు?"

"ఏంలేదు-పుచ్చుకుంటే కదా!"

"ఆహా-ఆలాగా. పుచ్చుకోలేదా" అయితే యింతకీ డబ్బు యివ్వనంటావు. ఏదీ నోరువిప్పు - ఊఁ .విప్పరా? పళ్లు గట్టి గున్నాయా?" అంటూ వడాలున ఐదు వ్రేళ్ళూ అంటు కున్నట్లు చెంప పెట్టు పెట్టా -

"వెళ్ళవోయ్. వారం రోజుల్లో ఆ తలమ్ముకునైనా యిస్తాడు. లేకపోతే యీ వూర్లో వుండలేడు" అన్నాడు పెళ్ళికూతురు తండ్రితో

నాకు అతని విషయం తలచినపుడల్లా నేను చామంతి యిచికి చెంబు పట్టుకుని వెళ్ళడం గుర్తు. చెంబు నింపుగా అవుపాలిచ్చేది. పాలు వొలిగిపోకుండా మెల్లగా తెచ్చేవాడిని? అతని భార్య సుందరమ్మ, మొగుడికి ముదుకుల్లో శక్తి వుండొద్దా అని రాత్రి కాచిన పాలు ఒక గ్లాసుడూ, రెండు కుడుములూ పెట్టేది. అతను 'తాతా' అని నన్ను కేక వేసి ఒక కుడుం ముక్క యిచ్చేసేవాడు. ఎవరైనా పిల్లాడు యేడిస్తే పాలలో సగం పట్టమని యిచ్చేవాడు. అతనికి అడనేస్తాలుండే వారు. గుడారి నుంచి ఒక అడనేస్తం వస్తుండేది. ఆవిడ వస్తే యేడాదికి సరిపోయే చింతపండు, కుండదు అరిసెలు, బందెడు బుట్టలూ, చేటలూ, చీపుర్లూ, కందులూ - ఒకటేమిటి అడివిలో దొరికే అన్ని సామాన్లూ పట్టుకొచ్చేది.

లక్ష్మీనారాయణ తాతకి మీసాలు హుందాయిచ్చేవి. ఆ పిలక గౌరవింప బడేది. అది సాధారణంగా ముడివేసే వుండేది. ముడి వెయ్యకపోతే యితడెవరి మీదో పంతం పట్టాడని ఆ పంతం నెగ్గే వరకూ ముడి వెయ్యని అపరచాణక్యుడని తోచేది.

పట్నం కచేరికి వెళ్ళే తప్పించి కమీజు వేసుకునేవాడు కాడు. ఒకరోజు కట్టుకున్న పాటినూలుపంచె యింకోరోజు కట్టేవాడు కాదు. ఈ పంచెలు యెప్పుడూ కొనేవాడుకాదు. ఊర్లో రాట్నాలమీద మృదువైన వ్రేళ్ల సుఖాల చిద్విలాసాలతో యీ నూలు వడికి మగ్గానికి చేర్చేవి ఒకప్రక్క యెరుపు రెండోప్రక్క నీలి అంచులతో స్వచ్ఛమైన యీ తెల్లని పంచె కట్టే అతని యెత్తుకు, హుందానిచ్చేది. చేతికి కెంపు పొందిగిన వుంగరం తప్పించి ఒంటి మీద బంగారం వుండేది కాదు.

గాదెలో ధాన్యం అయిపోయేక సాయంత్రం దీపాలు ముట్టించే సరికి యెలాగో ఒకలా బుట్టతో బియ్యం పట్టుకుని వెంట యెవడో ఒకడు వస్తుండేవాడు. ఇప్పుడు కూర్చున్నట్లు కూర్చునే చూసేవాడిని. బుడ్డీదీపం దగ్గర గదిలో ఆ బియ్యం! కొలుస్తూ అప్పటికి వుమ్మడి కుటుంబమైనా వంట వేరుగా చేసుకుంటున్న అన్నతమ్ముళ్ళ కుటుంబా లకు పంచి పెట్టేవాడు. ఒకోసారి సంగీతం మాష్టారింటికి కూడా పంపించేవాడు.

అలాంటి తాతయ్యకు యింకా యేలవలసిన రోజులు ముందు వుండగా రెండుకళ్ళూపోయాయి. కళ్ళకు గనేరియా జబ్బు తినేసింది అనేవారు. ఎన్నో ప్రయత్నాలు చేసినా దృష్టిరాలేదు. దృష్టిపోయినా ఆ వార్ధాటి పోలేదు. ప్రజ వస్తునే వున్నారు. అతని సలహాలను తీసుకుంటూనే వుండేవారు. గొప్పవిషయం యేమిటంటే ఒకనాడు యిలా యెందుకొచ్చిందని విచారించినట్లు మనిషి కనపడలేదు. యిలాంటి సింహం మరి పుట్టబోదని ఆయన గతించిన్నాడు వూర్లో అంతా అనుకున్నారు.

## 6

నారెమ్మ యింటి వెనక వుండటంవలన కామోసు యేటిలో ఆ లోతు గుమ్మిని నారెమ్మగుమ్మి అనేవారు. మా మూడోతాత అదెన్నను ఆ గుమ్మెలో ఒకచేత్తో చెట్టు వేరును, యింకో చేత్తో బిందెను పట్టుకొని వుండగా చూసాను. అబోదిబోమని ఆడాళ్ళు తల కొట్టుకొంటుంటే, ఏ మగాడూ వాడిని రక్షించడానికి గుమ్మిలో గెంతడే. మా ఐదుగురు తాతల్లో యేటి ఒడ్డున పుట్టి యీత నేర్చుకోనివాడు వీడొక్కడే. చేతిలో బిందెవదిలేసి ఆ చేత్తోనూ యీతగాళ్లు వచ్చే వరకూ వేరుపట్టుకో మంటే ఆ బిందె వదలడే. మిగతావాళ్ళంతా పొడవగా పొడవగా, ఆఖరికి బిందె వదిలేమని పెళ్ళాం అరిచేవరకు బిందె వదల్లేదు. ఆ బిందె అత్తవారిచ్చినది. నీరు కోసం బిందె పట్టుకుని నారెమ్మ గుమ్మి పక్క నించి అంగడిరేవుకు యేం ఆలోచించుకుని వెళ్తూ తప్పటడుగు వేసాడో గుమ్మిలో జారాడు.

ఈతగాళ్లొచ్చి బయటకు తీసారు. ముద్దపప్పు ఛాయతో వుండేవాడు. ఇతనికి ముద్దపప్పు నెయ్యి వేసుకతినటం యిష్టంగానీ యెక్కడినించి వస్తుంది? అతని పెళ్ళాం అన్నపూర్ణమ్మ కలిగిన వాళ్ళ యింటిలో నవరుచులు తిని యీ వుమ్మడి కుటుంబంలో తినడానికి దొరక్క పిల్లిలా దొంగతిళ్ళు తినేది. అసలు వూదారంగు పిల్లిలా పిల్లికళ్ళతో వుండేది. ఆ అన్నపూర్ణమ్మకే చాలనిది మొగుడికేం పెట్టుంది? కావలసినది దొరక్కపోగానే మా అదెన్నతాతకు దేనికైనా కక్కుర్తి పడటం అలవాటు పడినట్లుంది.

ఈ కుటుంబం నించి విడిపోవడానికి యిష్టం లేకపోయినా అత్తవారి అధికారానికి లొంగిపోయాడు. బయటపడి బావుకున్నదేదీ లేదు గానీ నలుగురి కొడుకుల్ని మాత్రం కన్నాడు. పెళ్ళాం చాకచక్యంతో చదువు యీడు వచ్చేసరికి ఒక్కొక్కడ్నీ కన్నవారింటికి చేర్చింది - కడసారి వాడిని తప్పించి! వీడివంతు వచ్చేసరికి వాళ్ళు వాళ్ళ బాధలతో చతికిలబడ్డారు.

ఇతన్ని తల్చుకుంటే చాల జాలి వేస్తుంది. ఈ రోజుల్లో ఐతే ఒక సినిమా హీరో కావలసిన శరీరఫొందిక, అందంవుంది. యౌవనుడిగా యెందరి అతివల ఛంగు రంగు కలల్లోకనిపించేవాడో?

ఒక చుట్టా, - బీడీ అలవాటు లేదు. చిరు తిళ్ళు తినే అలవాటు అసలే లేదు. తాగేవాడంటే అదీలేదు. కష్టపడి గొడ్డులా పనిచెయ్యడానికి కావలసిన కాళ్ళు చేతులాడుతున్నయ్. నలుగురు కొడుకులను కన్నాడు. ముగ్గురు ప్రాయోగ్యులయ్యారు వారిలో ఒకడు పెళ్ళయ్యాక పోయాడు. ఇంకోడు పెళ్ళికాకుండానే పోయాడు. మూడువాడు దూరానవుండీ ఒక్కనాడు తండ్రి వున్నాడని కట్టుకోడానికి ఒకగుడ్డగానీ, ఒకపైసాగానీ కన్నందుకు కృతజ్ఞతగా నైనా పంపలేదు. వాడి పెళ్లాం వాడి పిల్లల సోదే. కోరి వెళ్ళిన తల్లి అన్నపూర్ణ ఆ వూర్లో కలరాతో చచ్చిపోయింది.

అసలే కడుపు సోదతో పూర్లో చిన్నకొడుకు దగ్గర వున్నవాడు, మనసు సోదతో మగ్గిపోతున్నప్పుడు పట్నం నించి నేనెప్పుడు వెళ్ళినా దెయ్యి చాపేవాడు. కొడుకు తిట్టేవాడు. తిట్టడం నేను విన్నాను. కోడలు యెప్పుడూ విసవిస లాడేదట. నాతో చెప్పడానికే దాచి వుంచినట్లు నేను యెప్పుడు వెళ్ళినా ఆ తిట్లూ, ఆ రాటూ పోట్లూ చివరకు ఒకసారి ఆ కొడుకు తనమీదకు విసరినరాయి దాచి మరీ చూపించాడు. ఇంకోసారి గుండెమీద కొడుకు విసిరిన రాయితో తగిలిన గాయం కూడా చూపించాడు.

ఈ ఆదెన్నతాతకు యే చెడు అలవాట్లు లేవు. నిజానికి యే కోరికలూ లేవు. ఎప్పుడూ కడుపు నిండ వుండక్కర్లేదు, ఆకలిమంటలు భరించ లేనప్పుడే యింత గంజినీరు పోసి ఆ మంటలార్పితే చాలు అదే మహదానందం తృప్తిని. ఆ చిన్న కనీసపు అవసరం తీర్చుకోలేని మనిషి. అలా తీర్చగలిగే స్తోమత కలిగే కొడుకూ కోడలూ వున్నారు. కానీ అదేం జరగటంలేదు. బహుశః మానవ జన్మ అంటే విసిగి వేసారి పోయి వుంటాడని ఒకసారి మావూరు వెళ్ళినప్పుడు ఆదెన్న తాతను అడిగాను -

"తాతా నీ జీవితంలో యేదైనా పొరపాటు చేశావా ?" అని

"ఒక్కటే పొరపాటు. నాకేం నలుగురున్నారని అన్నదమ్ముల నించి విడిపోయాను. వాళ్ళతో కలిసివుంటే యీ కడుపు సోద వుండేదికాదు." అన్నాడు.

"మళ్ళీ మనిషి జన్మయెత్తాలని కోరిక వుందా ?" అన్నాను.

"మనవడా ? మనిషిజన్మ దొరకనే దొరకదు. అదృష్టం కొద్దీ దొరికింది. కానీ యీ జన్మలో యే సుఖం పొందలేదురా. అందుకే సుఖపడ్డానికి మళ్ళీ మనిషి జన్మ యెత్తాలని వుంది - ఆ భగవంతుడు కరుణిస్తే."

"ఎవరి కడుపున పుడ్తా వన్నాను.

"ఇంకెవరి కడుపున ? ఈ కొడుక్కి నలుగురూ కూతుర్లే కదా ! వీడివంశం నిలవొద్దా ?"

ఇదంతా మనిషిలోని మమకారాలను కున్నాను.

నిజానికి ఆదెన్న తాత చనిపోయాకే మా తాత చిన్నకొడుక్కి కొడుకు పుట్టాడు. మా మామ నల్లటివాడు - వాడిపెళ్లాం చామనచాయ. కానీ యీ పుట్టినవాడిది ఆదెన్నతాత రంగే' ఆ ముక్కూ, ఆ విశాలమైన నుదురు చూసి యీ పిల్లవాడిని 'తాతా' అనే పిల్చేవాడిని.

కుర్రాడికి ఆనందరావు అని పేరు పెట్టుకుని అపురూపంగా పెంచుతున్నారు. ప్రక్క వూరులో హైస్కూల్లో తొమ్మిదోక్లాసు చదువుతున్న ఆనందరావు స్కూలు వదిలాక హైవేమీదనించి వస్తుంటే ఒక లేలాండ్ లారీ వాడిమీద నించి తిరుగెత్తి ముక్కచెక్కలుచేసి నమిలేసింది.

## 7

మా తాతలందరిలో నాకు నచ్చినవాడు కాశీపతితాత. తలమీద యెప్పుడూ యేదో ఒక గుడ్డ తలపాగా కిరీటంలా వుండేది. ఆ గుడ్డతీసేమంటే, అది తీసేస్తే కథలు చెప్పలేననేవాడు. ఎన్నెన్ని కథలూ చెప్పేవాడు. ఈ తాతయ్యే ఆ రోజుల్లో కథలు చెప్పకపోతే నాకు కథలు రాయాలన్న ఆలోచనే పుట్టేది కాదేమో ?

ఈ తాతయ్యే మంచి యీతగాడు. జీలుగు తెప్పమీద పెద్ద పెటేరు వచ్చినప్పుడు చూసేవాడిని. గిరగిర తెప్పతిప్పినా కలపతోసు ఒడ్డుకు చేర్చేవాడు. అసలు నాకు యీతనేర్పింది యీ తాతయ్యే. ఈత నేర్పిస్తే లోతు సముద్రాలు యీదేగలవన్నాడు ఆ రోజుల్లో.

కాశీపతి తాత రాగితోచేసిన రాముడివారి విగ్రహమే. అంత విశాలమైన వక్షం అతనిది. ఇక మా మామ్మవుందే - అసలు పేరు వేంకటరత్నం. తాత వెంకటి అని పిల్చేవాడు. పల్చగా తెల్లగా వుండేది. మొదట జబ్బు మనిషి అనుకునేవాడ్ని. కానీ ఆవిడ యెప్పుడూ చిర్రున చీదలేదట. ఒకనాడు తలనొప్పి, జ్వరము అని మూలగలేదు. అసలు వాళ్ళ ముగ్గురు అప్పచెల్లెండ్రూ యిద్దరన్నదమ్ములూ అందరూ యిలాగే వుంటారట. వాళ్లనాన్న ఆకారం అందరిదీను. వాళ్లను చూసాక యిదంతా నిజమే అనుకున్నాను.

ఈ తాతకు పిల్లలులేరు. కానీ పిల్లల్లో పిల్లాడు. డబ్బులేదు. ఆస్తి అంతకన్నా లేదు. కానీ జీవితంలో అంత సంతోషంగా, అంత ఆరోగ్యంగా యెలా వుండే వాడని అనిపిస్తుంది. ఒకప్పుడు ఒక కథ చెప్పాడు. బహుశః ఆ కథ తనగురించేనేమో ? అందులో కథానాయకుడు "ఆకలా ? నన్నేంచేస్తాదన్నాడు. ఏతాయూ - ఏ ముంపా దొరక్కపోతే మేకలానమిలేదానికి ఆకులు దొరకవా ? అసలు రంగే మిటి ?"

"పచ్చదనం"

"డబ్బూ, ఆస్థి, అన్నం - యివేవీ పచ్చగా వుండవు - ఆకులే పచ్చవి. ఈ ఆకులు తిన్న మేక బతకలేదూ ?"

"బతికింది"

"ఆకులు తిన్న మనిషీ బతుకుతాడు. అసలు రాములవారు వనవాసంలో ఆకులు అలములు తినే బతికాడు." అని చెప్పిన కాశీపతి తాత మాలక్ష్మి నారాయణ తాతయ్యకు అక్బరు దగ్గర బీర్బల్‌లా వుండేవాడు. ఆ రోజుల్లో గుడారికి బస్సులుండేవి కావు. నడిచేవెళ్లాలి. ముందు కాశీపతి తాతే వెళ్ళేవాడు. అక్కడ అంతా వ్యాపారం కుదిర్చేక లక్ష్మీనారాయణ తాత వెళ్ళేవాడు. కాశీపతి లేనప్పుడు మా లాంటి పిల్లలకు యేమీ తోచేది కాదు. వెదురు తెప్పలొస్తున్నాయంటే యేటి ఒడ్డుకు పరిగెత్తేవాళ్ళం. ముందు తెప్పమీద నావనడుపుతున్న నావికునిలా నిల్చొనేవాడు.

మాకు తినడానికి యేవేవో తెస్తాడని కాదు. వినడానికి యెన్నో సంగతులు మోసుకొస్తాడని యీ తహ తహ. ప్రతిసారి వచ్చినప్పుడు యెన్నెన్నో కథలు మోసుకొచ్చేవాడు. అవి కథలు కావు. నిజంగా జరిగినవే. తెప్పదిగిన్నాడు సాయంత్రం మా పిల్లలందరికీ ఆ జరిగిన విశేషాలు చెప్పుకొచ్చేవాడు.

ఇదివరకు నడుస్తూ గుడారి వెళ్ళినప్పుడట ఒక సవరవాడు కలిసాడట. వాడి చేతిలో బాణం వుందట. ఆ బాణం తనవేపే యెక్కుబెట్టాడట. మా తాతయ్య అక్కడే కూర్చుండిపోయి తూరుపుకు తిరిగి కళ్ళుమూసి జపం చెయ్యటం మొదలెట్టాడట. ఆ అడివిలో చంపేసి నక్కలకూ కుక్కలకూ రాబందులకూ పారేస్తే యెవరు చూస్తారు? వాడి పాదాల చప్పుడు వినిపిస్తుంటే ఓం హ్రీం అని పెద్దగా అరుస్తూ జపం చేసుకుంటున్నాడు. కాస్సేపయ్యాక వెళిపోయివుంటాడేమో అని కళ్ళు మెల్లగా తెరచి చూస్తే యెదరగా చేతులు కట్టి కూర్చున్నాడట.

భక్తుడా ఏమికోరిక" అని తడబడుతూ అడిగాడట తాతయ్య.

"మూడు పంటలైంది కొడుక్కి పెళ్ళిచేసి సామీ! ఒక్క కూన పుట్టలేదు! రచ్చించు సామీ-రచ్చించు" అన్నాడు.

"ఫలిస్తుంది" అని అక్కడే వున్న మన్ను తీసి మంత్రించి యిచ్చాడట. ఆ మన్ను తీసుకుని "ఆగుదొరా" అనివెళ్ళిపోయాడట. ఇంకేం చెయ్యడు కదా అని భయ పడ్తుంటే పరుగెత్తుకుని ఒకతంబురా లాంటి గిన్నెలో తేనె తెచ్చి తాగుదొరా అని నోటిలో పోసాడట. ఈ యేడాది వాడిని తప్పించుకోడానికి యింకో త్రోవంట వెళ్తే పట్టేసాడట. కాశీపతి తాత తను యింక బతకనని అనుకున్నాడట. వచ్చి "సామీ" అని పాదాలమీద పడిపోయాడట. మనవడ్ని తన పాదాల మీద పడేసి "దీవించు సామీ" అన్నాడట. బహుశః దేముడ్ని యింత అమాయికంగా నమ్మిన వాళ్ళకి ఫలితం కనిపిస్తుందేమోనని నాకిప్పుడు అనిపిస్తుంది.

ఎవరి అనుభవం వాళ్ళది. ఎవరి స్పృహ వాళ్ళది. అతను కథలు చెప్పగా విన్న నా అనుభూతి నాది.

"తాతయ్యా - నివ్వు ఒళ్ళంతా యెందుకు కప్పుకోవని" ఒకసారి అడిగితే - "ఇది వేడిదేశం. ఒంటికి గాలి తగిలితే కోపాలు తాపాలు రావు."

"గాలి తగలడానికి గుళ్ళి చెట్టు క్రిందకు యెల్లకూడదా?" అని వెంకటి అవ్వ వేళాకోళంచేస్తే.

"పెదాలతో మూతిని కప్పితే యేం అవుతుంది?"
"పళ్లు కనిపించవు"
"నవ్వలేనివాడివి నివ్వేం సుఖపడతావు?"
"ఏడవకపోతే యెలాగండి?" అంది అవ్వ.

"నక్కవా? వెర్రికుక్కవా? కాకిలా అరవక. చిలకలా పలుకు. చీమలా వెతుక్కోగానీ చిట్టెలుకలాగ కన్నం వెయ్యొద్దు."

ఇలాంటి వెన్నో అతను బోధించిన తత్వాలులా నాకు జ్ఞాపకం వుండిపోయాయి. అతను రాసిన వరవడిలో దిద్దాలన్న ప్రయత్నమే నాజీవితం.

నా జీవితంలో యెన్నో నవ్వుముఖాలు చూసాను. గానీ ఆ చిరునగవు యింకో ముఖంలో చూడలేదు. దాపరికం యేవిషయంలోనూ యెరగని మనిషి. నేను ఆ వూర్లో వుండగానే. నా తొమ్మిదోయేట సాయంత్రం వరకూ మాకు 'కథలు చెప్తూనే వున్నాడు. దీపం ముట్టించాక తిన్నాడు. గడపలో 'కృష్ణాఅని చాప మీద దొర్లాడు. కుడిచెవి వెనుక ప్రక్క యేం కుట్టిందో యేమిటో నేను వెళ్ళి చూసేటప్పటికి బొడిపెలా చెవి వాచిపోయి వుంది. సొంఠి కొమ్ము అరగదీసి గంధం రాస్తున్నారు. మంటను ఓర్చి నవ్వడానికి తాత ప్రయత్నిస్తున్నాడు. తెల్లవారేసరికి పోయాడు.

మేం పిల్లలంతా తాత శవం మీద పడి యేడుస్తున్నాం. ఆ దగ్గర్లో కూర్చుని మా వెంకటి అత్తయ్య కన్నా హెచ్చుగా యేడుస్తున్న నారెమ్మ చేతిలో ఒక యెర్రగాజు విరిచేసుకుంది. ఆ గాజు పెంకులు గుచ్చుకుని ఆమె చేతినించి రక్తం కారటం చూసాను.

( ఇంకా వుంది )

# పాపఫలం

నల్లని డబ్బు గడించే నయవంచకుడు
గడుపుతున్నాడు తెల్లని రాత్రులు.
తెల్లని ఎండలో శ్రమించే కృషికుడు
గడుపుతున్నాడు నల్లని రాత్రులు.
రెక్కలు ముక్కలు చేసుకునే శ్రమజీవుల
డొక్కలు వాడిన త్తలైన చూతఫలాలు.
రెక్కలు ముక్కలు చేసుకోని సోమరుల
డొక్కలు గాలి నింపిన తోలు తిత్తులు.
ఎక్కువ చదువులు చదివిన కొందరు
తక్కువ జీతాలకే తల వంచుతున్నారు.
తక్కువ చదువులు చదివిన అయ్యలు
ఎక్కువ జీతాలకు అధిపతు లవుతున్నారు.
అవినీతికి దిగ జారని ప్రముఖుల
జీవితాలు వట్టి గొర్రెతోకలు
అవినీతికి దిగజారిన అల్పుల
జీవితాలు అయిదు రంగుల చిలకలు.
ఏమిటి యీ వింతలు విడ్డూరాలు ?
ఏమిటి యీ రకరకాల అసమానతలు?
సమతా మమతా లోపించిన
సమాజపు పాపఫలమా?

# చిరునవ్వు

హృదయ పద్మం వికసించగా
ఆహ్లాద లత చిగురించగా
ధవళకాంతి వెలుగు చూసింది
అదే చిరునవ్వు
అధరాన ప్రభవించిన పువ్వు!
మాటలు అర్థం కానివేళ
చిరునవ్వు జీవద్భాష:
ప్రాంతాలు వేరైన సమయాన
చిరునవ్వు మహావారధి:
చిరునవ్వు నవ్వనివాడు
చిరుత మనసు కలవాడు
వివాహ పూర్వం
హేమంతంలో నీరెండ
ప్రేయసి చిరునవ్వు.
వివాహానంతరం
నడివేసవిలో చలిచంద్రం
ఇల్లాలి చిరునవ్వు
ఆప్యాయతా సౌధానికి
చిరునవ్వు నిశ్రేణి
అది సర్వజనాహ్లాదిని!

డా. చల్లా రాధాకృష్ణశర్మ

# స్వాగతము

## శ్రీ బందరు దుర్గాప్రసాద్

తే॥ అమల, రమణీయ సుమరాజ కమల – విమల
కాంతి శోభిత జలతరంగముల మధ్య,
మలయ మారుత వీచికా చలిత యగుచు
విరిసె నొక వారిజము – సంజ వెలుగునొక!

తే॥ విగళి తామృత ధారా నివేదనమున
రమ్య భావ ప్రపూర్ణాంతరంగ యగుచు
చంచ దుత్ఫుల్ల శ్రీ పంక జాత కాంత
స్వాగతము పల్కె ప్రేమతో భాస్కరునకు!

తే॥ అరుణ రాగ రంజిత దిగ్దిగంతములు – ప్ర
సుప్త జగమును మేల్కొల్పి శోభిలినవి.
స్వచ్ఛ ధవళ ప్రభా సుప్రభాత లక్ష్మి
బాల భాస్కరునకు విడె స్వాగతమ్ము!

తే॥ సిగ్గు బరువున నొక్కింత శిరము వంచి.
లలిత మౌ చివురాకు దోసిళుల – ముత్య
ములుగ భ్రమ పెట్టు హిమ బిందువులను బట్టి
స్వాగతాంజలు లొసగెను పాదములు.

డా॥ ఇంగువ కార్తికేయశర్మ

# నెల్లూరుమండలమున-జైనాలయములు

నెల్లూరికి విక్రమసింహపురి యను నామమున్నది. బాస్వెల్ యీ సింహపురమును దండకారణ్యములో నున్నటుల యిచ్చటి మూల స్థానేశ్వరాలయమును ముక్కంటి (త్రినేత), పల్లవమహారాజునెలకొలిపి నట్లు చెప్పియున్నాడు. కాని నెల్లూరు మండలములోని జైనమూర్తులు ఆ ప్రాచీన స్థలములు సింహపురి చరిత్రకు చాల ముఖ్యమయినవిగా తోచినందున యిచ్చట వీటిని గూర్చి విశదీకరించుచున్నాను.[2]

## 1. పార్శ్వనాథుడు :

నెల్లూరు వర్ధమానసమాజపు ప్రాంగణములో నున్న జైనయర్థ శిల్పమును యిచ్చట గ్రంథాలయమునకు వచ్చువారెల్లరు చూచుచుందురు. ఈ శిల్పఫలకము 1. 14 మీ. నిడివి, 63 సెం. మీ వెడల్పు కల్గి యున్నది. నల్లటి కొండరాయి కృతము. మధ్యగా చెక్కబడియున్న ముఖ్య శిల్పము దిగంబర జైన పార్శ్వనాథుని చూపుచున్నది, కాయోత్సర్గ యోగములో నున్న యీ జైనుడు 23- వతీర్థంకరుడు. యేడుతలల సర్పము శిరముపై ప్రభావతి కాపాడుచున్నది. తేజోమండలము పైన. ఛత్రత్రయము, అర్థ చంద్రాకారపు తిరువాసి తోరణము, యిరువైపుల కుడ్య శాఖల పైని పరిచారికలు. దేవతలు యీ ఫలకము పైని శిల్పింప బడిన జైన తీర్థంకరుని గాథను తెలుపుచున్నవి. పార్శ్వనాథుని పై సంవర యను దేవత కోపోద్రిక్తుడై ధ్యాన భంగము కావించుటకై తలపడెను. విపరీతముగ వర్షముకురిపింపగా నీరు వెల్లువలై ధ్యాన యోగములో నున్న పార్శ్వనాథుని ముంచి వేయ నాగలోక రాజగు ధరణేంద్రుడు, రాణి పద్మావతి స్వామిని కాపాడిరి. ధరణేంద్రుడు తన శరీరముపై స్వామినెక్కించుకొని, పడగలను ప్రభగా పట్టెను. పాద ద్వయము క్రింద పద్మముల నుంచి, పద్మావతి తన భక్తిని చాటించుకొనెను. ఈ శిల్పమునందీ నాగ దంపతులు యిరువైపుల ద్వారపాలకులవలె ముకుళితహస్తములతో క్రిందుగా చూపబడియున్నారు. శంఖలత పద్మలతలు కుడియెడమల పొడుగుపాటి కాండములతో పైకి తేలివచ్చి స్వామి శిరము నాచ్ఛాదించుచున్నవి. మధ్య ఖండికలలో నిరువురు చామరు ధారులున్నారు. పై ఖండికలో యేనుగు పై నిరువురు కిరీటధరులు స్వామిని సమీపించుచున్నారు. తోరణ పైభాగమున నొకగంధర్వుడు మృదంగము వాయించుచున్నాడు.

ఈ విధముగ నీ యర్థ శిల్పమున కేవలియైన జినపార్శ్వనాథుని సుశిల్పించిరి. ఈ శిల్పము పాత మద్రాసు బస్సు స్టాండు వెనుకగా నున్న కాతెడ్రల్ చర్చి ముందు భాగమున మత్స్య శాఖవారు పయోగించుచున్న కోనేరు వద్ద యేనుగులమిట్టయను చోటినుండి వర్థమాన సమాజమునకు తరలింప బడినట్లు చెప్పబడుచున్నది. ఈ తటాకము బొంతరాతి కట్టడము ఇప్పటికిని చక్కగానే యున్నది. ఈ



నెల్లూరు వర్థమాన సమాజము : జిన పార్శ్వనాథుడు
(క్రీ. శ. 9-10 శతాబ్ధి)

తటాకముపై యీ ఫలకమున్న జైనాలయము వుండి వుండవలె. ప్రస్తుతము తటాకము తక్క మరేమియు కానరాలేదు.

2. నెల్లూరిలోనే దర్గమిట్ట. యందున కూడ జైన వసతి యుండినటుల కొన్ని యాధారములున్నవి. జిల్లాజడ్జి పాత బంగళా ప్రాకారపు గోడ పశ్చిమ భాగమందు మరియొక పార్శ్వనాథుని శిల్పఖండిక కట్టడములో నున్నది. శిథిలమై యున్నను, వర్ధమానపూజపు శిల్పముతో వలె అన్ని వివరములున్నవి. కాని పరిభ్రమణ దేవతలలో గజారూఢులు లేరు.

## 3. జైన వర్ధమానుని విగ్రహము :

(చిత్రములు 2, 3)

దండు వారి వీధిలోని నరసింహస్వామి ఆలయములో నొక జైనమూర్తిశిల్పము నెల్లూరి చరిత్రకు చాల ముఖ్యమైనది. ద్వార గోపురము చెంత పశ్చిమ ముఖిగా కటకటాల తలుపుల మధ్య భద్రముగా నున్న యీ జైన వర్ధమానుని కొందరు విష్ణుమూర్తిగా భావించి కొలతురు. అపురూపమైన యీశిల్పము నల్లరాయి కృతము. శోభాయమానమైన నునుపు గల్గియున్నది. ధ్యాన ముద్రలోనున్న యీ అజానుబాహుడు కూర్చొని యున్నను 1.16 మీ యెత్తు గల్గియున్నాడు. విశాలమైనఫాలము, చక్కని పొడుగైన నాసిక, ఆ కర్ణాంతములు, నిండైన కంఠము, శిరస్సున సుడులుతిరిగిన జటములు యీ తేజోమయుడైన పురుషుని జినమన్మధునిగా పేర్కొన వలసి యున్నది. నిశ్చలమైన ధ్యానస్వరూపిగా నున్న యీ వర్ధమానుని వాహనము సింహము. పీఠ భాగము నేలలో కూరుకొని యున్నందున కానరాకున్నది.



నెల్లూరు. నరసింహస్వామి దేవాలయము : వర్ధమానుడు
(క్రీ. శ. 9-10 శతాబ్ధి)

ఇప్పటి మన జిల్లా కలెక్టరు కార్యాలయమున్న స్థలమున యీ శిల్పము, మరియు పురాతన కోనేరు (బొంతరాతి కృతము)వుండినట్లు. వీనిని 1900 సంవత్సరమున కలెక్టరు భవననిర్మాణము చేయునప్పుడు పూడ్చివేసినటుల పెద్దలు చెప్పుచున్నారు. ఈ కార్యక్రమములుచుట్టూ త్రవ్వకము లందు యీ శిల్పము లభ్యమయినదనియు, అచ్చోటనే బొంత రాతి ఆలయము కూడా నుండి నటుల తెలియ చున్నది. అనగా ఆలయము - కోనేరు, రెండునూ బొంత రాతి కట్టడములన్నమాట. జైనమూర్తిని అచ్చటి నుంచి తరలించి నరసింహ స్వామి ఆలయమునభద్రము చేసిరి. మరికొన్ని శిల్పములు దర్గాలోను, మరికొన్ని ప్రదేశముల కట్టడలములలో ప్రయోగించినటుల దెలియ వచ్చినది.

ఈ వర్ధమానుడు స్వయం ప్రధాన మూర్తిగా జైనాలయమున సుప్రతిష్ఠింప బడియుండెననుటకు సందియము లేదు. పుర ప్రముఖులిప్పటికిని యీ స్వామిని కోనేటి రాయుడుగా భక్తి ప్రేమలతో పిలుచు చున్నారు. అనగా నీ స్వామి కోనేటి దేవాలయమునకు, ఆ దేవాలయమున్న వూరికి రాజన్నమాట.

పైన వివరింపబడిన మూడు శిల్పములు వాటి పరిసరములందున్న ప్రాచీన కట్టడముల బట్టి నెల్లూరు నందు కనీసము మూడు జైనాలయములు, కోనేళ్ళు వుండివుండవలె. జైన, ఆగమ - సాంప్రదాయముల కనువుగా 'సమవసరణవను' కార్యక్రమము జరుగుచుండెడిది. ఈ సాంప్రదాయము దిగంబరజైనలు 8-9వ శతాబ్దినాటికి క్రమముచేసి, నిర్దుష్టముగా పాటించుచుండిరి. దక్షిణ దేశమున గురుపీఠమై, మూలసంఘమునకు స్థావరమైనది. కర్నాటకము లోని శ్రమణబెళగోల. ఈ నామముతోనే శ్రమణుల కొలను లేక స్వేత సరోవరమని పేర్కొనబడి యున్నది. ఈ పవిత్రస్థలము మహా ప్రజ్ఞావంతులైన జైనాచార్యుల కాటపట్టు. ఇచ్చట నండియే జైన ధర్మమును బోధించుచు, ఆచార్యులు పలుదిశల ప్రయాణించిరి.

పై శిల్పములు బట్టి క్రీస్తుశకము 7-8 దశాబ్దిని ఆచార్య సింహనంది దిగంబర జైనమును కడప - సిద్ధవటము ప్రాంతముల మీదుగా నెల్లూరు సీమకు చేర్చి, దిగంబర జైన స్థావరము నెలకొల్పి యున్నటుల తోచుచున్నది.

యిచ్చట నెల్లూరి మండలములో మరికొన్ని స్థావరముల గూర్చి పేర్కొనుట సమంజసము. నెల్లూరికి చేరువగా కనుపర్తిపాడు అను గ్రామమునందు నొక జైనాలయముగలదు. నెల్లూరికి తూర్పుగా 20 కి.మీ. దూరమున కృష్ణాపట్నమున మరియొక జైన శిల్పము గూర్చి రాబర్ట్ సీవెల్ మరియు గోపాలకృష్ణమూర్తి తెలిపియున్నారు.[4]

కనుపర్తిపాడులోని జినాలయము, కరికాళ చోళుని కృతముగా శాసనము వలన తెలియుచున్నది. ఈ పల్లి ఛందనమునకు రాజరాజ దేవుని, 87వ సంవత్సరమున ప్రమీలాదేవియనుమ్మరాణి యెట్లు గాలించి, భూదానమొసగినట్లు తెలియుచున్నది. ఇచ్చట లభించిన జైన పార్శ్వ నాధుని శిలాఫలకము నెల్లూరి వర్ధమాన సమాజపు శిల్పమును బోలి యున్నది.

కృష్ణాపట్టణమున శిధిలమైయున్న జైనాలయమున పునాదులతో సహా, మరొకజైన పార్శ్వనాధుని యర్థశిల్పము యిసుకలో యిప్పటికి - కానవచ్చుచున్నది. అనగానీ ఫలకము మూల బేరముగా సుప్రతిష్ఠింప బడెనన్నమాట. ఈ ప్రతిమ, నెల్లూరు కనుపర్తిపాడు శిల్పముల కోవకు చెందినదే. శాసన దేవతలుగా యక్షధరణేంద్ర, పద్మావతి మధ్య ఖండికలు కాయోత్సర్గలు నున్న జినస్వామికి మోకరిస్తూ 'కుడి యెడమల చూపబడి యున్నారు.

ఈ శిల్పములన్నియు దాదాపు 9 వ శతాబ్దికి చెందినవి. తరు వాత కాలమునకు చెందినవి కావు. కనుపర్తిపాడు శాసనము[5] ను బట్టి కూడా కరికాలుని కాలమునాటికే జైనాలయమున్నది. క్రీస్తబ్దము 1255 ప్రాంతమున తెలుగుచోళుల కాలమున ఈ పాతజైనాలయ మును పెద్దపెట్టున పునరుద్ధరించియుండిరి, కాని స్థాపించినట్లు చెప్ప లేదు. నెల్లూరిలోని తదితర శైవ - వైష్ణవ ఆలయములన్నియు క్రీ. శ. 11వ శతాబ్ది ప్రారంభమునుండి మాత్రమే పైకివచ్చెను. జైనాలయములన్నియు ఈ బ్రాహ్మణ మతములకు చెందిన వాస్తు - శిల్ప కృతములకన్న రెండు-మూడు శతాబ్దుల పూర్వము నాటివి.

అట్లగుచో నెల్లూరికి జైన మెప్పుడు వచ్చెను ? యే విధముగా చేరెను. మనముపైన కర్ణాటకమున జైన స్థావరమును గూర్చి ప్రస్తా వించి యుంటిమి. ఆ కూడలినుండి కడప బద్వేలు మీదుగా నెల్లూరు ప్రాంతమునకు పాకియుండవచ్చును. మార్గమధ్యములు మరికొన్ని జైన స్థావరములేమైన కలవా ! పరిశోధకులు శ్రద్ధతో కృషిచేయ వలశి యున్నది.

నెల్లూరు మండలములోని జైనమూర్తులు శైలినిబట్టి తూర్పు చాళుక్య శిల్పముల బోలియున్నవి. ముఖ్యముగా బాపట్ల మున్నగుచోట్ల లభించిన జైనమూర్తుల చూడుడు. చాళుక్యనృపతి కుబ్జవిష్ణువర్ధనుడు (క్రీ. శ 624 - 41), వేంగిని రాజధానిగా పరిపాలించుకాలమున మహారాణి అయ్యనమహాదేవి బెజవాడలోని "నిడుంబవసది" కి మునిపికొండ గ్రామమును దానము చేసినట్లు విదితమగుచున్నది, తీరాంధ్రమున - యిది మొదటిజైన శాసనముగా చెప్పుకోనగును. ఈ జైనాలయమున కొసగిన దానములను మూడవవిష్ణువర్ధనుడు (క్రీ. శ. 718-755), పునరుద్ధరించినట్లు కూడ శాసనముల వలన తెలియు చున్నది. తూర్పుచాళుక్య ప్రభువగు గుణగవిజయాదిత్యుని[6] (క్రీ. శ. 849-893) కాలమున నెల్లూరు ప్రాంతము ప్రసిద్ధిబడసినది. ఆతని సామంతుడు పాండురంగడు కందుకూరని బెజవాడవలె పట్టణ[7]ముగా చేసి నెల్లూరి సీమను పాలించెను. ఈతని అనంతరము రెండవ అమ్మ (క్రీ. శ. 945-970), జైనమును మెండుగా వ్యాప్తి జేసెను.



నెల్లూరు : నరసింహస్వామి దేవాలయము, వర్ధమానుడు
(క్రీ. శ. 9-10 శతాబ్ది)

నెల్లూరిలోని జైనాలయములు బహుశ ఈ తూర్పుచాళుక్యుల కాలమున అనగా క్రీ. శ. 9 వ శతాబ్ది మధ్యభాగమున గావింపబడి యుండనగును. అనగా నెల్లూరు చోళుల కన్న రెండు మూడుశతాబ్దుల పూర్వ కృతములన్నమాట.

ఇక నెల్లూరికి అమ్మవారు - స్థానదేవతగా కొలువబడుచున్న 'ఇరుకళాపరమేశ్వరి" ని గూర్చి కొంత తెలుసుకొందము. ఈమెనే యెరుకలమ్మ, యెరుకాళమ్మగా, గ్రామదేవత మహాశక్తిగా నిత్యము కొలువులందు కొనుచున్నది. ఈ దేవాలయము మూలపేటలోని నెల్లూరి చెఱువుగా ప్రసిద్ధబడసిన స్వర్ణాల చెరువునకు యీశాన్యమున బాంతరాతి దేవాలయమున ప్రతిష్ఠింపబడినది. ఈ బాంతరాతి ఆలయ మును, అమ్మవారిని కొలుస్తూ మూడవ కుళోత్తుంగ చోళనృపతి కాల మున (క్రీ. శ. 1178-1228), కైంకర్యములివ్వబడెను. ఛిద్రమైనను,

అమ్మవారు చాముండిదేవి వలె గుడ్లగూబ లాంఛనము గల్గియున్నది. ఈమె లక్ష్మీ స్వరూపి గాన ఉలూకవాహనముండుట సముచితమే.

ఇదేకాలమునకు చెందిన కొన్ని దక్షణదేశములోని జైనశాసనములు పరిశీలింపగా నిట్టిదేవీప్రతిష్ఠలు తీర్థంకరుల శాసనదేవతలుగా 'జైనస్థావరములందు కొలువుతీరినవి. కాలగతిని గ్రామదేవతలై యారాధింపబడెను. దక్షిణ ఆర్కాటుజిల్లా తిండివనము తాలూకాలోని పెరుమాన్‌డూరు గ్రామమున వృషభనాథ, చంద్రనాథ యను రెండు జైనాలయములు లున్నవి. ఈ వృషభనాథాలయమును పల్లవరాజగు నందివర్మ. 19 వ రాజ్యసంవత్సరమున (క్రీ. శ. 748-49), చంద్రనాథలయమును మూడవ కులోత్తుంగ చక్రవర్తి, 14 వ రాజ్యసంవత్సరమున (క్రీ. శ. 1190-91), కావించినటుల తెలియుచున్నది. ఇచ్చటి జైన యక్షిణి దేవతల పేర్లు - ఇరివికులసుందరి - ప్పెరుంబల్లి" గాను, మంగయ్యా నాయకి, యనియు దానమొసగిన, లేక ఆలయ నిర్మాణము గావించిన వ్యక్తినామమును బట్టి పిలుచుట యాచారమైనట్లు తెలియుచున్నది. కాన నెల్లూరి కధిదేవత యైన ఇరుకళాపరమేశ్వరి, లేక యిరుకలమ్మ జైన శాసన దేవతగాను స్వర్ణాల చెరువును పెద్దధవళ సరస్సుగాను గ్రహింపవలసియున్నదీ.

ఇక సింహపురి యనునామమును గూర్చి యోచింతును. జైనవర్థమానుని ప్రతిష్ఠ వలన ఆయన వాహనము లేక లాంఛనము సింహము కానయీ జైనాలయమున్న గ్రామము సింహపురిగా వాడుకలోనికి వచ్చియుండ నగును. లేక ఆచార్య సింహనంది ఈ చోటికి వచ్చి జైనమును ప్రప్రథముగా స్థాపించి, ఆలయమును లేక వసతి చేకూర్చి యున్నందున - యీ ఆచార్యుని వల్ల సింహపురిగా వాడుకలోనికి వచ్చెను. చారిత్రకముగా పల్లిపాడు యను గ్రామములు జైన స్థావరమువల్ల సంక్రమించినవి. మూడవకులోత్తుంగుని (క్రీ.శ. 1178-1226)శాసనములలో పల్లినాటి లేక పళ్ళై విక్రమసింహపురిగా పేర్కొని, యుండుట గమనార్హము, అనగా జైనసింహపురి యన్నమాట.

జిన వర్థమానుని జైనాలయమున మూల బేరముగా పూజాదికృతముల నందు కొనెను. ఈ మూర్తి శిల్పము నిశ్శంసయముగా క్రీ. శ. 9 వ శతాబ్ది మధ్యకాలమునకు చెందినదిగా, శైలినిబట్టి చెప్పవచ్చును. ఈ వర్థమానుడే యీ నెల్లూరికి - కోనేటి రాయుండై నాడు. సింహపురికి నాధుడు.

ఇదివరలో మా మిత్రులు శ్రీ డా. కావుటూరి రామచంద్రరావుగారు బృహత్ పల్లవులలో మొదటిరాజైన సింహ విష్ణువు (క్రీ. శ. 575-600), తన పేరున విక్రమసింహపురిని స్థాపించి యుండనగునని యభిప్రాయపడిరి. ఈ పల్లవ శాసనములు గుంటూరు -నెల్లూరు మండముల పెక్కు లభించినవి. యెక్కడను నెల్లూరికి గాని, సింహపురి యను నామముగాని ప్రసక్తి రాలేదు. ఆ మహారాజు పేరుతో పట్టణమున్న తరువాతి పల్లవ నృపులు గూడ, నొక్కసారి కూడ తలుచు కొనకపోవుట చిత్రముగానున్నది. కాన నెల్లూరికి సింహపురియను నామము జైనస్థావరముగా ఖ్యాతికి వచ్చిన తరువాతనే సంక్రమించి యుండెనని నా నమ్మకము.

## అధోజ్ఞాపికలు


1. బాస్వెల్, డిస్ట్రిక్టుమాన్యుయల్, పుట. 687.
2. శ్రీయుతులు అతివక్త శ్రీనేలనూతల శ్రీకృష్ణమూర్తి, వేదాల వేంకట రామన్‌గార్లు నాతో కలిసి యీ ప్రదేశముల దర్శించిరి. వారి సహాయము ప్రేరణ మరువరానిది.
3. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, జైనవెస్టిజ సౌ ఇన్ ఆంధ్ర (హైదరాబాదు, 1963) పుట. 81
4. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (1963), పుటలు 80-81, చిత్రము 60, 60 ఎ
5. బట్టర్‌వర్త్ మరాము వేణుగోపాలచెట్టి, ఏ కలెక్షను ఆఫ్ ఇన్స్క్రిప్షన్సు ఆన్ కాపర్‌ప్లేట్స్ అండ్ స్టోన్సు ఇన్ ది నెల్లూర్ డిస్ట్రిక్ట్, సంపుటి 2, (మద్రాసు, 1905) పుటలు 789, నెల్లూరు, 27.
6. ఎన్. రమేశన్, ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి, (హైదరాబాదు, 1975). పుటలు 10-11, 18, 19 మరియు 47.
7. ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటి, 1019,పుట. 275 అడ్డంకి శాసనము.
8. యు పి. షా మరియు యమ్ ఏ. ఢాకీ, ఆస్పెక్ట్సు ఆఫ్ జైన ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చరు, (అహమ్మదాబాదు 1975) పుటలు. 91, 102.
9. "తిక్కన యుగంలో నెల్లూరి తీరుతెన్నులు" తిక్కన తిరునాళ్ళు. (విక్రమసింహపురి, 1980), పుట. 17

ఆవేగా జబ్బు పడ్డప్పుడు ఎక్కడో అంతరంలో దాగి ఉన్న చైతన్యం తెలియకుండానే వెలుపలికి వస్తుంది. అప్పుడు ఏదో తపన తహతహ, అర్థంకాని ఆర్తి మనస్సుని దహించివేస్తుంది. ఏదో చెప్పాలని, ఎంతో చేయాలని ఏవేవో రాయాలని ఒకటే ఆరడి. అయితే ఏమీ చెప్పలేని, చెయ్యలేని, చెయ్యి కదపలేని, నోరు మెదపలేని నిస్సహాయ పరిస్థితి కళ్లనిండా నిండుకున్న నీళ్లు పొరలి పడి చెక్కిళ్లమీదగా వెచ్చగా జారుతున్నప్పుడు, ఎంతో బాధ, వ్యధ కరిగిపోతున్నట్లు అనిపించినా అనుక్షణం రంపపుకోత తప్పదు. యమయాతనని అనుభవించక తప్పించుకోవటం సాధ్యపడదు. జబ్బునుంచి కోలుకోకపోతే హంస ఎగిరే వరకు ఆ ఆరని వ్రణం అణువణువునూ అహరహం వేధించుకు తింటుంది.

ఈ మాటల్ని వింటూ ఉంటే నా కెంప కోసం మరి తాతయ్య కళ్లముందు మెదిలాడు.

ఒక్క వెలుగు వెలిగి గుడ్డిదీపమై దిక్కులేని మోడులా యాత్రని ముగించిన ఆయన్ని తలచుకొంటే ఎంతో దుఃఖం కలుగుతుంది.

మనుష్యులు బతికి ఉన్నంతకాలం కోపాలు తాపాలు ఉంటాయి! తీరా చనిపోయాక వాటిస్థానంలోనే సానుభూతి, ప్రేమ చోటుచేసుకొంటాయి. - అని ఎందరో అంటారు కాని, అలాంటిది అనుభవంలోకి వస్తేనే తప్ప ఆ విషయం ఎంతగా గుండెని తొలుస్తుందో అర్థం కాదు !

తాతయ్య చెబుతుంటే ఏదో పిచ్చిగా చెబుతున్నాడని జీవితం పట్ల స్పష్టమైన అవగాహనలేని ఆ రోజుల్లో అనుకొనేవాడిని. ఇప్పుడు ఉందని కాదు.

అయన ఈ లోకాన్ని విడిచి వెళ్లాకే ఆ మాటల సారాంశం బోధపడింది.

అనుభవం ఎంతో గొప్పదే కాదనను, కాని తీరా ఆ అనుభవం వచ్చేసరికి జరగవలసిందంతా జరిగిపోయే ఉంటుంది.

ఏమిటీ పరిస్థితి ?

మానవజీవితం ఇంత అస్థిరమా ? అనిశ్చితమా ? మనస్సు ఘోషిస్తుంది- ఆత్మ తల్లడిల్లిపోతుంది- అయినా సమాధానం దొరకదు. తెలియదు, తెలిసిరాదు. అందుకే మవునం; మౌనం, ముక్తసరి జీవనం ! జ్యోతిష్యం చెప్పడంతో దిట్ట అనిపించుకొన్న తాతకి ఆయన బతుకు పక్షవాతం పాలవుతుందని తెలియకపోవడం విచిత్రం కాదా ?




కొన్ని వేల జాతకాలు గీసిన ఆయనకి తన జాతకంలో ఏముందో తెలియకపోవడం ఆశ్చర్యంగా లేమా !

"ఒరేయ్ ! బాబూ ! అరవై అయిదు, అరవై ఆరు - ఆ వయస్సులో నే వెళ్ళిపోతాన్రా ! మొత్తానికి ఏ జబ్బో చెప్పలేను కాని బాగా నలిగి ఒంటరిగా విసిగి వేసారి వెళ్ళిపోతాన్రా ! ఇది నిజం !"

ఆయనంటున్నప్పుడు ఆందోళన కలిగేది.

కాని రేపు ఏం జరుగుతుందో ఎవరికి తెలుస్తుంది. అలా తెలిస్తే ఈ మనిషి ఇలా ఎందుకుంటాడు ? - అని సర్దిచెప్పుకొనేవాణ్ణి

పోనీ అలాగే జరిగితే ....? జరిగితే మాత్రం చేసేదేముంది? ఏం వచ్చినా దానిని ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉండక తప్పదుకదా!

"రానున్నది రాకమానదు, కానున్నది కాకమానదు"- మా నాన్నగారు తరచూ అంటూ ఉంటారు. ఈయనకి లౌకికదృష్టి ఎక్కువ. జీవితాన్ని ఒక దృక్కోణంతో మాత్రమే చూస్తారు. అదీగాక నాకూ ఈయనకి రక్తసంబంధమున్నా అనుబంధం చాల తక్కువ! చిన్నప్పటి నుంచి తాతదగ్గరే పెరగటం చేత ఆయనంటేనే ఎంతో ఇష్టంగా ఉండేది!

"ఎప్పుడూ తాతదగ్గరే ఏం పనిరా?" అంటూ అమ్మ అడుగుతూ ఉండేది.

అమ్మకేం తెలుసు? ఢిల్లీలో రిపబ్లిక్ పెరేడ్, ఆగ్రాలో తాజ్‌మహల్, కాశ్మీర్‌లో ఆపిల్ తోటలు, కన్యాకుమారిలో ఎరుపు సముద్రం - చూసిందన్న గిర ఆమెలో కనిపిస్తూనే ఉంటుంది.

నాకయితే ఆమె చెప్పే వేమీ వద్దు.

తాత అగ్రహారంలో వేదాలు నేర్చుకొన్నప్పుడు ఎలా అల్లరి చేసేవాడో కావాలి.

తాతగారి మాతామహులు త్రివిక్రమాచార్యులు దెయ్యాలని ఎలా ఓడగొట్టేవారో నాకు కావాలి!

మామిడి తోపుల్లో తాత, ఆయన నేస్తాలు కోతికొమ్మచ్చి ఎలా ఆడేవారో నాకు కావాలి.

ఉత్తరాది మఠం స్వాములవారు వస్తే ఎక్కడ ముద్రాధారణ చేయించుకోవలసి వస్తుందోనని తాత పారిపోయినప్పటి కథ కావాలి.

ఇలాగే అన్నీనూ ....

రామాయణం, మహాభారతం, భాగవతం, గీతగోవిందం ఎన్నో చెప్పేవాడు!

అవి వింటూ ఉంటే ఎంతో సంతోషంవేసేది! ఆ సంతోషం వాన్న టార్జాన్‌ని గురించి చెప్పేటప్పుడు కాని, జూలియస్ సీజర్‌ని గురించి చెప్పేటప్పుడు కాని ఉండేదికాదు!

ఎందుకో అలా ఆ వయసులో తెలిసేదికాదు. మీ కులమేమిటి? మీ గోత్రమేమిటి? అని అందరినీ అడిగేవాణ్ని. కులగోత్రాలు తెలియని వాళ్లకి ఏమి తెలుస్తుందని తాత అనేవాడు.

నా కులం వాడు, నా గోత్రం వాడు - అని అనుకొన్నప్పుడు ఎందుకో ఆనందం కలుగుతుంది. ప్రతి గోత్రానికీ ఒక ప్రత్యేకత ఉంటుంది కదా!

ఎవరికి వాళ్లకి వాళ్ల కులమే, గోత్రమే గొప్పగా ఉండవచ్చు. అంతమాత్రాన ఇంకొకళ్ల కులాన్ని, గోత్రాన్ని కించపరచకూడదు కదా!

ఇదేమాట తాతతో అంటే "ఛా!" అనేవాడు. మన కులాన్ని మించిన కులం లేదనే వాడు. మాధ్వులకున్న సంస్కారం ఎవరికి ఉంది అని గట్టిగా మాట్లాడేవాడు. అలా ఆయన అనడం నాకు ఇష్టం ఉండేదికాదు. అయితే ఎదురు చెప్పేవాణ్ణి కాదు. చెబితే "లండేకే! ఎంతపొగరురా నీకు!" అంటూ ఎంగిలి కంచంపైన విసరివెళ్ళిపోయే వాడు భోజనం మధ్యలోనే మానేసి!

అంత ఆవేశం!

స్వమతాభిమానం!

నాకు చాలా ఇష్టమైన ఒక వ్యక్తి మాటలో సందర్భలో "మనకి అంటే ముఖ్యంగా హిందువులకి -

మతం అనేది జీవితంలో ఒకభాగం, అది మనలో జీర్ణించుకుని పోయింది. ఒకవ్యక్తి చెబితేనో లేకపోతే కొన్ని సంస్థలు చెబితేనో వినవలసినంత దుర్గతి మన మతానికిలేదు. మన సంస్కృతిలో ప్రధానమైంది మతమే!"— అని అన్నారు.

ఈ మాటలని తలచుకొన్నప్పుడుకూడా తాతే గుర్తుకొస్తాడు.

ఆయనకి మతమంటే అంతఇష్టం! ఆచారమంటే ప్రాణం!

"తాతా! మడీ, మైలా, నిష్ఠ- ఇవంతా నాకు ఇష్టంలేదు. అవధూతలకి పరమహంసలకి వీటితో నిమిత్తం లేదుకదా?"-అని అంటే

"వెధవా! అవధూతకి పరమహంసకి అర్థంతెలియదు" నీకు! ఏమిటి నువ్వుమాట్లాడేది. అప్రాచ్యుల చదువు చదివి చెడిపోతున్నావ్!" అని గట్టిగా మందలించే వాడేకాని నేను చెప్పేది వినిపించుకునేవాడు కాదు. కాని....

పక్షవాయువు వచ్చి ఎడమచెయ్యి, ఎడమకాలు, నోరు పడిపోయినప్పుడు....

పండిత రాజసంతో మహాదర్పంగా వెలిగే ఆయన ముఖారవిందం కురూపంపాలై విరూపం చెందినప్పుడు.... బిడ్డలు,చివరికి భార్యకూడ అసహ్యించుకొన్నప్పుడు....

స్నేహితులు, చుట్టాలు ముక్కుమూసుకొని దూరంగా జరిగినప్పుడు...

నీళ్ళునిండిన కళ్ళతో

తడినిండిన గుండెతో

ఆయనలో ఆయనే కుమిలిపోయేవాడు!

ఏదో చెప్పాలని ఏమీ చెప్పలేక మధనపడి పోయేవాడు

ఒంటరిగా దిగులుగా గడిపేవాడు.

విరాగిలా, విరక్తిగా నవ్వుకునేవాడు.

ఆయన భుజమెక్కి ఆయనతోపాటు పౌరోహిత్యాలకి వెళ్ళి దక్షిణలు పుచ్చుకున్న క్షణాలు నా కెప్పటికీ మరపుకు రావు.

పెద్దస్వామీ,చిన్నస్వామీ అని ఎందరో ఆప్యాయంగా పిలుస్తూ ఉంటే అదోరకమైన పెద్దరికాన్ని అనుభవించిన నాకాపిలుపు ఇంకా గుర్తుకుంది.

నాకు ఒంట్లో బాగాలేకపోతే సుందరకాండ పారాయణచేసిన తాత!

నేను దడుసుకొని మూడురోజులైనా లేవకపోతే నరసింహ స్తోత్రం చేసినతాత!

నాకు పాలిచ్చికాని, పాలు తాగని తాత!

ఆలస్యమైతే బడికి నేరుగావచ్చే తాత!

అంతటి తాతకి ఒంట్లోబాగాలేక మూలన పడిపోతే వెళ్ళవద్దని ఆంక్ష విధించింది అమ్మ.

అసలు అమ్మ ఆయన కూతురేనా అనిపించేది!

చదువుకోకుండా ఆ ముసలాడిదగ్గరికెళితే ఒళ్ళు చీరేస్తా ననే వాడు నాన్న!

అందరూ ముసలివాళ్ళు కాకుండానే పడచువాళ్ళుగానే ఉండి పోతారా!

ఏడుపు వచ్చేది!

"బాబూ! బాబూ! బాబూ!" అని తాత పిలుస్తూనే ఉండేవాడు.

"చివరికి నీకుకూడా నేను కాకుండా పోయ్యానా!"

అని తాత అంటుంటే పిచ్చ ఏడుపు వచ్చేది.

లఘుశంక తీర్చుకోవటానికైనా ఆయనకి తోడు ఉండవలసిందే,

ఆయన దగ్గరుంటేనే వాసనని పిన్నమ్మ, అవ్వ పట్టించుకునే వారు కాదు,

అమ్మని ఎదిరించి, నాన్నమాట కాదని తాత దగ్గిరకి వెళ్ళే వాణ్ణి!

ఆయన నన్ను అక్కునచేర్చుకొని చిన్నపిల్లాడిలా విలపిస్తుంటే దుఃఖంతో గొంతు కూరుకుపోయేది.

ఆయన లాలనలో నాకు ఏంత ఉపశాంతి కలిగిందో చెప్పటానికి పదాలు చాలవు!

నేను దగ్గరుంటే చాలు అన్నట్లు తాత సంజ్ఞలు చేసేవాడు.

ఒక రోజు....

ఓనమాలు నేర్చుకొంటున్న పిల్లవాని దస్తూరిలా ఉన్న కాయితం ముక్క యిచ్చాడు. అందులో రాసింది చదివాను.

"నీవు చెప్పింది నిజమే! మతాలు, కులాలు, గోత్రాలు అన్నీను మానవ కల్పితాలే! ఏవీ శాశ్వతంకావు. అందరూ పోయేవారే! మనుష్యులంతా ఒక్కటే! ఎవరిది మంచిమనసో, ఎవరకైతే సహనం ఉంటుందో ఎవరికైతే జీవితం అంటే ఏమిటో బాగా తెలుసో! ఎవరకైతే కోరికలని పెంచుకోవటం పాములని పెంచుకోవటం లాంటిదనే విషయం స్ఫురిస్తుందో- వారికి మాత్రమే చావు, పుటక, ఒకేలా కనిపిస్తాయి. నీవు చిన్నవాడివైనా నీకాలక్షణాలు కొన్ని ఉన్నట్లు నాకనిపిస్తోంది. అలాగే ఉండు.

ఇంత చెప్పాకకూడా నాకు కోరిక కలుగుతోంది. నామీద నీకు ఏమాత్రం గౌరవమున్నా, అభిమానమున్నా అలాంటిదే ఇంకేమి ఉన్నా నీమామ కూతురిని పెళ్ళిచేసుకో! చచ్చిపోయిన వాళ్ళు మళ్ళీపుడతారంటారు. అది నిజమైనా కాకపోయినా నేను చచ్చిపోయాక మళ్ళీ నీకడుపులో పుట్టాలని ఉంది. నా మనుమడు, నా మనుమరాలు- వీరికడుపులో పుట్టడంకన్నా, పుట్టి మళ్ళీ సమాజసేవ చేయడంకన్నా మోక్షం ఉంటుందని, వేదాలూ, వేదాంగాలు, శాస్త్రాలు, పురాణాలు తిరగదోడిన నేను అనుకోవడంలేదు.

ఇది పిచ్చి కోరికని ఎగతాళి చేయకు. పొరపాటుగా కూడ దీన్ని మరచిపోకు"-

నాకు ఆశ్చర్యం వేసింది. దుఃఖం కలిగింది.

"సరే" నని తాతతో అన్నాను. అప్పటి ఆ వెలుగు మళ్ళీనే చూడనే లేదు.

పెద్దచదువులకి పట్నం వచ్చాను.

నేనెలా ఉన్నానని. ఒక్కసారి చూడాలి రమ్మని తాత ప్రతి వాడితో కబురు చేసేవాడు.

వెళ్ళడానికి చార్జీలకు కూడా గతిలేని పేదరికం నన్నావరించింది అప్పట్లో.

తాతకి ధైర్యం చెబుతూ ఉత్తరాలు రాసేవాణ్ణి.

ఒక ఉత్తరంలో—

"తాతయ్యా! నీమాట గుర్తుంది. తప్పక తీరుస్తాను. నాయింటి తలుపులు నీకోసం తెరచుకొంటాయి. ఆది అర్థరాత్రయినా సరే!"-

అని రాసాను.

పట్టలేని సంతోషంతో ఆ ఉత్తరాన్ని అందరికీ చూపినాడు. మీ తాతని నా స్నేహితుడొకడు చెబితే నా కెందుకో ఎంతోహాయి అనిపించింది. అలా కొన్ని నెలలు గడిచాయి.

హఠాత్తుగా ఒకరోజు తంతి వచ్చింది.

"తాత చచ్చిపోయాడు. అర్జెంటుగా రమ్మని!"

భావాలు, అనుభూతులు ఏవీలేక పదినిమిషాలు సరసరమని నడిచాయి.

ఇంటివద్ద ఎవరూ లేకపోతే ఎలా అని అమ్మా, నాన్నా ఇద్దరే వెళ్లారు!

తాతని చూళ్ళేక పోయాను.

కనీసం ఆయన భవుతిక కాయాన్ని అయినా చూడాలని నేను చేసిన ప్రయత్నం ఫలించలేదు. అమ్మకి నాన్నకి ఎంతో చెప్పాను. వాళ్ళు వినిపించుకోలేదు.

మూడవరోజు.... .... ....

మామయ్య కారు పంపాడు. అమ్మ కూడ వచ్చింది. కర్మ కాండలని ఘనంగా జరపాలని మామయ్య అనుకున్నాడట! అందుకే అందర్నీ రమ్మని చెప్పాడు. తాతలేడు ఆయన శవం కూడా లేదు. ఇక ఎందుకూ వెళ్ళడం అనిపించిది,

కాని వెళ్ళక తప్పలేదు.

"అంత్యక్రియలు ఇంత ఖర్చు పెట్టి జరిపించడాన్ని నేనెక్కడా చూడలేదు అన్నాడొకాయన.

"కర్మకాండలని ఇంత వైభవంగా జరిపిస్తున్నారు. ఆయనకి స్వర్గలోకం తప్పదు." అన్నాడు ఇంకొకాయన.

నాకు ముద్ద మింగుడు పడలేదు.

బ్రతికి ఉన్నప్పుడు దాదాపు వెలివేసారు ఆయన్ని. ఇప్పుడు ఆయనకి స్వర్గం......!

నవ్వూ వచ్చింది ఏడుపూ వచ్చింది.

పితృశేషం తినమని వేసారు.దాన్ని చూస్తూ ఉంటే తాతకన్నీటి రూపమే కనిపిస్తోంది.

ఎగదన్నుకొస్తున్న బాధని దిగమింగుకోలేక పోతున్నాను.

ఎవరికి వాళ్ళే సినిమాలకీ పిక్‌నిక్‌లకీ మొదలయ్యారు.

పదిరోజులు గడిచాక సూతకస్నానం!

స్నానం చేస్తూంటేమఃఖం ఆగట్లేదు. ఈరోజుతో ఇకసూతకం కూడలేదు.

మనిషిని ఎంత త్వరగా మరచిపోతారు ?

భోజనమయ్యాక తాతని కాల్చిన చోటుకి వెళ్లాను. అక్కడ కాస్త బూడిద ఉంది. నిశ్శబ్దంగా రోదిస్తూ కూర్చున్నాను.

ఈలోగా మామయ్య, నాన్న వస్తూఉండటం చూచి ప్రక్కకి వెళ్లాను.

పురోహితుడు ఏదో తతంగం నడిపాడు.

తరువాత అంతా వెళ్ళిపోయారు!

తిరిగిరాని తాతకోసం, బూడిదైన ఆయన కోసం అక్కడే సాయంత్రం దాకా ఉన్నాను.

ఈలోగా వీరన్న - వాడే కాటికాపరి! - మా బడి వెనకాలే వాటిల్లు! వచ్చాడు.

ఎర్రగా కళ్ళు ఉబ్బిన నన్ను చూచి ఏమనుకున్నాడో!

"చూడు బాబూ! ఎంతో మంది పుడుతుంటారు. ఎంతోమంది చనిపోతుంటారు. ఇది మామూలే ఇక్కడ చూడు ! ఒకటి రెండు మూడు.... ....మొత్తం ఏకుళవాలు కాలినగుర్తులున్నాయి. చనిపోయిన వాళ్ళురారు!మళ్ళీ పుడతారో పుట్టరో కూడ తెలీదు! ఏడ్చి లాభమేమిటి? ఈవేళ మీతాత, రేపు నేను, ఎల్లుండి నీవు! అంతే"

ముందుకెళ్ళిపోయాడు వాడు.... .... ....

వాడు చెప్పింది అర్థం కాక కాదు, ఆ కఠోరసత్యాన్ని భరించే శక్తి లేక భారంగా వెళ్ళిపోయాను!

ఆ రోజు గడచి ఇప్పటికి పన్నెండు సంవత్సరాలయింది.

తాత చెప్పినట్లే మేన మరదల్ని పెళ్ళిచేసుకొన్నాను. బాబు పుట్టాడు!

తాతయ్యే పుట్టాడని నేననుకుంటాను కాబట్టి నాకెందుకో అప్పుడప్పుడు బాబుని చూచినప్పుడల్లా తాతయ్యని చూచినట్లు ఉంటుంది. నమ్మకం కూడా ఒక సెంటి మెంటేమో! పి.హెచ్.డి. చేసినా ఈ సెంటిమెంటు నన్ను వదల్లేదు. పిచ్చాడి ననుకొన్నా బాధలేదు!

# చైత్రహూతి

## శ్రీ మల్లంపల్లి శరభయ్య

మఖల నేతెంచితే చైత్రమా! విశీర్ణ
జీవలోకప్రియాతిథీ! నీవెయాజ్య
మగుచు గ్రీష్మేంధనము శరత్ హవియునైన
యిష్టి కొనసాగుచో! యింకసృష్టి మఖల?

అళిగీతి స్పృహణీయముల్ సుమవధూ హార్దామృతమ్ముల్ సుఖా
నిలముల్ శీర్ణమహీజ పల్లవ నవోన్మేషమ్ములున్ కోకిలా-
కులసీమాంతములున్ దిశాంచల కుహూకూలంకషా-ప్లావిత
మ్ములు కాంతమ్ములు జీవలోకమధురమ్ముల్ శైశిరా హ్ణాంతముల్॥

జరుగ వర్ష పరం పరల్ మఖల మఖల
సృష్టి తరుశాఖికాగ్రముల్ చివురు దొడుగు
నవనవోదిత పద్మబాంధవ మరీచి
ప్రాచి వెలయించు క్రొత్త లెప్పటికి నపుడె"

కలకంఠ ప్రియహూతు లెవ్వరిటు నా కర్ణింతు రెవ్వారికీ
యళిగీతుల్? శుకశారికాకుల కలవ్యాహార మేవీనులం
దొలికించున్ సుధ? లీ సువర్ణమయ ప్రత్యూషాబ్జ బంధూదయ
మ్ముల కెవ్వారిటు నర్ఘ్య మెత్తుదురు? సంపుల్లాశయా బ్జంబులన్॥

ఆధి వ్యాధి జరామృతి
బాధితమగు జీవలోక పరిణతిలో నీ
గాధలె త్రవ్వి నవత్వము
సాధింపన్ గవికులంబు సమకొనుచుండున్"

సమతీత స్మృతివల్లులల్లుకొని నా స్వాంతంబు పుష్పించు తీ
యము లేనాటి యనుంగులో! చరమసంధ్యా మల్లికా ముగ్ధజీ
వములై నీవరు దెంచువేళ పునరావర్తమ్ములై వచ్చి దుః
ఖము సౌఖ్యమ్మనరాని నిర్వృతి నేడన్ గల్పించు చైత్రాతిథీ!

నీ తోడన్ ప్రభవించు పుష్పజగముల్ నిర్వ్యాజముగ్ధమ్ములై
నీ తోబుట్టులు తేనియల్ వలపులున్ నీ వార్ద్రితాస్థానమై
నీతో సృష్టి నవీకృతంబగు జరానీహార నిర్ముక్తమై
నీతోడన్ రసభావ నిత్యసుషమల్ నిండారు విశ్వమ్మునన్

నీవేతెంచిన మార్గముల్ కిసలయా నీ కోల్లసత్తోరణ
న్యావిద్ధాంబరముల్ మరంద సుమనః సాత్రీకృతా ర్ఘ్యమ్ములా
శావిశ్రావిత కాహళీ పికకల వ్యాహారముల్ సృష్టికిన్
భావావేశము పీ, వనన్యజపునః ప్రాణానిలస్పందమై॥

సుమములనె కాదహో జీవసుమములందు
నింపెదు వికాసమున్ ప్రణయంపు మధువు
వనములే కాదు సృష్టి జీవనములెల్ల
జీవశోభాదరిద్రముల్ నీవులేక॥

తొలిసిరాక నిగుర్చు తత్కిసలయ స్తోమంబె హేమంత వే
ళలకున్ బండి పురాణపర్ణముల లీలన్‌రాలి కాంచున్ సము
జ్జ్వల రాగద్యుతులన్ కిసాలయ పునర్జన్మంబు;దోబూచియా
టలుగా జీవులరాకపోకలవనిన్ దైనారుచో! నిత్యమై॥

రోచిర్మయ మజరామర
మై చేతో మోహనము చరాచర సృష్టిన్
నీచైతన్యమె నిండెను
ప్రాచేతస కావ్య వన విభాగములెల్లన్॥

ఆనంద ప్రభవంబె భూతనిచయం బానంద సంస్థానమా
ఆనందంబున యండెడిందు నను నయ్యానంద వల్లీవచః
సానాథ్యమ్మనకెన్న నిన్విడిచి దృష్టాంతంబు లేదెందు న
ద్దానన్ జైత్రమ! నీదుకీర్తులలరున్ త్రయ్యంత గేయమ్ములై॥



( గ త సం చి క త రు వా యి )

ఆదివారం సాయంకాలం నాలుగుగంటలకు సరస్వతి, పిల్లలను తీసుకొని బీచికి వెళ్ళింది. చాలాకాలమయి వాళ్ళు అడగుతున్నారు. ఒక్క ఆదివారం తప్ప మిగిలిన రోజులలో తాను చీకటిపడంది ఇల్లు చేరడం లేదు. ఈ మధ్య ఇంకా ఆలస్య మవుతున్నది. ఈ ఆదివారం కూడా పనులలో పడి మరిచిపోయేదే. అలా తిరిగివస్తే, పిల్లలతో కొంతకాలం గడిపితే, మనసు నిర్మలంగా ఉంటుందని అనుకుంది. మూర్తిని కూడా పిలుచుకొని రమ్మని కాత్యాయనితో చెప్పింది. అప్పటికే అతను ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు.

బీచిలో ముగ్గురూ కూర్చున్నారు. కాత్యాయని ఏవో ప్రశ్నలు వేసింది. శేఖర్ సముద్రమెందుకు నీలంగా ఉందని, ఇసుక ఎలా ఏర్పడిందని, ఇంకేవేవో తికమకలు పెట్టే ప్రశ్నలు వేశాడు. వాటి అన్నిటికీ చాల ఓపికతో జవాబు చెప్పింది సరస్వతి. తరువాత వాళ్ళిద్దరూ నీటివేపు నడిచారు.

"పాదాలు తడిసేవరకు నీటిలో నడవండి. అంతకుమించి లోపలికి పోకండి."

"అలాగే వదినా!" అన్నారు ఇద్దరూ.

వాళ్ళకి తనికి మధ్య ఒక ఇరవైగజాలే ఉంది.

శేఖర్ పంట్లాం తడవకుండా, మడతలు పెట్టాడు.

కాత్యాయని స్కర్టు కొంచెం పైకే ఉండడంచేత ఇబ్బంది లేకపోయింది.

వాళ్ళిద్దరూ చిన్న శంఖాలు, గుల్లలు ఏరుతున్నారు.

సరస్వతి మనసు మళ్ళా ఆలోచనతో నిండిపోయింది.

తన ఉద్యోగ జీవితాన్ని ఆమె సింహావలోకనం చేసుకుంటున్నది.

ఉన్నట్టుండి ఆమెకు నవ్వువచ్చింది. ఉద్యోగం పోయేముందు ఈ ఆలోచన ఎందుకు కలిగిందని ఆమె నవ్వుకుంది.

ఉద్యోగం దొరకదన్నది చాల వింత అయిన పరిస్థితులలో లభించింది.

ఏదో జీవితం దారిపడుతున్నదని అనుకుంటుంటే, చాలా వింత అయిన పరిస్థితులలో ఉద్యోగం పరిసమాప్తికి దారితీస్తున్నది.

ఆలోచిస్తూ ఆమె పిల్లలవేపు చూచింది. వాళ్ళిద్దరు తనవేపు ముఖాలుంచి గుల్ల లేరుతున్నారు. వెనుకనో పెద్ద కెరటం లేచి వేగంగా. ఒడ్డుకి వస్తున్నది.

ఆమె ఆలోచనలన్నీ స్తంభించిపోయాయి.

కాత్యాయనీ! శేఖర్! ముందుకి రండి!" ఒక్క కేక పెట్టింది.

కెరటం పిల్లలను చేరేలోగా ఒక్క ఉరుకు ఉరికింది.

సరస్వతి పిల్లలను చేరేసరికి ఇద్దరు రెండుమూడు గుక్కలు ఉప్పనీరు త్రాగేశారు. గుండెల బంటి నీటిలోకి శరవేగంతో దూసుకొనిపోతే కాత్యాయని ముందు, తరువాత శేఖర్ దొరికారు. ఇద్దరినీ చెరో చంకలో పట్టుకొని, చాల శ్రమపడి ఇద్దరినీ ఒడ్డు చేర్చింది బీచ్‌లో అట్టే మనుషులు దగ్గిరలో లేకపోవడంచేత ఎవరూ చుట్టూ మూగలేదు. పిల్లలిద్దరినీ గుండెలకు హత్తుకొని ఒక పది నిమిషాలు అలా ఇసుకలో కూర్చుంది. వాళ్ళు కొంచెం స్థిమిత పడ్డాక, ముగ్గురూ తడిబట్టలతో, ఇంటివేపు నడిచారు. అప్పటికి చీకటి పడింది.

వాళ్ళు ముగ్గురూ జానకమ్మను కావలించుకొని ఏడ్చారు.

"అత్తా ! ఎంత ఘోరం జరగవలసిందత్తా !"

"అమ్మా ! వదిన లేకపోతే మేము ఇంటికే రామమ్మా!" అంది కాత్యాయని.

"అమ్మా ! నీకు నేను ముందే చెప్పలేదా ! అందరూ ఆడవాళ్ళు. ఒక ఎత్తు, వదిన ఒక ఎత్తు. మగవాళ్ళు కూడా అంత ధైర్యంతో ముందుకు దూకరమ్మా !" అన్నాడు శేఖర్.

వాళ్ళందరి వెనుక ఇంట్లోకి వచ్చిన రామచంద్రయ్య మాటలు దక్కి వాళ్ళను చూస్తూ నిలబడిపోయాడు.

జానకమ్మ కళ్ళొత్తుకుంటూ భర్తవేపు చూచింది.

"జానకి ! పూర్వపుణ్యం కొద్ది సరస్వతి వంటి కోడలు దొరికింది. మన మందరం అదృష్టవంతులం" అన్నాడు అతడు.

పిల్లలు బట్టలు మార్చుకున్నారు.

సరస్వతి స్నానం చేయడానికి బాత్ రూముకి వెళ్ళింది.

సత్యమూర్తి స్కూటరు లోపలపెట్టి, మేడమీదికి వెళ్ళిపోయాడు. శేఖర్ కూడా అన్న వెనుకే మేడ మీదికి వెళ్ళి వదినచేసిన సాహసకృత్యం గురించి చెప్పడం మొదలు పెట్టాడు. మూర్తి తమ్ముని దగ్గిరగా తీసుకొని సావధానంగా విన్నాడు.

సరస్వతి మేడమీద గదిలోకి వచ్చేసరికి శేఖర్ కథనం పూర్తి అయింది. మూర్తి ముఖంలోని ఆందోళన క్రమంగా తగ్గి ప్రశాంతత స్థిరపడింది.

సరస్వతి కుర్చీముందుకు తీసుకొని అన్నదమ్ములకు దగ్గిరగా కూర్చుంది.

"వదినకు థాంక్స్ చెప్పేవా, నిన్ను రక్షించినందుకు ?"

"థాంక్స్ ! వదినా!" నవ్వుతూ శేఖర్ క్రిందికి వెళ్ళిపోయాడు.

"నాకు కాదు థాంక్స్ చెప్పడం; ఆ భగవంతుడికి చెప్పాలి. ఆ విషయం తలుచుకుంటుంటే ఇప్పటికీ ఒళ్ళు గగుర్పొడుస్తున్నది." అంది సరస్వతి.

"సరస్వతీ! భోజనానికి ఇంకా ఒక గంట వ్యవధి ఉంటుందనుకుంటాను. అంతవరకూ మాట్లాడుకోడానికి వీలవుతుందా! మరొక ముఖ్యమయిన విషయం నీతో చర్చించవలసి ఉంది."

"ఒక అరగంట వరకూ పనిలేదు. తరువాత భోజనాలకు ఏర్పాటు చేయాలి."

సత్యమూర్తి లేచి అటాచీ తెరచి ఒక రిజిస్టర్డు కవరు బయట పెట్టాడు. దానిని టేబిలుమీద ఉంచి సరస్వతి ముఖంలోకి కొంచెం తేరి చూచాడు.



"అరగంట సరిపోతుంది."

"నాకీరిజిస్టర్డు లెటరు మూడురోజుల క్రింద చేరింది. మూడురోజులు దానిని చదివి జీర్ణించుకున్నాను. దానితో పంపిన బంధాలను రమారమి కంఠస్థం చేశాను. మీరందరూ బీచికి వెళ్ళితే నేనూ మరొక బీచికి వెళ్ళి మూడుగంటల సేపు దీర్ఘంగా ఆలోచించాను. ఇక ఏమీ చేయవలసినదిలేదు, ఉత్తరంతో వచ్చిన అనుబంధాలు నిజమైనవో కావో తెలుసుకోవలసిన పని మాత్రం ఉండిపోయింది. నీ ఒక్కతెకే సాధ్యమవుతుంది."

సరస్వతి కవరు తెరిచి లోపలి కాగితాలు తీసింది.

మీదనున్న ఉత్తరం చదువుతుంటే ఆమె ముఖంలో మయిన్న కోపచిహ్నాలు తోచాయి.

సత్యమూర్తి చూస్తున్నాడు ఆమె ముఖంలోకి.

తరువాత ఆమె అనుబంధాలను ఒకసారితిరగ వేసింది. ఆమె మీద చిన్న నవ్వులోచింది

ఈ ఉత్తరాలు నేను వ్రాసినవే – రామాచారికి పెళ్ళికాకముందు వ్రాసినవి. అప్పటికి మన వివాహం గురించి తలంపేలేదు వరదలో కొట్టుకొనిపోతున్న మనిషి, చేతికందిన కర్రనో, చివరకు గరికనో పట్టుకొని ప్రాణాలు కాపాడుకోడానికి ప్రయత్నిస్తాడు నా పరిస్థితి అంతకన్నా హీనంగా ఉందప్పుడు ఈ రామాచారినే కాదు, ఈ మనో హర్ వెంట కూడా బడ్డాను. మా పిన్ని కబంధ హస్తాలలోంచి తప్పించుకోడానికి ఇన్ని బాధలు పడ్డాను. నువ్వు గుర్తించే ఉంటావు- ఎక్కడా ప్రేమ గురించి ప్రస్తావనలేదు. బాధనే ఉత్తరాలలో వ్రాసాను.

"అవును చదువుతుంటే నాకు కళ్ళంట నీరు కారింది.

నీ దయనీయమైన పరిస్థితికి ఎంతో విచారించాను."

తరువాత ఆమె జరిగిన సంగతులన్నీ సత్యమూర్తితో చెప్పింది.

అతను సావధానంగా విన్నాడు.

అపుడు సరస్వతి ఉత్తరం చదివింది మళ్ళా దానిలో ఎవరినీ నిందించనూలేదు, సంతకమూ దిగువన లేదు.

"దీనితో మీ భార్య మరొక పెద్దమనిషికి వ్రాసిన ప్రేమ లేఖలు ఫొటోస్టాట్ చేయించి, ఒక కాపీ పంపుతున్నాము మీరు వృద్ధిలోకి రావలసినవారు. ఇటువంటి అభివృద్ధి నిరోధకాలయిన డాక్యుమెంట్సు ఎంత హాని చేస్తాయో మీకు తెలుసు. మీరు మాతో సహకరిస్తే అన్ని విధాలుగా బాగుపడతారు. లేనిపక్షంలో వీటికాపీ ఒకటి ప్రెస్‌కి పంపు తాము. ఒకటి మీ ఛీఫ్‌ఇంజనీరుకు పంపుతాము. చేయిదాటిన తరువాత పరిచింతించినా ప్రయోజనం లేదు, అంతవరకు సుహృద్భావంగా మన సంబంధాలు కొనసాగిద్దాము."

సరస్వతి క్షణం ఆలోచించింది

"బావా ఈ పెద్దమనుషులు ఒక సంగతి మరచిపోయారు. పేపరుకెక్కితే మనతోబాటు ఆ రామాచారి నాశనమయిపోడా?"

"ఆ విషయం కూడా నేను ఆలోచించాను కాని ఈ బ్లాక్ మెయిలువల్ల ముందుగా నేను, నువ్వు నవ్వుల పాలవుతాము"

"బావా! ఇటువంటి వాటికి బెదిరిపోనక్కరలేదు. వీటికోసం మని షిని నీతిని, నిజాయితీని వదలి పెట్టలేము"

సత్యమూర్తి సరస్వతి ముఖంలోకి చూచాడు.

"నేనుఈ విషయం నీతో చర్చించడానికి చాల ఆలోచించాను ఏ పరిణామ మయినా నాతో బాటు నీకు హాని కలుగజేస్తుంది అందుకే ఈ రెండురోజులు బాధ పడ్డాను."

"ఎంత పిచ్చివాడివి బావా! ఈ రూపసుల సంపదకి, వైభ వానికి భ్రమసి పెళ్ళయిన తరువాత కూడా వాళ్ళ వేపే మొగ్గి, లేని పోని ఆశలతో మనసు నింపుకుని, మాయాజాలంలో చిక్కుకున్నాను. చాల సమీపంలో ఉండి వారి ప్రవర్తన బాగా అర్థం చేసుకున్న తరువాత నా భ్రమ మంచులా కరిగిపోయింది."

సత్యమూర్తి చాల శ్రద్ధతో ఆమె చెప్పిన మాటలు వింటు న్నాడు వైవాహిక జీవితం అపవాదు అనే బండరాతికి కొట్టుకొని విచ్ఛిన్నం కావలసిన సమయంలో ఈమె కొంచెం కూడా భయపడ కుండా సత్యం చెప్తుంటే అతను ఆనందంతో చలించాడు. ఆమె చేతులు రెండు తన చేతులలోనికి తీసుకున్నాడు

"సరస్వతీ! నా సమస్యలన్నీ పరిష్కారమయ్యాయి. మనం ప్రయాణం చేస్తున్న నావ సుడిగుండంలో పడబోతున్నది. కాని నీ సహాయంతో సముద్రం అడుగుకు చేరినా మీదికి రాగలననే నమ్మకం నాకు కలుగుతున్నది"

ఇంతలో జానకమ్మ ఇద్దరినీ భోజనానికి పిలిచింది. సరస్వతి. మూర్తి చేతులను కళ్ళకు అద్దుకొని విడిచింది.

## 19

సోమవారం నాడు సాయంకాలం నాలుగుగంటలు దాటిన తరు వాత స్టోర్సు ఆఫీసరు సుబ్బారావుగారు స్టోరులోకి వచ్చారు. లెడ్జరు లలో ఆనాడు ఇచ్చిన సామాను పోస్టుచేసి, పుస్తకాలు మూస్తున్న సరస్వతి అతనిని చూడగనేలేచి నమస్కారం చేసింది.

"సరస్వతీ! ఇవాళ రెండు డెటనేటర్లు కొన్నాము -వీటికి కొన్ని నిబంధనలు ఉన్నవి వీటిని ఎవరికీ అందుబాటులో లేకుండా బీరువాలో పెట్టి భద్రంగా ఉంచాలి. వీటిని ఎవరికిచ్చినా వారి సంతకం తీసు కోవాలి. ప్రతిడిటనేటరుతో నూరుగజాల ఎలక్ట్రికల్ కేబిలు కూడా ఉంది. ముఖ్యంగా గమనించవలసింది, నా అనుమతి లేకుండా వీటిని ఎవ్వరికీ ఇవ్వరాదు"

వెంకునాయుడు జాగ్రత్తగా పాకింగ్ చేసిన రెండు చిన్న కట్టె పెట్టెలు, రెండు ఎలక్ట్రిక్ కేబిల్లు బీర్వాలో ఉంచాడు.

"ప్రస్తుతం లాబరు కాలనీలో మనం త్రవ్వుతున్న నూతి కోసం వీటిని కొన్నాము మామూలుగా మనం ఉపయోగిస్తున్న తూటాకంటె ఇవి ఇరవై రెట్లు బలమయినవి అవసరమయితేనే వీటిని ఉపయోగిస్తాము.అంతవరకూ నీ బీరువాలో భద్రంగా వీటిని అట్టేపెట్టు"

వెంకునాయుడు దుమదుమలాడుతూ సుబ్బారావుగారి వెనుకకు వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం బాసులందరూ యూనివర్శిటీలో జరుగుతున్న ఎగ్జిబిషన్‌కు వెళ్ళిపోయారు.

రోజ్ ఇంటికి వెళ్ళిపోతూ స్టోర్సు వేపువచ్చింది.

కుర్చీలో కూర్చొని సావకాశంగా పేపరు చూస్తున్న సరస్వతి దగ్గిరికి వచ్చి, పక్కనే ఉన్న కుర్చీ లాక్కొని కూర్చుంది.

"సరూ! ఎన్నాళ్ళయి మంచి బాలికవయావు మధ్యాహ్నం టిఫిన్ రూముకు కూడా రావడం మానేశావ్! ఏమిటి కారణం?

సరస్వతి పేపరు మడతపెట్టి డ్రాయరులో పెట్టింది.

"కారణం ఏమీ లేదు : స్టోరులోపని హెచ్చుగా ఉండడం చేత ఆఫీసు వేపే రావడానికి వీలు పడడంలేదు."

"సరూ ఈ మాటలన్నీ కట్టిపెట్టి, నిజమయిన సంగతి చెప్పు! నీకు బాసులకు మధ్య ఏమి జరిగింది? ఈ మధ్యను తరచు నీపేరు రాజ కుమార్, రామాచార్లుగార్లు ఉచ్చరిస్తున్నారు. ఏవేవో చెప్పుకొని నవ్వుకుంటున్నారు. మధ్యమధ్య వెంకునాయుడితో మంతనాలు జరుపుతున్నారు పెద్దబాసు. వాడి ముఖం దుమ్మరగుండులా కనిపిస్తున్నది. ఒకసారి ఏమీ తరచు మాటాడని పెద్ద బాసుకూడా నోరు పారేసుకుంటున్నారు. ఈ మార్పుకి కారణం ఏమిటి?"

"రోజ్: వీటికి నేను ఏమి సమాధానాలు చెప్పలేను. ఒకప్పుడు మిత్రులైన వాళ్ళు పరమశత్రువులవుతారు.

"అంటే కామ్ బిఫోర్ ది స్టార్మ్ అన్నమాట"

"మేఘాలు ముసురుకుంటున్నవి. రేడియో అనౌన్సుమెంటు కావాలికదా!"

"కాని నువ్వు సెంటరులో ఉండడం నాకు నచ్చడంలేదు."

"అవును. తప్పదు."

"ఈమధ్య రుక్మిణితో వేగలేకపోతున్నాను. నీతో ఏవో చెప్పుకుంటే సలహాలు ఇచ్చేదానివి కాని నేనేం చేయ్యడం! ఆ నారాయణ్ బాధ పడలేకపోతున్నది "

"ఆ కుంటికాలువాడు చాల ప్రమాదమయినవాడు వాడికి నడవడానికి శక్తిలేకపోయినా, కుయుక్తులకు లోటులేదు. రుక్మిణితో చెప్పు. వాళ్ళ తమ్ముడిని సిద్ధం కమ్మను పార్కులోకి ఒకసాయంకాలం పిలిపించి, రెండవ కాలు కూడా నడవడానికి వీలులేకుండా చేయ మను.

"వీటన్నిటికేమి గాని, ఆ వెంకునాయుడికి నీ మీద ఎందుకంత కోపం?

"నాకా విషయం తెలియదు"

"వారం రోజుల క్రితం పళ్ళు కొరుక్కుతూ పెద్దబాస్ ఛాంబరు నుండివస్తూ, నీపేరే పలుకుతున్నాడు. వాడు చాల ప్రమాదమయిన వాడు. ఒక్కక్షణంకూడా ఏమరి ఉండడానికి వీలులేదు.

"అవును రోజ్! నీవంటి స్నేహితులుంటే నాకు చాల నిబ్బరం మరేం భయంలేదు. ధైర్యంతో అన్నీ ఎదుర్కొంటాం.

తరువాత రోజ్ వెళ్ళిపోయింది. ఆ తరువాత సరస్వతికూడా స్టోరు మూసి బయలుదేరింది.

బస్సులోకి ఎక్కిన తరువాత జ్ఞాపక మొచ్చింది. మరునాడు కాత్యాయని పుట్టిన దినమని. పర్సు చూచుకుంది. దానిలో నూరురూపాయల నోటొకటి ఉంది. బజారులో తిరిగి కంచిపట్టుపరికిణీ, జాకెట్టుకు సరిపోయేది కట్టతీసుకొని ఇల్లు చేరింది. అత్తకి కాత్యాయనికి చూపించి, వెంటనే మిషనుమీద కుట్టింది. రాత్రితొమ్మిదిన్నర అయినా సత్యమూర్తి రాలేదు. పిల్లలు. అత్తమామలు భోజనాలు ముగించి రేడియో వింటున్నారు. సరస్వతి పోయి తన మంచం ముందుకు లాక్కొని, తలగడా పడేసి మేను వాల్చింది.

పగలంతా పనిచేసి అలసిపోయింది. మనస్సులోని సమస్యలు వేధిస్తూనే ఉన్నా, పైకిమాత్రం ఏ మాత్రం చలించకుండా మామూలుగా కనిపించడానికి ప్రయత్నించింది. ఏవో ఆలోచిస్తుంటే కళ్ళు మూసుకున్నాయి

అప్పుడామెకు ఇద్దరే కనిపిస్తున్నారు. అది మానేజింగ్ డైరెక్టరుగారి ఛాంబరు. ఫోమ్‌లెదర్ కుర్చీలలో ఇటొకరూ అటొకరు కూర్చున్నారు. – పొడుగుగా, వలంగా, సైడ్‌బర్న్సు. దట్టంగా విగ్గు వంటి జుట్టూ, చెరూట్ కాలుస్తూ రామాచారి కనిపించాడు. తనను చూచి నవ్వుతున్నాడు.

"సరస్వతీ ! రడీ ! ఇప్పుడే మనం వెళ్లిపోదాం. మద్రాసులో మన పేర నౌకరూమ్ బుక్‌చేశాను నువ్వేమీ డబ్బు తీసుకొని రానక్కరలేదులే – పాపం ! కాళ్లవేళ్ళ పడుతున్నావ్ ! ఒక్కవారం రోజులు మజా చేసి వచ్చేద్దాం. మొదట వేసినప్లాను మరి చెల్లమగదా ! నాకో భార్య, నీకో భర్త ఉన్నారు. పద !"

వద్దని తానంటున్నది. రానంటున్నది. ఇప్పుడటువంటి అవసరం లేదని అంటున్నది.

"టాక్సీ నిలబడి అప్పుడే అరగంట అయింది. మరిటైమ్ వేస్టు చేయకు. మీటరు తిరిగిపోతున్నది "

అతను తన చేయి పట్టుకొని ఈడ్చుకొని పోతున్నాడు. తాను పోవడానికి అడ్డంకులు కల్పిస్తున్నది.

టాక్సీదగ్గిర మరొకరు – అది టాక్సీకాదు. మానేజింగ్ డైరెక్టరుగారి ఆఫీసుకారు – దాని డ్రైవరు అప్పలస్వామి యూనిఫారంలో ఉన్నాడు కారు దోరుదగ్గిర మనోహర్ నిలబడి ఉన్నాడు. కళ్లిలాల్చీ తెల్లపరాయి తొడుకున్నాడు. నోటిలోపైపుంది – చేతిలో షాంపేను గ్లాసుంది.

"హలో ! సరస్వతీ ! ఏమన్నావు ? మదపిచ్చి ఎక్కుతున్నదా నీకు ! దటీజ్ రైట్ ! సైకియాట్రిస్ట్ అదే చెప్పాడు - అందుకే గెస్ట్‌రూమ్ ఖాళీగా ఉంచాను. తలుపులు గడియపెట్టి నీ పిచ్చి కుదురుస్తాను."

తాను ఏడుస్తున్నది. అంతలో అక్కడ వెంకునాయుడు కనిపించాడు.

"ఏమ్ ! సరస్వతి ! ఇంకెక్కడికి పోతావే ! నీకు తెలుసా నాకు ముగ్గురు లంజలున్నారు. నువ్వు నాలుగోదానివే ! ఈ వెంక్కునాయుడి దగ్గిరా నీ ఆటలు !!

సరస్వతి వణికిపోతున్నది. వాడు ఈడ్చుకుపోతుంటే! తీరా చూసేసరికి వాడు లేడు. సొట్టకాలు ఊపుకుంటూ సత్యనారాయణ కనిపించాడు.

"ఓ నాయుడు, ఇదినాది! నా అక్క సవితి కూతురు! దీనిపీప పెట్లగొట్టి పెళ్ళి చేసుకుందామనుకుంటే కళ్ళు కప్పిపారిపోయింది. ఇప్పుడెక్కడికి పోతుంది. త్రాహి త్రాహి అంటూ కాళ్ళమీదపడుతుంది. రోగం కుదురుస్తాను - నాకు వదిలీ దీనిని-"

సరస్వతికి ఆ ఛాంబరులో నలుగురు మనుష్యులు కనిపించారు-ఇద్దరి వెంటనెప్పుడో తను పడింది-ఇద్దరు తన వెంట ఇప్పుడుకూడా పడుతున్నారు - నల్గురూ దగ్గిరగా వస్తున్నారు. తన బట్టలను చింపి గాంగ్ రేప్ చేయడానికి వస్తున్నారు.

దూరం నుండి ఏదో పిలుపు.

"సరస్వతీ ! ధైర్యగా ముందుకురా! నే నున్నాను - ఎవరూ నీ వంటిమీద చేయికూడా వెయ్యలేరు-భయంలేదు-నడిచిరా!"

దూరంగా బావముఖం కనపిస్తున్నది. అతని పెదవులమీద నవ్వు కనిపిస్తున్నది. తనకు వేయి యేనుగుల బలం వచ్చింది. ముందుకు నడిచింది. ఆ మనుషులు తొలగిపోయారు - ఆ ఛాంబర్ గోడలు వెనక్కుపోయాయి.

ఆమె కళ్ళిప్పి చూచింది. ఎదురు గుండా సత్యమూర్తి నిలుచున్నాడు. స్నానం చేసి వచ్చినట్లున్నాడు.

"ఇంకా లేపాలని అనుకుంటుంటే నువ్వే లేచావు. ఇప్పుడెంత యిందో తెలుసా! పదకొండు! పద! భోజనం చేద్దాం"

మంచం మీద నుంచి లేచి, అతని చేయి పట్టుకొని మెట్లవేపు నడిచింది సరస్వతి.

## 20

బుధవారంనాడు రాజకుమార్ అండ్ అసోసియేట్సు సంస్థపైన ఒక పెద్ద బాంబుపడింది. పునాదులలోంచికూడా దానిని కదిపి వేసింది.

మామూలు రోజులలో వలెనే ఆరోజుకూడా పదకొండు గంటలకు పోస్టుమాన్ ఉత్తరాలు డెలివరీ చేశాడు. వాటిలో రెండు రిజిస్టర్డు లెటరులున్నవి. మానేజరు వాటిని తీసుకొని వెంటనే విప్పిచూశాడు. వెంటనే ఆ రెండింటిని ఒక ఫైలులో పెట్టి తొందరగా మానేజింగ్ డైరెక్టరుగారి దగ్గరికి నడిచాడు.

ఛాంబరులో రాజకుమార్ ఒక్కడే ఉన్నాడు. మానేజరు తెచ్చిన రెండు ఉత్తరాలు తీసుకొని చూచాడు.

మొదటి దానిలో అయిదు లక్షల రూపాయలకో క్రాస్డు చెక్ ఉంది. ఆఫీసర్ల బంగళాల నిర్మాణంలో ముట్ట వలసిన డబ్బది.

"వెరీగుడ్ ! దీనిని మన అకౌంట్సుకి పంపండి"

మానేజరు ఆ చెక్ తీసుకున్నాడు. ఏమీ కూట్లాడలేదు. చాలా ఆత్రతతో రాజకుమార్ వేపు చూస్తూ ఉండిపోయాడు.

రెండవ ఉత్తరం చదువుతుంటే రాజకుమార్ ముఖంలో రంగులు మారి పోయాయి. సహజంగా పెదవులమీద ఆడే చిరునవ్వు మాయమయిపోయింది. భ్రుకుటి ముడుచుకుంది. శ్వాసవేగం హెచ్చింది. కోపంతో అతను కంపిస్తున్నాడు.

ఆ బాంబుతో సంస్థ పునాదులలోంచి కదిలిపోయింది.

కోటిరూపాయలు చేసే కంట్రాక్టురద్దయింది. లాబరుకాలనీలో కట్టవలసిన అయిదువందల యూనిట్ల కంట్రాక్టు నాశనమయిపోయింది. రెండు సంవత్సరాలవరకు, కొత్త పనులను జత పరచుకునే వరకు, నిరాటంకంగా సాగవలసిన పని సమూలంగా నాశనమయింది. పైగా ఈ సరికి కట్టిన వందయూనిట్లు, వాటితోపాటు త్రవ్వవలసిన నూయి, అన్ని స్పెసిఫికేషనుల మేరకు పూర్తిచేసి రెండు నెలలలో అప్పచెప్పవలసిందని తాకీదు వచ్చింది

ఆవంద యూనిట్లు బాగు చేసి అప్పగించడానికి కనీసం పది లక్షల రూపాయలు కావాలి. అంటే సంస్థ చాలా తొందరలోనే కూలిపోతుంది.

ఒక్కసారి రాజకుమార్ కుర్చీలోంచి లేచాడు.

మానేజరును వెంటనే పోయి ఛీఫ్‌లనందరినీ పిలుచుకొని రమ్మని పంపించాడు. వాళ్ళందరూ వచ్చిన తరువాత రెండుగంటల వరకు ఎమర్జెన్సీ మీటింగు కొనసాగింది.

చాల చర్చల తరువాత మీటింగులో కొన్ని తీర్మానాలు ఆమోదించారు.

వెంటనే హైకోర్టులో ఈ కంట్రాక్టు రద్దుమీద స్టే తీసుకొని రావాలి. ప్రస్తుతం చేస్తున్న పని ఆపివేయకూడదు. ఒక మాదిరిగా ఉన్న యూనిట్లను తొందరలో మరామత్తులు చేసి అప్పగించాలి.

నూయి ఇప్పటికి ఆరు నిలువుల లోతువరకు తవ్వడమైనది, మరి రెండు నిలువుల లోతు వరకు పోతే నీరు పడుతుంది. అంతవరకు త్రవ్వడం సాగించాలి. ప్రస్తుతము సిబ్బందిని తగ్గించకూడదు.

రాబోయే శనివారంనాడు రాజకుమార్ రామాచారి - ఇద్దరూ ప్లేనులో ఢిల్లీకి పోయి మంత్రి వర్గంతో ఈ విషయం చర్చించి, మిగిలిన అయిదు వందల యూనిట్ల కాంట్రాక్టు పునరుజ్జీవనమయినట్లు చూడాలి.

మానేజరు. ఆఫీసుస్టాపు అందరూ మాత్రం సరస్వతిని నిందిస్తున్నారు.ఆమే ఈ ఉపద్రవమంతా తీసుకొని వచ్చిందని అనుకుంటున్నారు.

రాజకుమార్ మీటింగు అయిన వెంటనే లంచిముగించి వెంకునాయుడిని సైటునుంచి తీసుకొని రావడానికి కారు పంపాడు. మూడు గంటల వేళకు వెంకునాయుడు పెద్ద దొరగారి రివాల్వింగ్ ఛైర్‌కు కొంచెం దూరంలో చేతులు కట్టుకొని, ఆయన చెప్పింది చాల శ్రద్ధగా వింటున్నాడు.

"వెంకునాయుడూ ! ఇది కథ. ఈ ఉపద్రవానికి మూల కారణం సరస్వతి భర్త. అతను కలగజేసుకోకపోతే పరిస్థితులు ఇంత తొందరగా విషమించేవి కావు. ఛీఫ్ ఇంజనీర్‌ని తీసుకొనివచ్చి, అన్నీ చూపించి, వారంరోజులలో కంట్రాక్టు రద్దు చేయించాడంటే మరి ఆలోచించు. వీడికెన్ని గుండెలుంటే ఇంతపని చేయగలడు?"

అవునుసార్ ! ఆ చీఫ్ ఇంజనీరు చెవిలో ఇల్లు కట్టుకుని చెప్తుంటే అప్పుడే అనుకున్నాను. ఏదో ముప్పు తెస్తున్నాడని. ఇంతకీ ఈ నలుసులాంటి అసిస్టెంటుగాడికి ఇంత పొగరా !"

"నాయుడూ ! నేనెటువంటి వాడినో తెలుసుకదా ! ఎంత మందికో ఉద్యోగాలు ఇచ్చి, తిండిపెడుతున్న మన సంస్థను సర్వనాశనం చేయదలచినవాడిని ఏ విధంగా శిక్షించడమో నాకు తెలియదు."

వెంకునాయుడు మీసాలు తిప్పినవ్వాడు.

"సార్ ! ఆపని నాకు వదిలివేయండి. ఎటువంటి నేరానికి ఏ శిక్ష అమలు జరపాలో నాకు తెలుసు."

తరువాత వెంకునాయుడు రాజకుమార్‌కి కొంచెం దగ్గరగా వచ్చి చెవిలో తన ప్లాను వివరించాడు. పావుగంట వరకు పెద్దబాస్ చాల శ్రద్ధగా విన్నాడు.

"నాకు మొన్న సోమవారంనాడు సుబ్బారావుగారు కొనితెచ్చిన డిటనేటరొకటి ఇప్పించండి సార్ ! రేపు తొమ్మిదిసరికి అన్ని సమస్యలు తీరిపోతాయి."

మనోహర్ బెల్ నొక్కాడు. సత్యనారాయణ లోనికి వచ్చాడు.

"వెళ్ళి మన స్టోరు గుమస్తా సరస్వతిని పిలుచుకొనిరా !"

సత్యనారాయణ ఒక అయిదు నిమిషాలలోనే తిరిగి వచ్చాడు.

"సార్ ! ఆమె మధ్యాహ్నం హార్డు వేరు షాపుకి లిస్టులు పట్టుకొని వెళ్ళిందట. స్టోరు తలుపులు మూసి ఉన్నవి."

"స్టోరు తాళాలు ఎవరికి ఇచ్చిపోలేదా !"

"రోజ్ దొరసాని గారికిచ్చినట్లుంది."

"రోజ్ దొరసానిగారికి మా సలాములని చెప్పు."

రోజ్ కొద్దిసేపటిలోనే వచ్చింది.

"స్టోరు తాళాలు మీ దగ్గిర వున్నవా ?"

"అవును సార్ !"

"పదండి ! కొంత అర్జెంటు మెటీరియలు కావాలి."

రోజ్ ముందు నడిచింది. మనోహర్, వెంకునాయుడు ఆమె వెనుక వెళ్లారు.

మనోహర్ స్టోరు అంతా ఒక పావుగంట వరకు ఇనస్పెక్షను చేశాడు. వస్తువులన్నీ అలమరాలలో అమర్చి ఉన్నవి. స్టాక్‌బాలన్సు వ్రాసి ఉంది సుద్దతో. స్టోరు చాల శుభ్రంగా ఉంది.

"మొన్న సోమవారం నాడు సుబ్బారావుగారు కొని తెచ్చిన డిటనేటర్లెక్కడ ?"

"దొరసానిగారికి తెలియదు సార్ ! అవి బీరువాలో మీది అరలో ఉన్నవి. తాళం తియ్యండమ్మా ! నేను తీస్తాను"

"రోజ్ తాళాల గుత్తిలో బీరువాతాళం వెదకి, తలుపుతీసింది. మీద అరలో జాగ్రత్తగా ఉంచిన చిన్నప్లాస్టిక్ పెట్టె, వేరుగా నున్న నూరు గజాల ఎలక్ట్రిక్‌వైరు వెంకునాయుడు వెలుపలికి తీసి టేబిలు మీద పెట్టాడు.

"ఏ విధంగా ఉపయోగించడమో తెలుసా ?" మనోహర్ వెంకునాయుడిని ప్రశ్నించాడు.

'వీటిని కొన్నప్పుడు షాపు అతను అంతా చూపించాడు సార్! నాకు బాగా తెలుసు - ఒక చివరడిటనేటర్‌కి, రెండవచివర 12వోల్టు బాటరీకి తగిలిస్తేచాలు ఇది పని చేస్తుంది."

"బాటరీ ఎక్కడిదీ ?"

"మన ట్రాక్టరు ఆ సమీపంలోనే ఉంది - దానిని దగ్గిరికి నడిపి దాని బాటరీని ఉపయోగించవచ్చు."

వాటిని పట్టుకొని వెంకునాయుడు, అతని వెంట రాజకుమార్ వెళ్ళిపోయారు. రోజ్ స్టోరుమూసి ఆఫీసు బయటికి వచ్చేసరికి పెద్ద

దొరగారి కోసం కారువచ్చి ఉంది. తలుపు తీసి డ్రైవరు అప్పల స్వామి నిలబడ్డాడు. వెంకునాయుడు ఏవో చెప్పుతుంటే, రాజకుమార్ నవ్వుతున్నాడు. కాని ఆ మాటలు వినేసరికి రోజ్ గుండెలు జల్లు మన్నవి.

ఆఫీసులోని వాళ్ళందరూ వెళ్ళిపోయారు. రోజ్ మాత్రం సరస్వతి కోసం ఎదురుచూస్తున్నది. శీతాకాలమేమో ! ఆరుగంటలకు చీకటి పడింది. సరస్వతి వచ్చేసరికి ఆరున్నర దాటిపోయింది.

"సరూ ఏమిటంత ఆలస్యం ?"

"రోజ్ ! మరేం అనుకోకు - హార్డ్‌వేర్ హవుసు వాడిలెక్కలు మనవి సరిపడలేదు. మనకు సరిపడని సామాను తిప్పిపంపితే, వాటిని కూడా బిల్లులో చూపించాడు. ఆ గుమాస్తాకు కాగితాలన్నీ చూపించి, బిల్లు తిరిగి వ్రాయించుకొని వచ్చేసరికి ఇంత ఆలస్యమయింది సారీ"

"సారీకాదు ! ఈ మధ్యను నువ్వు ఈ ప్రపంచంలో ఉన్నట్టు లేవు. ఇవాళ మధ్యాహ్నం మన సంస్థమీద పెద్ద బాంబు పడింది"

"నిజంగా"

"నీతో అబద్ధమా ! కోటిరూపాయల కాంట్రాక్టు కాన్సిలయింది, ఎమర్జన్సీ మీటింగులు - చర్చలు - తీర్మానాలు - ఏవీ నీకు తెలియవా ? ఆఫీసులో అందరికీ తెలుసు. అందరూ దీనికంతటికీ నువ్వే కారణ మని అంటుంటే వినలేకపోయాను సరూ !"

రోజ్ మరికొంచెంసేపు ఆఫీసు సంగతులు మాట్లాడింది. ఇంతలో గూర్ఖా రోజ్ కోసం రిక్షా తెచ్చాడు. మాట్లాడుతూ రోజ్ రిక్షా ఎక్కింది. రిక్షా కదిలింది. పదడుగులు రిక్షా వెళ్ళిందో లేదో రోజ్ దానిని ఆపి సరస్వతిని పిలిచింది.

సరస్వతి తొందరగ రిక్షాను సమీపించింది.

"ఒక ముఖ్యమయిన సంగతి చెప్పడం మరచిపోయాను. నీ బీరువాలోంచి ఒక చిన్న ప్లాస్టిక్ పెట్టె, ఎలక్ట్రికల్‌వైరు వెంకునాయుడికి కిచ్చాను."

"ఎంత పని చేశావ్ ! సుబ్బారావుగారు తన అనుమతి లేనిది ఎవరికీ ఇవ్వవద్దన్నారు."

"ఏమో మరి - మన పెద్దబాసు స్టోరు ఇనస్పెక్షను చేసి దగ్గరఉండి బీరువా తాళం తీయించి మరీ ఇప్పించారు. దీనికో పన్నెండు వోల్టుల బాటరీ కావాలట. మన ట్రాక్టరుకుందిట. రాత్రి వెంకునాయుడు పని చేస్తాడట. చాల అర్జెంటని తీసుకొని వెళ్ళిపోయారు."

"పెద్ద బాసు ఇప్పిస్తే ఇంకేం ఆలోచన అక్కరలేదు"

"తరువాత - ఆ వెంకునాయుడు - దొరగారి కారు దగ్గర ఏమన్నాడో తెలుసా - ఆ అడ్డు తీరిపోతే మన కాళ్ళు పట్టుకొని పెళ్లాడమంటుంది సార్ - అన్నాడు - సరూ ! జాగ్రత్త సుమా !"

"ఇంక జాగ్రత్తేమిటి ! పూర్తిగా సముద్రంలో మునిగి. పోతుంటే !"

రోజ్ వెళ్ళిపోయింది. సరస్వతి కూడా బస్సుచేరుకుంది. లోపల ఒకరో ఇద్దరో మగాళ్లు కూర్చున్నారు. ఆడవాళ్ళ సీటులో ముందు కూర్చుంది. చిన్న చలిగాలి వీస్తుంటే పైటతో ఒళ్లు కప్పుకుంది.

అనుకున్నంత పని అయింది. వాళ్ళు దెబ్బకొట్టకుండా తనే ముందు వాళ్ళని ముంచేశాడు బావ. ఇంత వేగంగా ఆ పని సాధ్యమవుతుందా అని తనకు సందేహం కలిగింది. ఏ సందేహాలు లేనివాడు బావ. అతను ఊహించినట్లే, వీళ్ళు తన ఉత్తరాలను ప్రెస్సుకి పంపుతే ! దానికీ బావ సమాధానం చెప్పాడు. ఏ బొంబాయికో, అహమ్మదాబాదుకో ఇద్దరం వెళ్ళిపోదామన్నాడు. నలుగురు నోళ్లలో పడిన తరువాత ఈ ఊరిలో ఉద్యోగం చేయడం సాధ్యంకాదు. పిల్లల్ని అత్తని, మామని విడిచి వెళ్లాలని లేదు. - కాని తప్పదు - అక్కడ మరో కొత్తజీవితం - ఒకరికొకరు తోడుగా వుంటే అదే స్వర్గం - తను చాల ధైర్యవంతురాలని బావ అభిప్రాయం. బావ పక్కనుంటే సప్త సముద్రాలను దాట గలిగే శక్తి తనకు వస్తుంది. ఏదో తీయటి భావన. ఇంతలో బస్సు కదిలింది.

(ఇంకావుంది)




సముద్ర తీరాన వుండే ఆ నాల్గంతస్తుల పెద్ద భవంతికి "కళ్యాణి" అంటారు. నాలుగో అంతస్తులో మాత్రమే చిన్న నివాసపు వాటా ఒకటుంది. ఆ ప్రాంతములో ఇళ్ళను వాటి పేర్లనుబట్టి గుర్తించొచ్చు. బొంబాయినగరములోని ఆ మేడను ఎవరైనా తేలికగా గుర్తుపట్టగలరు.

ఆ మేడమీద వాటాలో విందొకటారోజు ఏర్పాటయింది. అయితే అందులో క్రొత్తేమీ లేదు. ఏదో ఒక కారణముతో ప్రతిపూటా అక్కడ విందు భోజన సమావేశాలు జరగటము మామూలే. ఎవరో ఒకరు తమ స్నేహితులను ప్రతి రోజు విందుకు అక్కడకు పిలుస్తుంటారు. ప్రతి భోజనానికి ముందు ఏదో పానీయము యిస్తూనే వుంటారు. స్త్రీ పురుష జంటల చేతులలో మధువుతో నిండిన పెద్దపెద్దగ్లాసులున్నాయి. ఎవరి గ్లాసూ ఖాళీ కాకుండా చూస్తూ "బాయ్" హడావుడిగా ప్రతిచోటికి రెండు సీసాలు పట్టుకొని తిరుగుతున్నాడు.

బయట ఎడ తెరపి లేని వర్షం. బాల్కనీ దగ్గర నిలబడిన నేను భూమ్యాకాశాలు కలిసేచోటును చూస్తున్నాను. నా దృష్టి సెక్రటేరియట్‌కు ముందున్న రోడ్డుపైనుండి సముద్రపు కెరటాలపై నిలిచింది. ఇచ్చట అరేబియా సముద్ర దృశ్యం భయంగాని, ఉత్సాహంగాని కలుగజేయలేక పోతున్నది. నగర వాతావరణానికి, సముద్రము తలవంచినట్లు కనబడుతోంది. అందుకేనేమో వర్షపు జల్లులు సముద్రము పైనే పడ్తున్నాయి.

"కొద్దిమంది నిరంకుశత్వానికి, నెమ్మదైన పలువురు అమాయకులు బలి కావలసినదేనా? బహుశా అది అంతేనేమో? తమను నిలదొక్కుకోడానికే వారలా చేస్తుంటారేమో? ఆ ఏర్పాటులో ఏముందో" అని నాలో నేననుకుంటున్నాను.

"మీరేమి యిక్కడున్నారు?" నా ఆలోచనల కంతరాయం కలుగగా వెనుదిరిగి చూసాను. నా ప్రక్కన రెండు గ్లాసులు పట్టుకొని రోమా నిల్చొన్నది. గ్లాసొకటి తీసుకొని 'రెండవదెవరికి' అన్నాను. "నేను కూడ ఇటువంటివి తాగను." నవ్వుతూ అందామె. ఉల్లాసముతో ఆమెకో కుర్చీ చూపించి, మరో కుర్చీలో కూర్చున్నాను. అప్పటికే వర్షం హెచ్చింది. మాపై తుంపరలు వచ్చి పడుతున్నాయి. రోమా కట్టిన కంచిపట్టుచీర పాడవుతుందని– "నీ చీర తడుస్తోంది. లోపలి కెళ్లాలంటే వెళ్ళు, రోమా' అన్నాను.

ఆమె తలాడించి 'అదేమీలేదుగాని, నేనుండటం మీ కిష్టం లేకపోతే మాత్రము తప్పకుండా–వెళ్ళిపోతా'నంది. నేనామె చెయ్యి పట్టుకుంటూ – 'ఏమలా అంటున్నావు? నిజానికి నా మనస్సు విప్పి మాట్లాడుకునే ముఖ్య స్నేహితురాలివి నీవొకతెవు' అన్నాను.

'అయితే త్రాగే వాళ్ళందరినీ మీరసహ్యించుకుంటున్నారా?- అని ధైర్యముగా రోమా అడిగింది. 'నేనెందుకు అసహ్యించుకోవడం! అది నాకిష్టం లేకనే, బయటకి వచ్చేశాను గదా!' అన్నాను.

ఇంతలో మధుసేవన ప్రాధాన్యత గూర్చి ఒక పార్శీమహిళ ధారాళముగా చెప్తోంది. మేము ఆ విమర్శలను నెమ్మదిగా వింటున్నాము.

'ప్రపంచములోని యితర మనుషులవలె, మనదీ సామాన్య మానవ పుట్టుకే గదా! మన మెందుకు తాగరాదు! ఈ మోసమెందుకు అంటోంది ఆమె.

ఆ చక్కని వాదనకు నవ్వాపుకోలేకపోయాను నేను. 'నాగరికులమనిపించుకోవాలంటే విందులలో త్రాగడమవసరమా? ఎక్కడ, ఎప్పుడు, ఎవరు. దీనిని చెప్పారు? ఆ గొప్ప వ్యక్తి ఎవరు?- అనుకున్నాను.

*

బహుశ నన్నుద్దేశించి అన్నమాటలే అవి. అర్థము చేసుకున్న రోమా ఏదో తప్పు చేసిన దానిలా భావిస్తున్నట్టు కనబడింది. ఆ భావాల్ని పసిగట్టి ఏ తప్పూ చేయని రోమాను రక్షించాలనుకున్నాను. నన్నామె కోసమే రోమా తండ్రి ఆహ్వానించేరు. అందుకే ఆమె చేతినందుకొని - 'రోమా! మనము బీచివైపువెళ్దామా!'అంటూ ఆమెను బయటకు తీసుకుపోయాను.

'బయట వర్షం పడ్తోంది. భోజనాలకు ఏర్పాట్లు కూడా పూర్తయినట్లున్నాయి' అందామె. లోపల, నాకు టేబుల్సుపై ఖాళీ గ్లాసులే దర్శనమిచ్చాయి. ఆ పెద్ద హాలులో అక్కడక్కడున్న ఇద్దరో ముగ్గురో ఆహ్వానితులు ఏమీ తోచనివారులా ఉన్నారు. తెల్ల గౌను ధరించిన సినిమానటి, మొదట వున్న చలాకీతనము తగ్గగా, ఇపుడొక, పరుపుపై విశ్రాంతి తీసుకొంటోంది. ఆమెను సంతోషపెట్టే తాపత్రయముతో ఇద్దరు పెద్దమనుష్యులామె పాదాల దగ్గిర కూర్చున్నారు.

ఇంతలో శామ్యూల్ అక్కడకు వచ్చి, భోజనాలకు రావలసిందిగా అందరిని ఆహ్వానించాడు.

* * * *

సాగర తీరంపై రోమా పరుగెడుతోంది. ఇసుకపై ఆమెకాలి గుర్తులు చక్కగా కనబడుతున్నాయి. ఇసుకలోని ముత్యాలనేరుకుంటూ ఇతరుల ననుసరిస్తోంది.

కొబ్బరి తోటల వెనుక చంద్రుడస్తమిస్తున్నాడు. తూర్పున సూర్యోదయంకూడ అవుతోంది. ఆమె ప్రతిరోజు సూర్యోదయ దృశ్యాన్ని చూస్తుంటుంది. సూర్యాస్తమయానికి ముందు, జాలరిపల్లె నుండి స్త్రీ పురుషులు తీరానికి వస్తుంటారు. సముద్రంలో చేపలు పట్టడానికి నావలపై అప్పుడే జాలర్లు వెళ్తారు. అప్పుడప్పుడు అందమైన ఉదయ సూర్యకిరణాల మధ్యగా వాళ్ళు చేపలతో నిండిన నావలతో సముద్రంనుండి తిరిగి వస్తారు. తీరంవెంబడి సంబరమేదో జరుగుతోందా అన్నట్లు, పిల్లలు పెద్దలు ముసలాళ్లు కేకలు పెడుతూ తిరుగుతారు. ఆ వేళలో సముద్ర తీరమంతా జీవకళతో నిండిపోతుంది.

ఈ దృశ్యం రోమాకు అతిసామాన్యమైందే. దాన్ని ప్రతిరోజూ ఆమె చూస్తున్నా, ఆమెకు చాలా ఆనందం కలిగించేదా దృశ్యం. తన ఉనికిని కూడ మరచిపోయేది, వారి మధ్యన గడుపుతున్నపుడు.

విశాలమైన కళ్ళతో చూస్తున్న ఆమె చూపులో సముద్రమంతా ఆమె యింట్లోకి విస్తరిస్తోందా అన్పించేది.

'సముద్ర తీరాన జీవితం ఎంత తేలికైందో, క్రమమైనదో మీకు తెలుసునా? అది అనుభవించి తీరాలిసిందే! సముద్రతీర జీవితానికి, భూమిపై జీవితానికి ఎంతతేడా! అదీ ఒక అనుభవమే. సుమా!' అంది రోమా.

ఇంతలో పెద్ద నిట్టూర్పొకటి విడిచిందామె. నాకామె కండ్లలో సముద్రపు నీడ మెదులుతున్నట్లనిపించింది. అనంత జలరాశిలో, ఇనుపదూలములు, సిమ్మెంటు, ఇటుకలతో కట్టిన భవనాల ప్రమేయము లేని చోట ఎవరి కోసమో, ఆమె వెతుకు తున్నట్లుందామె. అయితే ఆమె ఎవరిని వెతుకుతోంది? రోమా పటేల్ బాగా చదువుకున్న ఈ తరం యువతి. ఎప్పుడూ సందడిగా వుండే బొంబాయి నగరములో హడావుడిగా వుండే ఒక పెద్దింటి అందాల ఆడపడుచు.

ఆమెతో నా పరిచయమెలా అయిందీ మీకు నేనింతవరకు తెలుపలేదు. అలా తెలియకపోవడం కూడ మంచిదనే నా నమ్మకం. ఆకస్మికంగ ఏర్పడిన పరిచయమని తెలిస్తే చాలు. బహుశ మొదటి చూపులోనే మా యిద్దరము ఆకర్షితులమైనాము. సందడిగా వుండే బొంబాయి నగరంలో క్రమశిక్షణ ప్రశాంతతతో కూడిన చక్కని ముఖాకృతి గలిగిన ఆమెను నేనెంతగానో ఆరాధించాను. నా సన్నిహిత మిత్రులలో ఒకామెగా ఆమెను చేర్చుకున్నాను.

"మీ కుటుంబములో ఎవరిలోనూ లేని ప్రత్యేక భావాలు నీకు ఎలా కలిగాయి?-" అని ఆకస్మాత్తుగ ఆమె నడిగాను.

ఆతురతగా ఆమె నావైపు చూసింది. తర్వాత నెమ్మదిగా 'నాలో ప్రత్యేకత వుందా? మీరలా నిజంగానే భావిస్తున్నారా? నా స్నేహితులుకూడ అటువంటి విమర్శలనే చేస్తూ, నన్ను హాస్యం పట్టిస్తుంటారు. నే నెవరి ప్రేమలోనో పడ్డానని చెప్పారు. మీరు నమ్మినా నమ్మకపోయినా సరే, నేనుమాత్రం ఎవరినీ ఆ దృష్టితో చూడలేదు. మనుషులు నిజంగా అనాగరికులు, హింసాపరు లనిపిస్తుంది నాకు. వారి కళ్ళలో ఎంత ఆతురత ఉంటుందని! నాకదంతా అసహ్యం"-

సముద్రపు టావలి గట్టు నుండి వచ్చేమాటల్లా బాధాకరమైన గొంతుతో నెమ్మదిగా చెపుతోందామె.

ఆరకం మనుషులంటే ఆమెకుగల విసుగు. అసహ్యం, ఆమె కళ్ళలో ప్రతిబింబించేవి. 'మెరైన్ డ్రైవ్' వరకు నడిచాము మేము. ఇక్కడ ప్రకృతిని పరిమితముచేసి తమశక్తిని స్థాపించ టానికి మానవ హస్తాలు ప్రయత్నిస్తున్నాయి. సముద్రాన్ని పూడ్చి, పట్టణాన్ని పెంపు చేస్తున్నాయి. మానవ దృష్టికిదొక ఘనవిజయంగా కనబడుతోంది.

"నాకీ 'మెరైన్ డ్రైవ్' అంటే ఎందు కిష్టంలేదో మీకు తెలుసునా?" ఆమెవైపు ఆత్రుతగా చూసాను. 'మనుషులు సముద్రాన్నిక్కడ పూడ్చి తమ ప్రతాపాన్ని చూపిస్తుంటే, తనతలను అదే పనిగా సముద్రం భూమిపైకి తాకిస్తున్నది, చూసారా? సముద్రమంటే ముఖ్యంగా కోణార్క దేవాలయం దగ్గర సముద్రం నాకెంతో యిష్టం.

'నీవు పూరీచూసావా?, కోణార్క కూడా వెళ్ళావా?' ఆశ్చర్యముతో అడిగానామెను.

విరగబడి నవ్విందామె. మీరెందుకలా ఆశ్చర్యపోతున్నారు? సముద్రం భూమినితాకే చాలాచోట్లకు వెళ్ళానునేను. అయితే అట్టి ప్రదేశాలన్నిటికీ వెళ్ళలేక పోయాను.'

'చాలా వింతగావుందే సముద్రం గురించి పరిశోధనేమైనా చేస్తున్నావా?'

విషాదముతో కూడిన చిరునవ్వొకటి వెలువడిందామె పెదవుల నుండి. 'అలాపరిశోధన చేసినా బాగుండేది. సముద్రంలో ఎన్నిప్రాణులున్నాయో? శాస్త్రగ్రంథాలు వీటిని గూర్చి ఏమిచెబుతున్నాయో తెలిసి వుండేది.'

ఇంటివైపు నడక సాగించానునేను. నా బట్టలు తడిసాయి గనుక తొందరగానే నడుస్తున్నాను. కాని ఆమెవేసే అడుగులలో మార్పులేదు. సముద్రం వేపేచూస్తోందామె. భయం లేకుండా అటే వెళ్తోంది. కోపం వచ్చిందినాకు. సముద్రంతో ఎంతవింతైన అనుబంధ మీమెకు! వర్షం పడుతూనే వుండిగాని దానిని పట్టించుకోలేదామె.

రోమాను నేను ఎచ్చటో వెనుకగా విడిచి హోటలు గదికి తిరిగి వచ్చేశాను. ఆమె మరెచ్చటికో వెళుతోంది. రోగులు క్లినిక్‌లో ఎదురు చూస్తుంటారామెకోసం. టెలిఫోనులో ఆమెతో మాట్లాడాలన్నా, అవి పనికి భంగం కలుగుతుంది గనుక, అది సాధ్యపడలేదు.

మరునాడుదయం విమానంలో వెళ్ళేందు కేర్పాట్లు చేసుకుంటున్నాను. అకస్మాత్తుగా టెలిఫోన్ మ్రోగింది. రోమా ఫోనుచేసుంటుందని ఆత్రుతగా రిసీవర్ ఎత్తాను. రోమా తండ్రిగొంతు ఫోనులో వినబడుతోంది. 'గతసాయంత్రం నీతో సముద్ర తీరానికి అమ్మాయి వచ్చిందా'?

నిర్ఘాంతపోయానునేను. 'ఏమిజరిగింది? ఆమెతిరిగి రాలేదా'?

'అవును ఈ ఉదయం సముద్రపుతీరం నుండి తీసుకొనివచ్చాం. పూర్తిగా తడిసి స్పృహ లేకుండా అక్కడే పడుంది రాత్రంతా. స్పృహరాలేదింకా. ఆమెకు తిరిగి స్పృహవచ్చే విషయంలో డాక్టర్లు కూడా సందేహిస్తున్నారు' నెమ్మదిగా అంది అవతలి గొంతు.

'ఆ నేరం నీదేనని'- నామనస్సు చెబుతోంది. ఆయన ఇంకా ఇలా అన్నాడు- 'సముద్రతీరానికి ఆమెనెప్పుడూ మేము ఒంటరిగా పంపించం. ఆ దృశ్యంతో ఆమె పిచ్చిదై ఇంటికి తిరిగిరావటానికి యిష్ట పడదు...'

'కాని, ఆమె ఇట్లా ఎందుకు ప్రవర్తిస్తుంది'- అడిగాను, అతని మాటల కంతరాయం కల్పిస్తూ.

విషాదభరితమైన నవ్వొకటి వినిపించింది. 'మాకు సముద్ర తీరాన రోమా దొరికింది. బహుశా ఆమెతల్లి సముద్రతీరానామెను వదలి,ఆత్మహత్య చేసుకుని వుంటుంది. రోమాకు ఈ విషయమెప్పుడూ తెలియదు. ఆమెకు తెలిసిందల్లా, నా కూతురుగ మాత్రమే. అయినా సముద్రంతో ఆమెకుగల సంబంధం మాత్రం అర్థంలేనిది, వింతైనది. ఎప్పుడూ సముద్రంలోనికి వెళ్ళాలనే కోరుకుంటుంది. సముద్రందిగువగా ఆమె ఏదో కనుగొంటుందేమోనని పిస్తుంది...'

నేనిక భరించలేక పోయాను. ఏమి మాట్లాడాలో తెలియక ఫోను పెట్టేశాను.

టాక్సీకి నా సామాన్లు తీసుకెళ్ళడాని కొచ్చిన 'బాయ్' నావైపు వింతగా చూస్తున్నాడు. నేను కన్నీరు కారుస్తూ మూగగా రోదిస్తున్నానేమో!



# క్రోధనాష్టకము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

క్రోధన నామవర్షమునకున్ లవలేశము నుండకుండుతన్
క్రోధము; సౌమ్యతన్ మిగులఁ గూరిమితోడ ననుగ్రహించుతన్
శ్రీధన ధాన్యవృద్ధిని నశేష జనంబుల; శాంతి మాత్రమే
ఈ ధరణిన్ సమస్తమును నేలెడు నట్టులు చూచుగావుతన్,

క్రూరులపైఁ గరంబుఁ గని క్రోధము క్రోధన! నిర్దయన్ గడున్
వారి నణంచి వేయఁగదె వర్ధిల సజ్జను లెల్లవేళలన్
దూర మొనర్పుమీ కృపను దుస్సహ దుర్జన దుష్టబుద్ధులన్
గౌరవ భంగి సజ్జనుల గాచుచుఁ బ్రోచుచు సాధులోకమున్.

నూతన వత్సరంబవు వినూతన భావములన్ బ్రజాళికిన్
బ్రీతిని గూర్పు మెంతయును భీకరయుద్ధభయంబుఁ బాపుమీ
చేతము లుల్లసిల్లఁగను స్నేహము భ్రాతృత సామరస్యముల్
హేతువులై నిరంతరము నీప్సితసిద్ధిగ నెల్లవారికిన్,

కలిలోఁ దామసరాజసంబులె కడున్ ఖ్యాతింగమున్ వ్యాప్తిమై
కలలోనైనను సత్త్వసంపద యెటన్ గానంగనే రాదు దు
ర్బల దుర్భిక్ష ధురూహలే ప్రబలమౌఁ బాపుల్ సుఖంబందగన్
దలపన్ భీకర కాలమేగతి నెటుల్ దాటింతువో క్రోధనా!

ప్రభు లజ్ఞానులు, గొఱ్ఱెమందలు ప్రజల్; ప్రాజ్ఞుల్ కడున్ మ్లూగ్యులున్;
శుభముల్ కల్గుట యెట్లు క్రోధన! వచస్సుల్ చేఁతలున్ భిన్నముల్
అభముంగాని శుభంబుఁగాని మదులం దజ్ఞాను లూహింపలే
రు భయంబౌ నెటు కాచెదో సుజనులన్ రూఢిన్ గృపన్ గ్రోధనా!

నవవర్ష ప్రభు స్వాగతంబు కడు మాత్సంబైన యధ్యాయమున్
మిపులన్ బ్రీతిని గ్రోధనా మొదలిడన్ మేలౌఁ జుమా! నీకు మా
కు విశిష్టంబుగఁ బ్రాఁతబాటులకు మొగ్గుం జూపకే నీవు చూ
పు వరేణ్యం బగు క్రొత్తపూత సుకవుల్ పూజింప నిన్ గ్రోధనా!

క్రోధన నీదు నామమది గొప్పదెయౌ ధనమున్న దందులో
ఏ ధనమున్న జ్ఞానధనమే యది యౌత పవిత్ర భారతా
రాధన దాననే యగును రమ్యముగా నదె నిల్పు మెల్లెడన్
క్రోధన భారతావనిని నింపుము సర్వధనప్రపూర్ణతన్!

క్రోధన నూతనాబ్దమునకున్ శుభమౌతఁ గరంబుఁ గ్రోధనన్
వ్యాధులు నాధులున్ దొలఁగ భాగ్యము లన్నియుఁ జేకుఱంగ వి
ద్యా ధన ధాన్య వృద్ధుల ననంత సుఖమ్ములు కల్గుఁగావుతన్
బాధలు లేక భూ ప్రజలు భవ్యశుభంబులె యంద మిక్కలిన్!



( 4వ పేజీ తరువాయి )

నెర వేరిందనుకుంటా. ఐతే, ఆదిలో ఈ కళను స్త్రీలకు నేర్పడమేమిటని ఎన్నో విమర్శలకు, హేళనలకు గురైనా- అన్నీ భరించాను. ఇప్పటికీ కూచిపూడిలో ఈ శాస్త్రాన్ని పురుషులు మాత్రమే నేర్చుకుని ఆడడం ఆచారం. భ్రుకుంసులు - అంటే, స్త్రీ పాత్రలను కూడా పురుషులే నిర్వహించడమన్నమాట. ఆత్మ విశ్వాసంతో, దీక్షతో ఎన్నో ఒడు దుడుకులను ఎదుర్కొంటూ ముందుకు సాగాను. ఈ అకాడమీలో శిక్షణ పొందిన వారెందరో నేడు మన దేశంలోనేకాక విదేశాలలో కూడా శిక్షణాలయాలు నెలకొల్పి, ఈ నృత్య కళను దశదిశలా వ్యాపింప చేస్తున్నారు. ప్రజలు టిక్కెట్లు కొని ప్రదర్శనలకు హాజరవుతున్నారు. విదేశాలలో సైతం ఈ నృత్యకళకు గుర్తింపు గౌరవం లభించినందుకు గర్వించని తెలుగువారెవరూ ఉండరు. ఇంకా విరివిగా విశ్వవిద్యాలయ స్థాయికి ఈ నాట్యశాస్త్రం చేరుకోవాలని నా ఆశయం...."

"కళలన్నిటిలో నృత్యకళ పరమోత్కృష్టమైనది, పరమ పవిత్రమైనదీనూ. దుఃఖార్తులకు, శ్రమార్తులకు, శోకార్తులకు, దీనులకు విశ్రాంతిని కలుగజేస్తుంది. ఈ విషయాన్నే భరతుడు 'నాట్యశాస్త్రం' ప్రథమాధ్యాయం నూట పదునాల్గవ శ్లోకంలో -

"దుఃఖార్తానాం శ్రమార్తానాం
శోకార్తానాం తపస్వినాం
విశ్రాంతి జననే కాలే
నాట్యమే తద్భవిష్యతి" అని ప్రవచించాడు."

"అవునండి.... సంగీతాన్నిగాని, సాహిత్యాన్నిగాని వీనులతో గ్రహించి ఆనందిస్తాం. అలాగే శిల్పాన్నిగాని, చిత్రలేఖనాన్నిగాని కనులతో గాంచి తరిస్తాం. ఐతే, నాట్యకళకున్న విశిష్టత వేరు. తనలో లలిత కళలన్నిటినీ ఇముడ్చుకుని - వీనులకు, నయనాలకు, హృదయానికి ఒకేసారి అనిర్వచనీయమైన ఆనందాన్ని సమకూరుస్తుంది, అందుకే—

"నతత్ జ్ఞానం
నసా విద్యా నసాకలా
నా సౌ యోగో నతత్కర్మ
నాట్యేస్మిన్ యన్న దృశ్యతే" అన్నారు. - అంటే నాట్యంలో లేని జ్ఞానం, లేని శిల్పం, లేని విద్య, లేని కళ, లేనియోగం, లేని కర్మ లేనేలేదు నాట్యం సర్వసంపన్నమైన సమాహార కళ. సర్వకళా సారం - అని చెప్తారు.'

"ఈనాడు కూచిపూడితో పాటు భరతనాట్యం, కథాకళి, మణిపురి, ఒడిస్సీ, కథక్ - అని తీరు తీరు నాట్యపద్ధతులున్నాయికదా? వీటన్నిటికీ మూలాధారం నాట్య శాస్త్రమేనంటారా?"

"అవునండి. బ్రహ్మ నాలుగు వేదాలనుండి నాలుగు అంగాలను తీసుకుని, పంచమ వేదంగా సృష్టించి, భరతముని ద్వారా ఈ నాట్య శాస్త్రాన్ని మనకు సంక్రమింప జేశాడని శాస్త్రాలు నుడువుతున్నాయి."

"భరతనాట్యానికి, కూచిపూడి నాట్యానికి తేడా ఏమిటంటారు.?"

"నాట్యశాస్త్ర ప్రకారం" భాగవత 'మేళానాటకం' భరతనాట్యానికీ, కూచిపూడికీ మూలం. ఐతే, ప్రభువుల, ప్రభుత్వ ప్రోత్సాహంతో భరత నాట్యం దక్షిణాదిన అనన్యంగా ప్రాచుర్యం పొందింది. దేవస్థానాలుకూడా పోషించాయి. కూచిపూడి నాట్యం ఆదిలో బ్రాహ్మణ యువకులచే ప్రదర్శింపబడడంవల్ల వీక్షకులకు అంత ఆసక్తిగా ఉండేది కాదు. కూచిపూడి విధానంలో 'సంచార భావాలు' చాలా ఉన్నాయి. వివిధ ముఖ భావాలతోపాటు అతిశీఘ్రగతిన పదవిన్యాసం. అన్నీ ఏకకాలంలో. భరతనాట్యంలో ఇదిలేదు. ఒకసారి భావం, ఒకసారి లయ, అంతే. భరతనాట్యంకన్నా కూచిపూడి నాట్యంలో బాగా వేగం కనిపిస్తుంది. నృత్యశాస్త్రాన్ని మథించి, అందులో వర్ణించబడినట్లుగా రంగపూజాది విధానాలను నిర్దిష్టంగా చిత్రిస్తున్నది కూచిపూడి నాట్య పద్ధతి. అసలు ప్రాచీన కాలంలో మనదేశంలో నాట్యకళ రెండు విధాలుగా ప్రచారమందింది. ఒకటి; నట్టువమేళం - అంటే, దేవదాసి సాంప్రదాయం. స్త్రీలు మాత్రమే అభినయించేవారు. పురుషులు గురువులుగాను, హంగుదారులుగాను ఉండేవారు. దేవదాసీలు దేవాలయాలలో, దేవుని సన్నిధిలో, కల్యాణ సమయాలలో, రాజదర్బారులలో సందర్భాన్నిబట్టి, భక్తి రక్తి సంబంధమైన పదాలను, దరువులను అభినయించేవారు. కేవలం ఏకపాత్రాభినయం. ఇక భాగవతమేళమంటే, భగవత్సంబంధమైన భారత భాగవత పురాణ గాథలను నాటకాలుగా ప్రదర్శించడం. అంచేతనే దీన్ని నాటక మేళమని కూడా పిలిచేవారు. ఇందు నర్తకులే ఎక్కువమంది పాల్గొంటారు. స్త్రీ పాత్రలనూ పురుషులే ధరిస్తూంటారన్నమాట. రెండవ సాంప్రదాయమే నేటి కూచిపూడి సాంప్రదాయం. మరో విషయం కూడా చెప్తారు. నందికేశ్వరుని 'అభినయ దర్పణం' కూడా కూచిపూడి నాట్యానికి లక్షణ గ్రంథం. అది తెలుగు లిపిలో ఉండటం ఒక విశేషం. అందుకే నందికేశ్వరుడు ఆంధ్రుడని విశ్వసింపబడుతున్నాడు. క్రీ.శ. 13వ శతాబ్దిలో రచింప బడిన జాయపసేనాని 'నృత్య రత్నావళి' ఆంధ్రుల నృత్య కళా ఔన్నత్యానికి గీటురాయి. ఈ విధంగా మన రాష్ట్రం నాట్యాధిదేవత నటరాజు నర్తించే ఆదిపీఠమై అలరారుతోంది. అసలు మన రాష్ట్రంలో క్రీస్తు పూర్వమే నాట్యకళ ప్రచారంలో వున్నట్లు హాలుని 'గాథా సప్తశతి' తెలుపుతోంది."

"మీ స్వగ్రామానికి 'కూచిపూడి' అని పేరు రావడానికి ప్రత్యేకమైన కారణమేదైనా ఉంటుందంటారా?"

ఉందన్నట్లు సత్యంగారు వింజామరంలా తల ఊపారు 'పరివాహితం' అభినయిస్తూ "కృష్ణాజిల్లాలోని మా కూచిపూడి చూడడానికి ఒక సర్వసాధారణమైన గ్రామం. 300 కుటుంబాలుంటాయి. ఆ గ్రామానికి ఆ పేరెలా వచ్చిందనే విషయంమీద ఎన్నో భేదాభిప్రాయాలున్నప్పటికీ – అది ఒకప్పుడు కుశీలపురమనే పేరుతో పిలవబడేదనే వాడుక వుంది. కుశీలవులు లేక కుచీలురు–అంటే, దేశ ద్రిమ్మరులైన నటులు. ఈ వాదం చాలా సబబుగానే తోస్తోంది. మొవ్వగోపాల పదాలను రచించిన క్షేత్రయ్యగారి జన్మస్థలమైన మొవ్వ – కూచిపూడి పొలిమేరలోనే వుంది. ఈ క్షేత్రయ్య పద–గీతాల బోధకు కూచిపూడి వారు గురువులై, చాలా కాలంవరకు దేవదాసీలకు నేర్పేవారట. హైందవరాజుల పాలన అంతమొందిన తదుపరి, నవాబుల ఏలుబడిలో మన సంస్కృతికి తగు పోషణలేకుండా క్షీణదశ పట్టినప్పుడు 1685లో గోల్కొండ తానీషా కూచిపూడి యక్షగానం 'భామాకలాపం' తిలకించి మెచ్చి, మమారు వంద ఎకరాల విస్తీర్ణంగల కూచిపూడి మాగాణిని వెంపటి, చింతా, వేదాంతం, హరి భాగవతుల, పసుమర్తి, ఏలేశ్వరపు వంశజులకు అగ్రహారంగా దానమిచ్చారని చెప్పుకుంటారు. కళాపోషకుడుగా వినతికెక్కిన ఆ గోల్కొండ నవాబు అబుల్ హసన్ తానీషా పాలన కిందకు 1672–1687 లో కృష్ణామండలం వచ్చింది."

"కూచిపూడి సాంప్రదాయమనే పేరుతో జగద్విదితమైన 'భామాకలాపం'కు మూలాచార్యుడైన సిద్ధేంద్రుడు యోగి అంటారు కదా? మరి శృంగారభరితమైన కావ్యంగా భామాకలాపాన్ని ఈయన సృష్టించడానికి ఏదైనా కారణముండాలనుకుంటాను?"

"ఉంది!" అన్నారు సత్యంగారు కనుబొమలు రెండూ ముడివేసి 'భృకుటి' ప్రదర్శిస్తూ "కేవలం భక్తిగాని, రక్తిగాని ముక్తిమార్గాలు కావని సిద్ధేంద్రుని నమ్మకం. దీనినే 'మధుర భక్తి సిద్ధాంతం' అంటారు. ఈ యోగి మహా భక్తుడేకాక సకల కళాప్రవీణుడని ప్రతీతి. ఈయన కృష్ణామండలం వారనే చెబుతారుగాని – ఏ గ్రామం వారో ఇతర విశేషాలేమీ తెలియవు. ఈయన ఉడిపివెళ్ళి వైష్ణవ మత గురువు వద్ద సకల శాస్త్రాలూ అభ్యసించి, నాట్యకళా కోవిదుడై తిరిగి వచ్చాడంటారు. 'కృష్ణలీలా తరంగిణి' రచించిన శ్రీ నారాయణ తీర్థులవారికి ఈయన సమకాలీనుడని కొందరి మతం. నాట్యకళాభిమాని అయిన ఈయన సన్యాస స్వీకారానికి 'శ్రీకృష్ణ పారిజాత' రచనకూ సంబంధించిన ఓ కథను చెప్పుకుంటారు.... ఈయన గ్రామమూ, అత్తవారి గ్రామమూ ఏటికి ఇద్దరినీ అద్దరినీ ఉండేవట. గురుకులంలో ఈయన విద్యాభ్యాసం ముగించాక, పునస్సంధాన మహూర్తాన్ని తల్లిదండ్రులు నిశ్చయించి, ఈయన్ని అత్తవారి గ్రామానికి పంపారట. దారిలో ఏరు దాటుతూండగా ప్రవాహం ముంచెత్తుకుంటూ వచ్చింది. ఈయన తల్లి, 'అయ్యో, బ్రతికుంటే సన్యాసమైనా పుచ్చుకుంటునే' అన్నాడట. అంతటితో ఆ ప్రవాహం తగ్గిపోయిందట. వెంటనే ఈయన కావిబట్టలతో వెళ్ళి భార్యకి విషయం చెప్పాక ఆశ్రమస్వీకారం చేసి, ఆ శృంగార విలాసమంతా శ్రీకృష్ణగానంలో తీర్చుకున్నారట. ఇది కల్పితమైనా, వాస్తవమైనా 'పారిజాతం' లో శృంగార ఆధ్యాత్మికాలు రెండూ గంగాసరస్వతుల వలె ప్రవహిస్తుంటాయి."

"ఈయనతో కూచిపూడివారికి పరిచయం ఎలా ఏర్పడింది?"

"ఆ కాలంలో యక్షగానాలు అసంస్కృతులైన వారిచే ఆడబడుతూ, జానపద నాట్యాలతో నిండి, పామరజనానికి మాత్రమే తోడ్పడుతూండేవి. వాటిలో కళాప్రచారానికి తగినంత సావకాశం లేదని తెలుసుకున్న ఈ యోగీంద్రులవారు సత్యభామ విరహబాధను 'శ్రీకృష్ణ పారిజాతం' యక్షగానంగా రచించి, తగిన ప్రయోక్తల కోసం అన్వేషిస్తూ ఒకనాడు కూచిపూడి గ్రామానికి విచ్చేశారు. అక్కడ విద్యాభ్యాసం చేస్తున్న కొందరు విప్రయువకులను చూసి, వారిని వేషధారణకు అంగీకరించమని కోరారు. ఆ రోజుల్లో ద్విజులు వేషం కట్టి, నడిబజారులో నాటకాలాడడమంటే తప్పుగా భావించేవారు. అయినా, ఆ యోగీంద్రుని మాటను తిరస్కరించలేక ఆ యువకులు అంగీకరించారు. వారిని ఆ సిద్ధయోగి అనుగ్రహించి, ఆ యక్షగానాన్ని బోధించి, సంప్రదాయసిద్ధమైన నాట్యరీతులు గరపి వారిచేత ఈ 'భామాకలాపం'ను ప్రదర్శింపజేశారు. ఈ నాటకాన్ని ప్రదర్శించని వరగ్రామమంటూ మన రాష్ట్రంలో ఉండదనడంలో అతిశయోక్తి ఏమీ లేదు. ఈ యక్షగానానికి భాగవతమనీ, ప్రదర్శకులకు భాగవతులనీ పేరు వచ్చింది. క్రమక్రమంగా ఈ కుటుంబం వారికి భాగవతుల వారనే వంశనామం ఏర్పడింది. కాలికి గజ్జెకట్టి రచ్చకెక్కటానికి మొదలుపెట్టిన తర్వాత ఈ భాగవతులకు కళాప్రచారంలో కూడా కుతూహలం పెచ్చుమీరి, నవరచనల కోసం అన్వేషించసాగారు. ప్రచారంలో లేని నాట్య విశేషాలను వెలికి తీసి, వ్యవహారంలో లేని తాళాలను నాట్యప్రయోగంలోకి తీసుకొచ్చి ఇతర విప్రకుటుంబాల వారికీ ఈ కళాప్రచారంలో సావకాశం కలిగించి, కృష్ణాతీరం నుంచి ఈ నాట్యకళా సరస్వతిని కావేరీ, తుంగభద్రా తీరాల వరకు బంగారు పల్లకిలో ఎక్కించి ఊరేగించారు. నేటికీ కూచిపూడి సాంప్రదాయాన్ననుసరించి యక్షగాన ప్రదర్శన చేసే విప్రకుటుంబాలు తంజావూరు మండలంలో ఉన్నాయి. వీరి పూర్వీకులు అక్కడ తమ నాట్యకౌశల్యము చేత తంజావూరు ప్రభువు అచ్యుతప్పనాయకుని రసమయ జగత్తుకు తీసుకెళ్ళి, అక్కడి మేలట్టూరును అగ్రహారంగా పొందారు. 1750 – 1755 ప్రాంతాలలో 'ప్రహ్లాద, రుక్మాంగద, మార్కండేయ చరిత్ర, ఉషాపరిణయం' యక్షగానాలను రచించిన మేలత్తూరు వెంకటరామశాస్త్రిగారు ఆలా ఆ ప్రాంతాలకు వలసవెళ్ళిన కూచిపూడి వారిలో ముఖ్యులు."

"కూచిపూడి వారికి ముందు ప్రచారంలో ఉన్న నాట్యాలు జానపద రీతులలో ఉండేవన్నారే - అంటే, అవి శాస్త్రీయమైన నాట్యాలు కావా ?"

"శాస్త్రీయమైన నాట్యాలు అసలు లేనేలేవని కాదు. ఆ రోజుల్లో సుఖాసీనులై చేసే లాస్యరీతులు కూడా ఉండేవి; ఉద్ధతమైన తాండవ గతులూ ఉండేవి. కాని, ఈ రెండింటినీ సమయానుకూలంగా సమర్థన పరచి ప్రదర్శనలో చూపించేవారు కాదు. ఆనాటి ప్రదర్శనలకు ఆ ఉద్దేశ్యంగాని, అవకాశంగాని లేవట. ఆ సంగతి గుర్తించగల్గిన కూచిపూడి భాగవతులు లాస్య తాండవాలను మేళవించి - హస్త క్రియలను, పాద క్రియలను సందర్భోచితంగా జతపరచి రసోదయం కలిగించడానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నంవల్ల సామాజికులలో రసస్ఫూర్తి కలగడమేకాక, పండితాదరానందాలకు వారి నాటక ప్రదర్శన పాత్రమై - రాజ సంస్థాన ప్రవేశమూ, సన్మానమూ పొంద గలిగింది. కళాదృష్టితో జరిగిన ఈ సంస్కారమేకాక విజ్ఞాన ప్రచారానికి కూడా వారు కొంత సహకారం చేశారు. గోపికా విప్రసంవాదం లేక యజ్ఞపట్టు అనే పేరున పిండోత్పత్తి మొదలు మోక్షప్రాప్తివరకు గల జీవుని దశలను వివరిస్తూ ఒక ప్రసంగం చేస్తారు. అది నాట్య మిళితమై ఉంటుంది....వారంతటితో తృప్తిచెందక పామర జనరంజకం కోసం కూడా కృషి చేశారు. తమిళుల 'కురవంజి' వంటి ఎరుకత వేషం, గొల్లకథ, త్రిపుర సంహారం, దాదినమ్మ వేషం, బాలింతవేషం లాంటి చిన్న చిన్న హాస్య ఘట్టాలు కొన్ని సృష్టించి, నృత్యగానాలతో ప్రదర్శించేవారు. వీటిలో ప్రధానరసం హాస్యమైనా - అంతర్వాహినిగా ఏ తత్త్వమో, ఏ దోషప్రచురణమో కనిపిస్తూ ఉంటుంది.... దోష ప్రచురణమంటే ఒక విషయం గుర్తొస్తుంది. పూర్వం ఈ భాగవతోత్తములు రాయల సంస్థానంలో కేళిక ప్రదర్శనాలకు వెళ్ళారట. ఒక సామంతుని కష్టాలు రాయలవారికి తెలియనివ్వకుండా ఏ ఆస్థానికుడో అడ్డు పడుతూంటే - ఆ సామంతుని కోరికమీద అతని కథను ఒక నాటకంగా రచించి ప్రభువు కొలువులో ప్రదర్శించారనీ, అది చూసి రాయలు ఆ సామంతుని రక్షించి, కూచిపూడి భాగవతులను ఘనంగా సన్మానించారనీ వినికిడి. అలా కూచిపూడివారు నాట్యకళను సాధనంగా చేసుకుని ఒక సాంఘిక ప్రయోజనాన్ని సాధించటం గమనార్హం. కళ' కళకోసమే కాక ప్రజల కోసమనే విషయం సార్థకత చెందింది. 15 - 16 శతాబ్దాలలో శ్రీకృష్ణదేవరాయలు కృష్ణామండలంలోని శ్రీకాకుళం విచ్చేసినపుడు కూచిపూడివారి నాట్యకళకు అచ్చెరువొంది, తనతో కొందరు విద్వాంసులను తీసుకెళ్లి, హంపీలో ఒక రంగస్థలాన్ని నిర్మించి నాటకాలాడించేవారని హంపీ చరిత్రలో పేర్కొనబడింది. వాటిని తిలకించి పులకించిన రాయలచే ముదిగొండ అగ్రహారంతో ఘనంగా సన్మానించబడ్డ నాట్యాచార్యుడు కేళవభట్టు"

"తాళ ప్రకరణలో కూచిపూడి వారు ప్రత్యేక కృషి ఏదైనా చేశారా?"

"కొంత చేశారు. ఆ నాటికీ-నేటికీ వ్యవహారంలో ఉన్న తాళాలే కాక గ్రంథస్థాలై మరుగున పడి ఉన్న చౌక కాలపు తాళాలను ప్రచారంలోకి తీసుకొచ్చారు వాటిలో 'చంచత్పుటం, చాచపుటం, వినాయకతాళం, సింహనందిని ఇత్యాదులు. ఇందులో వినాయక తాళం నేటికీ నాట్యప్రదర్శనలో ఉపయోగపడుతోంది"

"అలాగే కూచిపూడి వారు అనుసరించే ప్రత్యేక రాగాలు ఏమైనా ఉన్నాయా?"

"ఉన్నాయి...' మోహన, ఆనందభైరవి, శంకరాభరణం, షణ్ముఖప్రియ. సహానా, ఆరభి, రఘుపతి, తోడి, మధ్యమావతి, నాట, 'ఖరహరప్రియ' వగైరా."

"కూచిపూడి సాంప్రదాయానికి సూత్రధారం వహించిన ప్రాచీనుల గురించి ఇందాక మీరు చెప్పారు. ఆధునికులగురించి కూడా తెలియజేస్తారా?

"లాస్యరీతి గల అభినయంలో యశస్సు గడించిన వారు చింతా నారాయణగారు. ఇటీవలి కూచిపూడి నటులందరికీ నాట్యాచార్యులు చింతా వెంకటరామయ్యగారు. విశ్వవిఖ్యాత నాట్యాచార్యులైన సర్వశ్రీ ఉదయశంకర్ ఎదుట భామ వేషం కట్టి, తమ పాండిత్య విశేషంచే చకితుల్ని గావించిన వారు వేదాంతం లక్ష్మీనారాయణగారు, ఇంకా చింతా కృష్ణమూర్తి, వెంపటి సత్యనారాయణమూర్తి, వేదాంతం రాఘవయ్య, వేదాంతం జగన్నాథశర్మ, పసుమర్తి కృష్ణమూర్తి, వేదాంతం పార్వతీశం, వేదాంతం సత్యనారాయణ శర్మగార్లు...."

"ఇంతకీ, మీ గురువుగారెవరో చెప్పారు కాదు?"

"మా నాన్నగారు వెంకట చలమయ్యగారికి మా కులవృత్తిపట్ల అంత ఆసక్తి ఉండేది కాదు; వ్యవసాయంతోనే కాలం గడిపారు. మా తాతగారు వెంకటనారాయణగారు సత్యభామభూమిక నిర్వహించడంలో తనకు తానేసాటి అని పేర్గాంచారు. వారిచేత ప్రభావితుణ్ణయ్యాను. ఐతే, నాకు శిక్షణ ఇచ్చిన గురువర్యులు తాడేపల్లి పేరయశాస్త్రిగారు."

"మీ అకాడమీలో శిక్షణ పొందడానికి రుసుము ఏమాత్రం చెల్లించవలసి ఉంటుంది?"

"పేరుకి నెలకు పదిహేనురూపాయలు మాత్రమే. నిజమైన ప్రతిభ ఉన్న పేదవారికి మా గృహంలోనే ఆశ్రయమిచ్చి ఉచితంగా శిక్షణ ఇస్తున్నాను. ధనికులు పేదలు అనే తారతమ్యం లేకుండా ఆంధ్రులు, తమిళులు, కర్నాటకులు, మలయాళీలు, గుజరాతీలు,

పంజాబీలు, కొందరు విదేశీయులు కూడా శిక్షణ పొందారు; పొందుతున్నారు. వీరిలో కుమారి శోభా నాయుడు హైదరాబాద్‌లోని మా నృత్య కేంద్రం శాఖకు నిర్వహణాధికారిణి. ఇంకా – యామినీ కృష్ణమూర్తి సోనల్ మాన్‌సింగ్, లండన్‌లో ఉంటున్న కామదేవ్ – వీరంతా కూచిపూడి నృత్యకళ భారతదేశ పటంలోనేకాక ప్రపంచ పటంలోనే స్థానమాక్రమించుకోడానికి తోడ్పడుతున్నారు, అమెరికా, ఇంగ్లాండ్ మలేషియా, సిలోన్‌లలో కూడా మా శిష్యబృందంలోని వారు చక్కగా శిక్షణ కేంద్రాలను నిర్వహిస్తున్నారు." అన్నారు సత్యం. కొలది నేత్ర వికాసము – అధర చలనము గల హాసం "స్మితము" తో.

"మీ శిష్యురాండ్రలో కొందరు ప్రసిద్ధులైన చలనచిత్ర తారలు కూడా ఉన్నారనుకుంటా?"



శ్రీ వెంపటి చిన సత్యం, శ్రీమతి వైజయంతిమాలబాలి



శ్రీమతి హేమమాలిని, శ్రీ వెంపటి చిన సత్యం

"అవునండి. మొట్టమొదటి విద్యార్థిని చంద్రకళ. ఇంకా–హేమమాలిని, వైజయంతిమాల, రేఖ, మంజుభార్గవి–ఇలా పలువురున్నారు. మంజుభార్గవి బెంగుళూరులో కూచిపూడి నృత్య శిక్షణాలయాన్ని నడుపుతున్నారు."

"మీరింత వరకు ఎన్ని దేశాల్లో ప్రదర్శనలిచ్చారు?"

"టూకీగా చెప్పాలంటే – ప్రపంచంలోని మూడు వంతుల దేశాల్లో. కొన్ని చోట్ల ప్రేక్షకులు మీరు నేర్చుకున్న కళ చాలా గొప్పది. ఆ కళలకు పుట్టినిల్లయిన మీ భారతదేశం ఇంకా గొప్పది. భారతదేశానికి మా జోహార్లు" అంటుంటే, మేను పులకరించినట్టవుతుంది" అన్నారు. సత్యం బాష్పయుక్తమైన హాసం 'అపహసితము'తో.

"ఏ ఏ నృత్య రూపకాలను మీరు ప్రదర్శిస్తూంటారు?"

"శ్రీకృష్ణ పారిజాతం, క్షీరసాగర మథనం, మేనకావిశ్వామిత్ర, శాకుంతలం, కుమార సంభవం, విప్రనారాయణ చరిత్రం, చండాలిక, శ్రీ పద్మావతీ శ్రీనివాసం, కల్యాణరుక్మిణి.... ఈ ప్రదర్శనలకు ఉత్తర అమెరికా, మలేషియాలాంటి దేశాలలో లభించిన ఆదరణ ఇంతా అంతా కాదు. ఇప్పటికి విదేశ ప్రతినిధులెవరైనా విచ్చేస్తే, తమిళనాడు ముఖ్యమంత్రి గౌ॥ ఎం. జి. రామచంద్రన్‌గారు మా కార్యక్రమాలను ఏర్పాటు చేసి ఇతోధికంగా ప్రోత్సహిస్తూనే ఉన్నారు. వారు అస్వస్థులై అమెరికా వెళ్ళడానికి ముందు మా కెన్నో వసతులు కల్పిస్తామన్నారు. ఎటొచ్చీ ఈ కళకు మన రాష్ట్రప్రభుత్వం గుర్తింపు అంతగా లభించ లేదనే కొరత మాత్రం ఉంది. ప్రభుత్వం మంజూరు చేస్తేగాని మా అకాడమీ తన కాళ్ళమీద తాను నిలబడడానికి ఆట్టే తోడ్పడదు. దేశ విదేశాలలో ఇచ్చే ప్రదర్శనలవల్ల ఈ అకాడమీని ఎలాగో ఇంతవరకు నెట్టుకొస్తున్నాం. అకాడమీ విషయం అటుంచితే, భారతీయ సంస్కృతికి, సత్సాంప్రదాయాలకు పట్టుకొమ్మ అయిన కూచిపూడిలోని మూడు వందల కుటుంబాలలో దాదాపు మూడు వేలమంది ఆర్థిక దుస్థితికి లోనైనా – కూ

కులవృత్తిని విడనాడక ఇంకా కృషి చేస్తూనే ఉన్నారు. మా తదుపరి తరం వారు బ్రతుకు తెరువు కోసం ఇతర ఉద్యోగాలు చూసుకుంటే ఈ విశిష్టమైన నాట్య సాంప్రదాయం గతి ఏమౌతుంది? నాటి సంస్కృతీ వైభవానికి ప్రతీకలైన, ప్రతిబింబాలైన లలిత కళలు - కవిత్వం, శిల్పం, చిత్రలేఖనం, సంగీతంతోపాటు నాట్యం కూడా సమున్నతంగా పోషింపబడాలి. ఈ నాట్య వృత్తిలోని సాధకబాధకాలు తెలిసిన వారికి ప్రభుత్వ యంత్రాంగంలో తగిన ప్రాతినిధ్యం లభిస్తే మా పరిస్థితి కొంతైనా మెరుగుపడుతుందేమో. లేదా - కొంతకాలం పోయాక మనం పూర్వపు ఔన్నత్యాన్ని తలచుకుని తృప్తి పడవలసి వస్తుందంతే."



నిజమే. మన సంస్కృతిని మనం కాపాడుకోవాలంటే మన నాట్యాచార్యులకూ ప్రభుత్వ పరంగా స్థానమిచ్చి, సమాదరించి పోషించాలి. అప్పుడే ఈ కూచిపూడి నృత్యం చిరంజీవమై, 'తెలుగువా రందరూ గర్వించేలా' చరిత్ర పుటల్లో అత్యున్నతమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది.

మొత్తం మీద కూచిపూడి నాట్యానికి అంతర్జాతీయ ఖ్యాతి రావాలన్న వెంపటి చిన సత్యంగారి దీక్ష నెరవేరింది. ఇందుకాయన ధన్యులు; ఎంతైనా అభినందనీయులు. ఈ విషయమే చెప్తూ వారి వద్ద నుంచి సెలవు తీసుకున్నాను.

# దోపిడి

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

దోపిడనుచు మనిషి దొర్లాడి పొర్లాడి
గొంతు చించుకొనుట కొత్త తంతు
దార్లుగొట్టి మున్ను ధరణి పాలింపరే?
కంటి నలుసుర పులికంటి మాట!

దొరల మాటలందు దోపిడీతత్త్వము
గంతులిడుచునున్న వింత చూడ
"దొంగ! దొంగ! యనుచు దొంగలరచినట్లు
కంటినలుసుర పులికంటి మాట!

నోరుగట్టి ఒకడు నోళ్ళుగొట్టి ఒకడు
కూడబెట్టుకొనును కోట్ల ధనము
తేనెటీగ శ్రమల తేరకే దోచరా?
కంటినలుసుర పులికంటి మాట!

దోపిడీల విద్య దొరల పరమును చేసి
లేనివాని పరుగు లేడి పరుగు-
కోటి విద్య లెల్ల కూటి కొరకు గాదె?
కంటి నలుసుర పులికంటి మాట!

భాషయొకడే గాదు భావాన్ని సైతము
తస్కరించి వెలుగు ముష్కరుండు
దోపిడీల తీరుదుయ్య బట్టుట జోరు!
కంటి నలుసుర పులికంటి మాట!

కళలములు ముకుళించి కరుణించమని వేడ
నిలువుదోపి డనుచు నిన్ను దోచు
వేల్పులెటుల గారు మేటి దోపిడి గాళ్ళు!
కంటినలుసుర పులికంటి మాట!

# క ల గూ ర గం ప

## విద్వత్కవి సార్వభౌముఁడు -
## కీ. శే. పంతుల బ్రహ్మన్న కవి

కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారి "శతక కవుల చరిత్ర" గ్రంథమునకు సవరించిన కూర్పు 1957 లో ప్రకటింపబడి నది. దీనికి కీ.శే. నిడదవోలు వేంకటరావుగారు పీఠికను వ్రాయుటయే గాక గ్రంథమున కనుబంధముగ నాల్గవ భాగమును జేర్చి దానిలో క్రీ. శ. 1800 నుండి క్రీ. శ. 1950 వఱకు గల కొందఱు శతక కవుల జీవిత సంగ్రహములను వ్రాసినారు. దీనిలో వేంకటరావుగారు కీ శే. పంతుల బ్రహ్మన్న కవిగారి గుఱించి కొన్ని విషయములు వ్రాసినారు.

సాహిత్యాభిమానులకు సారస్వత పరిశోధకులకు నుపకరించునను తలంపుతో, బ్రహ్మన్నగారి గుఱించి వేంకటరావుగారు వ్రాయనివి నాకు తెలిసిన విషయములలో శతక కవులకు సంబంధించినంత వఱకు మనవి చేయుచున్నాను.

"అంతా కవులము గామా
అంతింతో కంద పద్య మల్లగ లేమా
భ్రాంతి పడి పల్కుచుందుము.
పంతులు బ్రహ్మన్న వంటి పండితుడేడీ"

అని సమకాలికులచే మెప్పు బడసిన పంతుల బ్రహ్మన్న పండితుఁడే కాక సంస్కృతాంధ్రములలో గొప్ప కవిగా కూడ ప్రఖ్యాతుఁడై "విద్వత్కవి సార్వభౌముఁడు" అను బిరుదు వహించాడు.

ఈతని కాలము క్రీ.శ 1825 నుండి క్రీ. శ. 1898 వఱకు పీరి నివాసము విజయనగర మండలములోని (వెనుకటి విశాఖమండలము) గజపతి నగరము తాలూకా యందు గల చిట్టాయ వలసాగ్రహారము. తల్లిదండ్రులు సీతమ్మ నరసింహశర్మలు. ఈ దంపతుల యార్గురు కుమారులలో నాల్గవ వారు బ్రహ్మన్న. వీరు అరామ ద్రావిడులు. శతమర్షణ గోత్రజులు.

బ్రహ్మన్నగారు వ్రాసిన ధనంజయ శతకము గుఱించి మాత్రమే నిడదవోలు వారు ప్రస్తావించినారు. కాని బ్రహ్మన్నగారి "కిరినరహరి" శతకము మిక్కిలి ప్రఖ్యాతమైనది ఈ శతకము శ్రీ సింహాచల వరాహలక్ష్మీ నరసింహ స్వామి వారిపై జెప్పినది. దీనికి కొన్ని ప్రత్యేకతలు కలవు.

ఇది ఆశువుగా చెప్పిన శతకము.

"కిరి నరహరి మూర్తి సింహగిరి వరవర్తీ" అని నాల్గవ పాదమంతయు మకుటముగల యేక పాస శతకము.

బ్రహ్మన్నగారి కనిష్ఠ సోదరుఁడు పేరన్న శాస్త్రి. ఈతని అల్లుఁడు నవర గ్రామవాసియైన వేదుల నారాయణమూర్తి బహు శీఘ్ర లేఖకుఁడు. ఒక పర్యాయము నారాయణమూర్తిగారును బ్రహ్మన్న కవిగారును సింహాచలము వెళ్ళినారు. అచ్చట నారాయణ మూర్తిగారు శ్రీ స్వామివారిపై నొక శతకమును జెప్పుమని బ్రహ్మన్న గారిని కోరగా "నే నాశువుగ జెప్పెదను. నేను జెప్పునంత శీఘ్రముగ నీవు వ్రాయగలవా?" అని బ్రహ్మన్నగారడుగగా, నారాయణమూర్తిగారందులకు సమ్మతించెను. ప్రవాహవేగమున బ్రహ్మన్నగారాశువుగ పద్యములను జెప్పగా నారాయణమూర్తిగారావేగమునకు తగినంత శీఘ్రముగ శతకమును లిఖించిరి.

109 కందపద్యములు గల యీ శతకములో దశావతార వర్ణనము కూడ గలదు, కూర్మావతార స్తుతికి తోడు మోహినీ రూప స్తుతి గూడ వ్రాశారు. శ్రీ రామావతార వర్ణనముతో జెప్పిన పద్యముల సంఖ్య యెక్కువ. శైలికి మూడు పద్యముల నుదహరించు చున్నాను.

తరుణారుణ పల్లవ రుచి
శరణములగు తావకీన చరణమ్ముల నా
దరణమ్మున స్మరియించెద
కిరి నరహరి మూర్తి, సింహగిరి వర వర్తీ!

తరణి, శశి, భౌమ, బుధ, సుర
గురు, కవి, శని, రాహు, కేతు గుంఫిత విజయా
కర లాభ గత ఫల ప్రద
కిరి నరహరి మూర్తి! సింహగిరి వర్తీ!

తరళాయిత కౌస్తుభ మణి
సురుచిర దోలా నిషణ్ణ సుస్థిర లక్ష్మీ
పరిరంభణ తత్పరమతి
కిరి నరహరి మూర్తి! సింహగిరి వర వర్తీ!

భక్తి శతకములలోనిది కూడ చెప్పదగినది. ఈ శతకమును నా సంపాదకత్వములో వెలువడిన "అర్షసాహితి" పక్షపత్రికలో తే. 1-6-81 నుండి తే. 15-2-82 వరకు ప్రచురించితిని.

బ్రహ్మన్న కవిగారు రచించిన గ్రంథములు 1. కుముద్వతీ పరిణయము. 2. ఇందుమతీ పరిణయము. ఈ రెండును కావ్యములు 3. కిరినరహరి శతకము 4. ధనంజయ మహా రాజ శతకము. 5. నీల

కంఠేశ్వర కల్యాణము యక్షగానము 6. అష్ట విధ నాయికా పదములు. నిడదవోలు వేంకటరావుగారు గతించిన పిమ్మట శతక కవుల జీవిత సంగ్రహములను సేకరించు కృషి సన్నగిల్లుతున్నది.

మన సాహిత్యములో శతకమొక ప్రత్యేక ప్రక్రియ భాషా యోషకు వెలలేని యాభరణము. కొందఱు మహాకవులు వారు వ్రాసిన కావ్యముల కన్న వారి శతకములే మిక్కిలి ప్రఖ్యాతి గాంచినవి. ఉదా: ధూర్జటి వ్రాసిన శ్రీకాళహస్తీశ్వర శతకము. కూచిమంచి తిమ్మకవి వ్రాసిన కుక్కుటేశ్వర శతకము.

శతక కవుల జీవిత చరిత్రలో జేరని వెనుకటి కవులెందఱో కలరు. వర్తమానమున నెందఱో శతకములు వ్రాయుచున్నారు. వీరి గుఱించి గ్రంథస్థము చేయుట. సాహితీపరుల కర్తవ్యము.

—పూబా

(మిత్రులు శ్రీ పంతుల దక్షిణామూర్తి ప్రసాద్‌కి కృతజ్ఞతతో)

# భగవాన్ రమణ మహర్షి

## ఆంధ్ర భాషా పరిచయం

భగవాన్ శ్రీ రమణ మహర్షికి పూర్వ ఆశ్రమ నామం వెంకట్రామన్. 1979 డిశంబరు 30 తేదీ మధుర సమీపంలోని 'తిరుచ్చుళి' లో అలగమ్మ, సుందరయ్యార్ దంపతులకు వెంకట్రామన్ జన్మించారు. వీరి చిన్నతాతకు తెలుగు తెలుసు. బాలుడైన వెంకట్రామన్‌ను పక్కలో పడుకో పెట్టుకొని కాకు దీర్ఘమిస్తే 'కా' అంటూ గుణింతం నేర్పారు.

1900లో భగవాన్ విరూపాక్ష గుహలో వుండేవారు. గంభీరం వారు శ్లోకాలేమైనా తెలుగులో వ్రాసి ఇవ్వమంటే పుస్తకంలో అక్షరానికి అక్షరం చూచి వ్రాసేవారు. గణపతిముని పరిచయమైన దినాల్లో తెలుగు ధారాళంగా మాట్లాడడం అలవాటయింది.

మహర్షిని తొలుత సేవించిన వారిలో గంభీరం శేషయ్యర్‌గారు ప్రముఖులు. వారిని గురించి మహర్షి ఇలా సెలవిచ్చారు. "గంభీరం వారిది అక్కన్న మాదన్నల వంశం మీరు చాలా కాలంగా తమిళ దేశంలోనే వుంటూ వచ్చారు. కనుక "అయ్యర్" అని పేరు వచ్చింది

తిరుచ్చుళిలో భగవాన్ ఇంటిలోనే ఎడమ భాగంలో వుండే లక్ష్మణయ్యర్ చాలా కాలం తెలుగుదేశంలో ఉద్యోగం చేశారు. అందువల్ల వారికి బాగుగా తెలుగు వచ్చింది. లక్ష్మణయ్యరుపిల్లలు తండ్రిని "నాయనా" అంటూ తెలుగు సాంప్రదాయం ప్రకారం పిలిచేవారట.

భగవాన్‌కు కూడా అదే అలవాటు అయి సుందరయ్యర్‌ను "నాయనా" అని పిలిచేవారు.

లక్ష్మణయ్యరుకు భగవాన్ అంటే చాలా ప్రేమ. అందరూ వెంకట్రామన్ అని పిలుస్తూ వుంటే 'రమణా' అని 'రమణీ' అనీ పిలిచేవారు.

రామయోగి గారి కోరికపై తమిళ ఛందస్సు ననుసరించి కొన్ని ద్విపదలు వ్రాశారు భగవాన్.

గణపతిముని అది చూచి ఇది తమిళ సంప్రదాయం అని తెలుగు ద్విపద గణాలు ఆయనకు తెలియ జెప్పారు.

ఆ గణాల ననుసరించి కొంత మార్చి ఒక సూత్రం వ్రాసి పెట్టమన్నారు. ఆ ప్రకారం వ్రాసిన ద్విపదలను గణపతిముని విని చాలా మెచ్చుకున్నారు. తరువాత బలరామిరెడ్డిగారు సులక్షణ సారం తెచ్చిఇచ్చారు. దానిని బట్టి వృత్తాలన్నీ భగవాన్ క్షణంలో నేర్చారు.

భగవాన్ హంసగీతలో ఒక శ్లోకాన్ని అరవంలో పద్యంగా వ్రాశారు. బలరామిరెడ్డిగారు తెలుగులో కూడా వ్రాయమనినారు. స్వామి ముందు ఆట వెలదిలో వ్రాశారు. నాగమ్మ తేటగీత అయితే బాగుండునని సూచించగా అది ఆట ఇవి తేట అని చమత్కరిస్తూ పద్యాన్ని మార్చినారు.

తే॥ "ఒడలు నశ్వర మదస్థితంబుత్థి తంబొ
కర్మవశమువ విడువడఁ గలయ గలదొ
తన్నెఱింగిన సిద్ధుడు తనువు గనడు
గుడ్డను మదిరామదమున గ్రుడ్డివలెనే"

ఒకసారి సోమసుందరం అనేవారు తన గ్రంథంపై ఏమైనా వ్రాసి ఇవ్వమంటే అరవంలో వ్రాశారు. దానినే నాగమ్మ ప్రార్థనపై ఇలా ఆంధ్రీకరించి ఇచ్చారు.

ద్వి॥ "ఏకమై వెలుగునే హృదయ మందెపుడు
నేకమక్షరము తానెటు వ్రాయగలము.

ఉపదేశసారం ముందు తమిళంలో చెప్పారు. రామయోగి ప్రార్థనపై తెలుగులో చెప్పారు. సంస్కృతంలోనూ, మలయాళంలోనూ వ్రాశారు.

ఉన్నది నలుబదికి కూడా భావం వ్రాశారు. రామయోగి ప్రార్థన పైనే గణపతిముని తమిళ వెణ్బా శక్త ఛందస్సు అని పేర్కొనినారు. దానిని తెలుగులో ప్రవేశపెట్టదలచి కుదరలేదని వదిలివేశారు. నాగమ్మ పట్టుదలవల్ల భగవాన్ మూడు పద్యాలు ముందు తెలుగులో వ్రాసి వాటిని తమిళంలో తామే అనువదించారు.

మరలా రెండు తెలుగున వ్రాశాయి. ఎక్కువ ఎంచదగ్గంగా ప్రసిద్ధిగాంచిన భగవాన్ తెలుగు వెణ్బా మొదటిది ఇలా వుంది.

"తన్ను మఱచి తనువు తానై తలంచి
ఎన్నియో జన్మము లెత్తి తుది - దన్ను
దలిసి తానౌట పలుదేశ సంచార
కలన్మేల్కనుట కను."

భగవాన్ ముందు తమిళంలో వ్రాసిన పుట్టిన దినాన్ని గూర్చి రెండు వెణ్బాలు నాగమ్మగారి ప్రార్థనపై ఇలా తెలుగు చేశారు.

"పుట్టునా డెద్దియో పూనుదురే యుత్సవము
పుట్టమన కెద్దియను బుద్ధిగొని - పుట్టుక
గిట్టుకలేదై వెలుగు కేవల వస్తువులో
పుట్టినదే పుట్టు దినము."
"పుట్టు వాడైనను పుట్టుక కేడ్వక
పుట్టునాడుత్సవము బూనుట - గిట్టిన
పీనుగ నలంకరించి పెట్టుటసి తన్నెఱిగి
యే, న్లయగుటే జ్ఞానమే."

తె... శివరాత్రినాడు తెలుగులో కూడా లింగోద్భవాన్నిగూర్చి ఇలా వ్రాశారు.

కం॥ "తొలి యరుణాచల లింగము
కలిగెను ధనువు లెల్ల నార్ద్రఘన లింగముగన్
వెలిపడు శివుని హరి సురలు
గొలిచిన దినమె శివరాత్రి కుంభపు నెలవౌ"

భగవాన్ తెలుగులో ప్రవేశ పెట్టిన "వెణ్బా" ఛందంలోనే కీ. శే. గుర్రం సుబ్బరామయ్య "ఆత్మబోధ" అనువదించారు. తరువాత ఆచార్య రామచన్ద్ర కౌండిన్యులు కొన్ని కవితలు "వెణ్బా"లో వెలయించారు.

భగవాన్ రమణులకు ప్రధానులైన పరిచారకులలో వెంకటరత్నం సత్యానందమహర్షి ప్రభృతులు వుండేవారు. వారి బోధలు వెలుగులోనికి తెచ్చిన ఆంధ్రులలో గణపతి ముని, మునగాల వెంకటరామయ్య, ఓరుగంటి సోదరులు ప్రణవానంద, గుర్రం సుబ్బరామయ్య, నాగమ్మ, చలం ప్రఖ్యాతులు.

—ఆర్. శ్రీరాములు

# "నవల" శబ్ద వ్యుత్పత్తి విచారం

డా॥ గంటి శ్రీరామమూర్తి గారు (భారతి డిసెంబరు - జనవరి 1984 - 85) నేను చేసిన వ్యాఖ్య సమంజసంగా లేదన్నారు. కోణంకివారి అభిప్రాయమూ పూర్తిగా నిర్దుష్టం కాదన్నారు. ఇక వారే దేమో ? మిగతా అన్య పదాలవలె తెలుగువారు వారి పద్ధతిలో మలచి కొని వుంచే రోడ్డు, టిక్కెట్టు రూలు, బాలు మొ॥ వాటివలె "నోవలు" అనే రూపమో "నావలు" అనే రూపమో సిద్ధించి ఉండేది. "నవల" అనే రూపం సిద్ధించేది కాదు, అని శ్రీగంటివారి సూత్రీకరణ. దీనికి లక్ష్య లక్షణాలేవి ? డు, ము, వు, లు, చేర్చవలెనని శ్రీగంటివారి భావమై వుంటుంది. ఇది తెలుగు. సంస్కృత పదాలకే తప్పనిసరిగా వర్తిస్తుంది. కాని అన్యదేశ్యాలకు నిత్యంగా వర్తింపదు. ఉదాహరణకు జడ్జ్ అనే పదం జడ్జు అనో జడ్జుడు అనో మారాలి కాని జడ్జ్ అనే రూపంతో చెలామణిలో ఉంది. హిప్పి అనే పదానికి బహువచనం హిప్పులు కావలసియుండగా హిప్పీలు అనే పల్కుతున్నారు. నేనొక చోట హిప్పులు అని వ్రాస్తే, అట్లంటే ఏమని విశ్వవిద్యాలయ ఉపన్యాసకులే అడిగినారు. అన్యదేశ్యాలు తెలుగులో చేరినప్పుడు ఉచ్చారణా సౌలభ్యమే మూల ప్రాతిపదిక అని చెప్పవచ్చును. అనేక పారసీక అరబ్బీ భాషాపదాలు తెలుగులో ఈలాగుననే కనబడతాయి.

ఉదా : దస్తఖత్ - దస్కత్తు
జరీబానా / జుర్మానా - జరిమానా / జుల్మానా
జిమ్మేదార్ - జవాబుదారి
కొత్‌మిర్ - కొత్తిమిర
బేవకూఫ్ - బేకూబు ఇత్యాది

అన్యభాషాపదాలు (ముఖ్యంగా ఇంగ్లీషు పదాలు) హలంతాలైతే తెలుగులో డుమువులు వికల్పంగా చేర్చబడవచ్చు అజంతాలైతే, ఆ రూపాలనే స్వీకరిస్తాం హ్రస్వదీర్ఘాల పట్టింపు వుండకపోవచ్చు.

ఉదా : అలెర్జి, ఎనర్జి, ఆబ్జెక్టర్ర, ఎలిబీ, ప్రొవిసో
బాక్టీరియా, ఫార్ములా ఇత్యాదులు.

ఇంతకూ తెలుగులోనికి "నవల" (ఒక సాహిత్య ప్రక్రియపేరు) అనే పదం ఎట్లు ఎక్కడనుండి వచ్చి వుండవచ్చునంటారు శ్రీగంటివారు ? ఇంగ్లీషు వారికీ, ఈ ప్రక్రియ కొత్త కాబట్టి "నావల్" (నవ్యం) అన్నారు. "నవల" అనే శబ్దం "నావల్" నుండే రావలసిన అగత్యమేమి వుంది? ఇంగ్లీషు "నావల్" కూడా ఇటాలియన్ "నావల్లా" అనే పదంనుండి వచ్చినదే అనేది స్పష్టం. మన తెలుగు "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు ఆయె కావున "నవల" అన్నే తెలుగు పదం ఇటాలియన్ "నావల్లా" నుండి వచ్చింది అని వ్యుత్పత్తి చెప్పితే భాషాశాస్త్ర సమ్మతంగా వుంటుంది. తెలుగులో రెండు నవలలున్నాయని అందరికీ ఇప్పుడు సుబోధమే. ఒకటి అల్లసాని పెద్దనగారి "నవల" రెండు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి "నవల" నైఘంటికులు ఈ రెంటిండిని వేర్వేరు పదాలుగా గుర్తించి అర్థవివరణ చేయవలసి వుంటుంది. అని వేరే చెప్పపని లేదు. ఈ పద్ధతి ఇప్పుడున్నదే నిఘంటువులలో ఇటువంటి పదాలను ఉభయములు అని పేర్కొన్నారు.

ఉదా : నామము, కోలి, తలము, తలిదండ్రి
పదములు 'చూ' (శబ్దరత్నాకరము)

"త్రి"

# గ్రంథ విమర్శలు

మూడు గ్రంథాలు

## 1. మహాభారతము-

### ఆనుశాసనికపర్వము

[దానధర్మ పర్వము - ప్రథమాధ్యాయము. తెలుగు సేత - శ్రీ శాంపల్లి - శ్రీరామచంద్రమూర్తి - క్రౌన్ సైజు 10 + 41 పుటలు. వెల 1 రూ. వేదశాస్త్ర పరిషత్తు, పోడూరు - 534327.]

లక్షశ్లోకాత్మకమైన సంస్కృత మహాభారతానికి మూలశ్లోకాలతోసహా తాత్పర్యాన్ని, విశేషవిషయాలను వ్రాసి ప్రకటించాలని శాంపల్లివారి సంకల్పం. ఆ ఆశయంతోనే ఆయన ఆదిపర్వంలోని ప్రథమాధ్యాయాన్ని ఆ రీతినే ముద్రించారట. ఇంతలో సాంగ త్రివేదాచార్య వేదార్థాభిజ్ఞ తంగిరాల ఆగంగాధర శర్మగారు, ఆనుశాసనిక శాంతి పర్వాలు మొదట తీసుకుని, తక్కినవి తర్వాత వ్రాయవచ్చునని సలహా యివ్వగా, వారి సలహాప్రకారం ఆనుశాసనిక పర్వం మొదటి అధ్యాయాన్ని తాత్పర్య విశేషాలతో ఈ పుస్తకంగా ప్రకటిస్తున్నారు. ఇందులో 83 శ్లోకాలున్నవి. పాఠకుల ఉపయోగార్థం ఇందలి విషయానికి సంబంధించిన పద్యాలు తిక్కనగారి భారతంనుంచి గ్రంథం చివర చేర్చబడినవి. ఈ పద్ధతిలో భారతమంతా పూర్తిచేయడానికి ఎన్నో వందల సంపుటాలు, ఎన్నో సంవత్సరాలూ పట్టవచ్చును. వేదవ్యాసమహర్షి శ్రీకృష్ణభగవానుడు సంరక్షకులుగా ఉండి తన మహాసంకల్పాన్ని పూరింపచేయగలరనే విశ్వాసం వ్యాఖ్యాతకు ఉన్నది. విశ్వాసం లేనిదే పని జరగదు. ఇది వ్యాఖ్యారూపంలో ఉన్న మూల గ్రంథానికి 'తెలుగు సేత'' అని ముఖపత్రంలో పేర్కొనడం పొరపాటై ఉండాలి. తాత్పర్యం వచ్చేటు ఒక ఉదాహరణ -

మూలం - శ్లో॥ మృత్యుస్త్వం చైవ షేతుర్హి,
బాలస్యాస్య వినాశనే,
ఉభయం కారణం మన్యే,
నకారణ కుకారణమ్,, (పుట 24)

తాత్పర్యము : ఈ బాలుని మరణమునకు నీవును, మృత్యువును, ఉభయులును కారణమై యున్నారు. కావున ఇద్దరను కారణముగాను, అపరాధులుగాను భావించుచున్నాను. ఏ యొక్కరిని ప్రత్యేకముగా అపరాధిగా కాని, నిరపరాధిగా కాని, తలంపను.

## 2. భక్తపోతన మహాభాగవత రచన

[కృతికర్త విద్వాన్ ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు. డెమ్మిసైజు 18 + 186 పుటలు, వెల. 5రూ.లు. ప్రకాశకులు ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు, ముంగండ, (వయా) అంబాజీపేట, తూర్పుగోదావరి జిల్లా].

గ్రంథకర్త సూర్యనారాయణ శాస్త్రిగారు వేదాధ్యయన పరులు. సంస్కృతాంధ్రాలలో గట్టిపండితులు. పోతనామాత్యుని భాగవతంపైనీ ఆతని భక్తిపైని గౌరవాభిమానాలు అధికం. రమారమి 35 ఏళ్ళక్రింద టనే ఆ భక్త కవిని గురించిన కొన్ని వ్యాసాలను వావిళ్ళవారు ప్రకటిస్తూ ఉండిన "త్రిలింగ" పత్రికలో ప్రకటించారట! పోతన భాగవతాన్ని గురించి సమగ్రపరిశీలన చెయ్యవలెననే ఆసక్తివున్నా, ఉద్యోగంలో ప్రవేశించుటవల్లా కారణాంతరాలవల్లా ఆపని అప్పట్లో సాధ్యంకాకపోయింది. ఉద్యోగం నుండి విరమించి విశ్రాంతి తీసుకున్న సమయంలో ఈ భాగవత పరిశీలన పునః ప్రారంభమయి తమ సంకల్పాన్ని నెరవేర్చుకున్నారు. తత్ఫలితంగా ఈ భక్తపోతన మహాభారత రచన అనే విమర్శ గ్రంథం తయారయినది.

ఇందులో పూర్వరంగం, ఉత్తరరంగం అని రెండుభాగాలున్నవి. పూర్వరంగంలో భాగవత ప్రశస్తి, పోతన శైవమత ప్రియత్వం, అతనికాల, నివాస, గ్రంథాంతర ములను గురించిన చర్చ భాగవతాంధ్రీకరణము ప్రసక్తి వివరించ బడినవి. ఉత్తర రంగంలోని విషయాలే 160 పుటలకు పైగా ఆక్రమించాయి. ఇందులో చాలా శీర్షికలున్నాయి. వాటిలో పోతన భాగవతాంధ్రీకరణ పద్ధతి, పోతన రచనలోని ప్రత్యేకత, కవితా శిల్పం, అక్షరశిల్పం, అనుప్రాసప్రయోగం వర్ణనలు, రసౌచితి, విరుద్ధ రససమ్మేళనం. భక్తి, భాగవతం పుట్టుటకు కారణం, భక్తికి రసత్వం, మధురభక్తి, గోపికా ప్రేమలోని పరమార్థం, పోతన శివకేశవాద్వైతం, పోతన జీవితాదర్శాలు, కొన్ని ఉపాఖ్యానాలు అందలి పరమార్థాలు ప్రధానాంశాలు, ప్రతివిషయంలోనూ సునిసిత పరిశోధన కానవస్తుంది. పోతన నివాసం ఏది ? అనే విషయంలోను, రచించిన గ్రంథాలేవి ? అనే విషయంలోనూ అభిప్రాయభేదాలున్నవి. శాస్త్రిగారు, పోతననివాసం ఓరుగల్లేకాని ఒంటిమిట్టకాదని సకారణంగా నిరూపించారు. అలాగే వీరభద్ర విజయం ఆతని తొలి కృతిఅనీ భోగినీదండకాన్ని అతడు రచించలేదనీ స్పష్టంగా చెప్పారు. ఒక విషయం. భక్తి రసమేకాని భావంమాత్రం కాదనీ, మధుసూదన సరస్వతి తన భక్తిరసాయనంలో ఈవిషయం చెప్పాడనీ

అంటున్నారు. రసాలు తొమ్మిదనే ఆలంకారికుల సిద్ధాంతం. భావం అన్నంత మాత్రాన భక్తికి న్యూనతలేదు. జగన్నాథ పండితరాజు "రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంచితః భావః ప్రోక్తః" అని చెప్పాడు. రతి, ప్రియురాలి విషయంలో శృంగారరసమౌతుంది. అదే దేవ విషయంలో భక్తి, సంతాన విషయంలో వాత్సల్యం అవుతుంది. రసం భావం అనే పేర్లలోనే భేదంకాని, అనుభవంలో వాటికి భేదంలేదు. ప్రణయానికున్న ప్రాధాన్యం భక్తివాత్సల్యాలకి ఉన్నది. అందువల్ల 'భక్తి'ని భావమన్నంత మాత్రాన కొరత ఏమీ లేదు.

ఈ పుస్తకంలో విషయాలన్నీ సుస్పష్టంగా వివరించ బడినవి. దివాకర్లవారి పీఠిక దీనికి ఉన్నది. జటావల్లభుల పురుషోత్తంగారు, మధునా పంతులవారు, వెంపరాల వారు మున్నగువారు దీనిపై సదభిప్రాయాలను ఇచ్చారు. పోతనామాత్యుని, అతని భక్తిభావాన్నిగురించి. తెలిసికోనుటకు ఈ గ్రంథం బాగా ఉపయోగిస్తుంది.

## 3. అభిజ్ఞాన శాకుంతలమ్

[కాటయవేమ భూపతి రచించిన వసంత రాజీయ వ్యాఖ్యానంతో కూడినది. సంపాదకులు శిరోమణి, విద్వాన్ చెలమచెర్ల రంగాచార్యులుగారు, దేవనాగరి లిపిలో ముద్రితం. డెమ్మీసైజు 24 + 180 పుటలు వెల 7 రూ॥లు, ప్రకాశకులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-4.

విశ్వవిఖ్యాతిని పొందిన కాళిదాస మహాకవి అభిజ్ఞానశాకుంతల నాటకానికి ఎన్నో భాషలలో అనువాదాలున్నట్లే వ్యాఖ్యలు కూడా ఎన్నో ఉన్నవి. దాక్షిణాత్య విద్వాంసులు వ్రాసిన వ్యాఖ్యలలో వైఖానస శ్రీనివాసాచార్య వ్యాఖ్య ప్రసిద్ధమైనది. అది తెలుగు లిపిలోనే ముద్రితమై, తర్వాత బొంబాయి ఖేమరాజ శ్రీకృష్ణదాసు కంపెనీవారిచే దేవనాగరి లిపిలో రాఘవ పండితుని వ్యాఖ్యతో కూడా ప్రకటించ బడినది, ఈ వసంతరాజీయ వ్యాఖ్య ప్రాచీనమైనదైనా ఇంతవరకూ ప్రకటించబడినట్లులేదు. ఆ లోపం ఇప్పుడు సంస్కృతాంధ్రాలకు సాటిలేనిసేవచేస్తున్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ముద్రించుట, అందులోనూ యావద్భారతానికే కాక ఖండాంతరాలకు కూడా ఉపయోగించే రీతిని దేవనాగరి లిపిలో చక్కగా ముద్రించడం ఎంతో ప్రశంసనీయమైనది.

పూర్వం తెలుగుదేశంలో వివిధ ప్రాంతాలను పాలించిన రాజులు కవి పండిత పోషకులు మాత్రమే కాక స్వయంగా గొప్ప విద్వాంసులు, వారిలో రెడ్డిరాజులు స్వయంగా సంస్కృతంలో గ్రంథాలను, వ్యాఖ్యలను రచించిన మహామనీషులు. వారిలో కాటయవేమారెడ్డి ఒకరు. కాళిదాసు కావ్యాలపై అసూయాపరులు కువ్యాఖ్యలు వ్రాస్తే, మల్లినాథసూరి చక్కని వ్యాఖ్యలు వ్రాసి మహాకవి హృదయాన్ని చక్కగా వివరించాడు. ఆ రీతిగానే కాటయ వేమారెడ్డి తన వ్యాఖ్యలో వెనుకటి వ్యాఖ్యలలోని లోపాలను, శాకుంతలంలోని అపపాఠాలను సరిచేస్తూ అమూల్యమైన యీ వ్యాఖ్యను వ్రాశాడు. ఈ విషయాన్ని తమ ఆంగ్ల పీఠికలో డాక్టర్ సి. మార్కండేయశాస్త్రిగారు వివరించారు. ఆ పీఠిక యీ వ్యాఖ్యకు మెరుగు పెడుతుంది. వ్యాఖ్య-అవసరమైన చోట వివరంగానూ, ఇతరత్రా సంగ్రహంగానూ సముచిత రీతిని సాగింది. గ్రంథాదిని నాటకంలోని శ్లోకముల అకారాద్యనుక్రమణిక కూడా చేర్చబడినది. సంపాదకులు దీనిని మిక్కిలి శ్రద్ధతో పరిష్కరించి, చక్కగా ముద్రింపించారు. ఆంధ్రదేశీయులకే కాక అన్ని ప్రాంతాలవారికి ఉపయోగించె రీతిని దీనిని ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారభినందనీయులు.

—"ఆంగీరస"

## సత్యధర్మం

[మూలం : సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ. అనువాదం : ఎస్. ఎమ్. ఖాద్రి. క్రౌను సైజు, పేజీలు 35, వెల : రు 1-80. ప్రకాశకులు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్, ఛత్తా బజార్ హైదరాబాద్ - 500002.]

1943 మార్చి 21 న మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది ఢిల్లీలో ఒక విశ్వవిద్యాలయంలోని ఆచార్యులు, అధ్యాపకులు, విద్యార్థుల నుద్దేశించి చేసిన ప్రసంగం – (దీన్ ఎ హక్) కు తెలుగు అనువాదం - సత్యధర్మం పుస్తకం.

"ఇన్నద్దీన ఇన్దల్లాహిల్ ఇస్లామ్" అన్న దివ్య ఖుర్ అన్ సూక్తి ఈ పుస్తకానికి (ఉపన్యాసానికి) ఇతి వృత్తం. "ఖుర్ అన్ ను అర్థం చేసుకునే దృష్టితో అధ్యయనం చేసే వ్యక్తి, ఈ వాక్యం చదివి, ఆగి పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది" అంటారు రచయిత.

అరబీ భాషలోని 'దీన్' అనే పదానికి ఆధిక్యత, అధికారం, విధేయత, దాస్యం, ప్రతిఫలం, విధానం, మార్గం అని అర్థాలు చెప్ప

గమనిక

ఈ సంచికలో ప్రచురింపబడిన ప్రథమ జ్వాల కథ 1924 ఏప్రిల్ భారతి నుంచి పునర్ముద్రితమనీ, "నాటకాంతము" అనే కవితని రాసినవారు శ్రీ ఆర్. యస్. సుదర్శనం అని పాఠకులు గుర్తించగలరు.

బడినవి. అల్లాహ్ దృష్టిలో సరి అయిన, వాస్తవమైన జీవన విధానం ఇస్లాం మాత్రమే !'' అని అల్‌దీన్ (అద్దీన్) కు వ్యాఖ్య యివ్వబడినది

'ఇస్లాం' పదాన్ని ''లొంగిపోవడం, వంగటం, విధేయత స్వీకరించటం, స్వయం, సమర్పణ'' అని వివరించారు. ''దైవం'' తన ప్రవక్తల ద్వారా ఏ మార్గం వైపుకు మార్గదర్శకత్వం చేశాడో ఆ ఆలోచన, ఆచరణ మార్గాన నడవాలి.'' అనే ఖురాన్ ప్రకటన అందించారు రచయిత.

జీవితంలో 'దీన్' కు ఎంతో ప్రాముఖ్యమున్నది. 1. వాంఛ 2. మేధ, 3. పరిశీలన, అనుభవం, 4. గత అనుభవాల చారిత్రక భోగట్టా - 'దీన్' కు మార్గాలుగ చెప్పబడినయి.

ఇస్లామ్ యదార్థానికి అనుగుణంగ ఉండే మతంగ ఉల్లేఖించబడినది. మతానికి విశ్వాసం. స్వయం సమర్పణ అవసరమని చెప్పబడినయి.

ధార్మిక దృష్టితో చదువతగిన పుస్తకమే. కాని చాలచోట్ల రచయిత -'' మానవునికి ఇస్లామ్ ఒక్కటే సరయిన జీవిత విధానం మానవునికి ఇదొక్కటే. సరయిన జీవనమార్గం....మానవునికి ఇదొక్కటే ఋజుమార్గం!'' అంటారు.

కాని అన్ని మతాలవారు తమ తమ మతాలను గూర్చి యిలాగే భావిస్తుంటారు.

''భారతదేశం, ఈరాన్, చైనా మొదలయిన యితర దేశాల్లోని ప్రవక్తల అనుచరులు వివిధ మిశ్రమ కలుషిత వ్యవస్థలు యితర పేర్లతో నిర్మించుకున్నారనేది వేరే విషయం'' అని వ్రాయటం బాగా లేదు.

ధార్మిక ప్రవచనం సమతా దృష్టితో ఉన్నపుడే అధిక విలువ వస్తుంది ''ఇతర మతాలు చులకనయిపోతే మనమతం రాణిస్తుంది.'' అనే భావన రాకూడదు. పైగా పుస్తకము పేరు 'సత్యధర్మం' అంటే త్రికాలాబాధితమైన ధర్మాన్ని చెప్పాలి.'ఇస్లాం' ఔన్నత్యాన్ని వివరించవచ్చుగాని, యితర మతాలను హేళన చేయటం మంచిది కాదు.

కేప్టెన్ షేక్ మౌలాలీ

## హేతువాదం - భావ విప్లవం

[రచన : గుమ్మా వీరన్న, వెల రు. 5-00, ప్రతులకు రావిపూడి వెంకటాద్రి, ఎడిటర్, హేతువాది, చీరాల - 523 156]

హేతువాదం, హేతువాదం - స్వేచ్ఛ, మతాలు, మహిమలు, సృష్టివాదం, సాహిత్యంలో మానవ విలువలు, వ్యక్తి-సమాజం - విప్లవం, స్వేచ్ఛావాదం, భావ విప్లవం అనే వ్యాసాలు 87 పుటల ఈ పుస్తకంలో ఉన్నయ్. హేతువాదం గురించి ఇంతకుముందు వ్రాసిన రచయిత లందరివలెనే యీ రచయిత కూడా ''మౌలికంగా హేతువంటే ప్రకృతిలోని నియమమే (8 వ పుట.) అని చాలా సులభంగా తేల్చేశారు ప్రకృతి నియమబద్ధమైతే, ఆ నియమానుసారమే మానవుడు గూడా ప్రవర్తించవలసి వుంటే ఇక మానవునికి స్వేచ్ఛ ఎలా సాధ్యపడుతుంది. ఈ విధంగా ప్రశ్నించటంలో ఉద్దేశం ప్రకృతి నియమ రహితమైనదని వాదించడం కానే కాదు. మరికొంత వివరణ అవసరమనీ, ఇతరులవలెనే పడికట్టు పదాలను ప్రయోగించి ప్రయోజనంలేదనీ సూచించడమే లక్ష్యం.

అదే విధంగా ఒకానొక దశలో సంభవించిన కొన్ని మూలకాల విశేష సంయోగ ఫలితమే జీవావిర్భావానికీ, మానవ పరిణామానికి మూలకారణమైంది'' అని వ్రాయడం గూడా పరిణామవాదులు - పదార్థవాదులు వ్రాయవలసిన పద్ధతి కాదు. అది ఏ దశయో తెలియనప్పుడు ఆ ప్రస్తావన హేతువాదంలో ఏ విధంగా ఇముడుతుంది ? ''కొన్ని మూలకాలు'' అంటే ఆ మూలకా లేమిటో తెలియనప్పుడు వాటి విశేష సంయోగ ఫలితమే జీవావిర్భవానికి మూలకారణమైనదని ఎలా చెప్పగలం ? ఆ మూలకా లేమిటో ఇంతవరకు తేలలేదంటూ, వాటి జోలికి అసలు పోవడం ఎందుకు ?

''శాశ్వతమైన ప్రకృతి పదార్థాన్నే సత్యమంటున్నారు'' ఈ వాక్యం అర్థం ఏమిటో ? ప్రకృతి పదార్థాలవేర్వేరు అంశాలనియా ? పదార్థం శాశ్వతమైన దవుతుంది. గాని సత్యం ఎలా అవుతుంది ?

''పదార్థ రూపేణా తప్ప భావాలు ఏర్పడే అవకాశమే లేదు'' (10 వ పుట) భావం పదార్థం రూపంగా వుంటుందని భౌతికశాస్త్రం అంగీకరించుతుందా ? భావాల ఉనికి పదార్థం రూపంలో ఉండే వీలున్నది. భావాలు ఏర్పడడానికి పదార్థం ప్రేరకం అయ్యే అవకాశం వున్నది.

''మన మొకసారి ఏర్పరచుకున్న కార్యకారణ సంబంధాన్ని మరెప్పుడూ పునఃపరిశీలనకు గురిచేయకపోతే అదే నమ్మకంగా మారి స్థిరంగా నిలచిపోతుంది'' (18 వ పుట) దీనికి పెద్ద నిదర్శన ఆంధ్ర ప్రదేశ్‌లో హేతువాద పీఠాధిపతులూ; వారి శిష్యులూను, ఇంతేకాదు. ఈ వాక్యాన్ని యీ రచయితయే ఇదే పుస్తకంలో మరోచోట ఖండించుకున్నారు.

''పదార్థం సృజింపబడదు. నాశనం చేయబడదు ( 14 వ పుట) ఇదే సూత్రాన్ని దేవుడికి వర్తింపజేస్తే తప్పవుతుందా ? ఆ దేవుడే అన్నీ చేస్తాడు మనము చేయనక్కరలేదనడం తప్పయితే కావచ్చు. హేతువాదం కాకపోవచ్చు.

"అసలు నీతి అనేది మనిషి అంతరంగానికి జరిగే విన్నపమే (18 వ పుట) ఇదేమి వాక్యం? దీని అర్థం ఏమిటి? నా అంతరంగం ఇలా చెప్పిందని దొంగతనం చేయడం నీతి అవుతుందా? అసలు దొంగతనం అనేదే లేదు అని వాదించే వారికొక నమస్కారం తక్షణ ప్రయోజనాన్ని ఆశించే "వినియోగవాదుల"వుతున్నారని అర్థమవుతుంది, ఇంగ్లీషులోని యుటిల్ టేరియన్స్ అనే మాటకు వినియోగవాదులు సరైన తెలుగుకాదు. అవి అలా ఉండగా తక్షణావసరాలను తీర్చే మార్గాన్ని సూచించలేకపోయిన కారణానికే భౌతికవాదం, హేతువాదం, నవ్యమానవతావాదం గురించి ఇన్ని సంవత్సరాలుగా మేధావులు, "పీఠాధిపతులు" ఇంత ప్రచారం చేసినా ప్రయోజనం తృప్తికరంగా కనిపించడంలేదు.

"ముందుగా మనిషి జీవించి వుండడమే విలువగా మనం గుర్తించవలసిన గాలి" (22వ పుట). మరి కూడు, గుడ్డలను ఆశించడం లక్షలలక్ష్యంగా వుండరాదని మరోచోట ఈ రచయిత వ్రాశాడుగదా! కూడు గుడ్డ లేకుండా హేతువాదులు జీవించగలుగుతున్నారా?

"పునర్జన్మ కథలు, జోతిష్యం, హస్తసాముద్రికం, మొదలు కొన్ని చేతబడులు, దయ్యాలు, దేవతలు. పూనకం మంత్రాలు"(29వ పుట), వీటిని గురించి ఎమ్.ఎన్. రాయ్ అంతటి మేధావియే తటస్థంగా వున్నాడు. పారాసైకాలజీ విభాగాలలో వివిధ విశ్వవిద్యాలయాలలో వీటిని గురించి పరిశోధనలు జరుగుతున్నాయి. వీటిని దేవుడుతో ముడిపెట్టడంతో తగాదాపడవచ్చు నేమోగాని అసలు ఇవన్నీచెత్త అనడం ఏనిర్వచనం ప్రకారమూ హేతువాదం కాజాలదు. కొంతమంది మోసగాళ్లుండవచ్చు "అద్భుత ప్రపంచం" అనే పుస్తకంలో బి.వి. పట్టాభిరామ్ శాస్త్రీయంగా యీ విషయాలను వివరించాడు. ఇక ఆత్మల సంగతి ఎంత తక్కువగా చర్చించితే అంతమంచిది. "ఆత్మలు"కూడా పదార్థ సంబంధమైనవే. లేదని ఎక్కడ ఎప్పుడు తేలిపోయింది? విభూతిబొట్లు, పిలకజుట్టు ధరించే పురోహితుడు గడియారాలు ధరించి మోటారు సైకిళ్ళపై ప్రయాణించరాదని హేతువాదులు వాదించుతారా?

పదార్థం పుట్టుక నాశనం లేనిదని అంగీకరించేవారు దేవుడు స్వయంభువు అని ఎందుకని అంగీకరించలేరు?

అంగీకరించలేరు. ఇలాంటి విషయాలలో ఒక వైఖరిని అంగీకరించి, అలాంటిదే అయిన మరొకవిషయంలో ఆ వైఖరిని అంగీకరించకపోవటం అయోమయానికి నిదర్శనం కాదని హేతువాదం అంటుందా? ఇటువంటి అపభ్రంశాల మయమయిన ఈ పుస్తకానికి ఒక "పీఠాధిపతి" హర్షముద్ర వడిందిగదా! హేతువాదమూ ? ఇన్నునువ్వే కాపాడుకోవాలి. హేతువాదం అనేమాటయే సరయినదికాదు. హేతు దృష్టి వైఖరి అనడం సమంజసం కాదా!

ఏ. ఎస్. అవధాని

# కథాస్రవంతి

[చిరస్మరణీయమైన తెలుగు కథానికల మొదటి సంపుటి సంకలన కర్త : పెనుగొండ లక్ష్మీనారాయణ. ప్రచురణ : ఆ. ప్ర. అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరుజిల్లా శాఖ. డిస్ట్రిబ్యూటర్స్; గౌతమీ పబ్లికేషన్స్. అరండల్ పేట, గుంటూరు-522002. పుటలు : 117 వెల: రు 8/-]

చిరస్మరణీయమైన తెలుగు కథల్ని సంపుటాలుగా వెలువరించే పథకం క్రింద ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరు జిల్లా శాఖవారు ఈ మొదటి సంపుటాన్ని ప్రచురించారు. ఇది ముదావహమైన కృషి. మన పుస్తకవ్యాపారులు పుస్తక ప్రచురణలో ధన లాభం తప్ప మరి ఏ విలువ మీదా దృష్టి సారించడం మానేసిన ఈ తరుణంలో, రచయితలూ, రచయితల సంఘాలూ, యిట్టువంటి కృషికి పూనుకోకపోతే తెలుగు సాహిత్యమే అడుగంటిపోయే పరిస్థితి ఉన్నది. నేడు! తెలుగు కథా ప్రక్రియ, వస్తువులో, శిల్పంలో ఎంతో ఉన్నత స్థాయిని చేరుకున్నది ఈ శతాబ్దిలో. కాని నేడు పత్రికల్లో వస్తున్న కథల్ని చూస్తే తెలుగువారికి అసలు కథ వ్రాయడం చేతనవుతుందా? అని సందేహం కలుగుతుంది ఎవరికైనా. రచన చెయ్యదలచుకున్న యువతీయువకులకు పత్రికల్లోని నాసిరకం కథలు తప్ప, 'క్లాసిక్స్,'గా స్థిరపడిన కథలు లభ్యం కావడమే లేదు! వారేం చేస్తారు? ప్రచురణ సంస్థలు కథాసంపుటులు, సంకలనాలు ప్రచురించడం మానేశాయి! లైబ్రరీలలో పాతకాపీలు చిరిగి పోయాయి, అదృశ్యమయ్యాయి! ఈ గడ్డు పరిస్థితుల్లో తెలుగుకథ కొస ఊపిరితో ఉన్నదంటే, అతిశయోక్తి కాదు! మరే భాషలోనూ యింత దారుణ పరిస్థితి ఉన్నట్లు లేదు ఈ సమయంలో కథాస్రవంతి వంటి సంకలనాలు ఎంతైనా ఆహ్వానించదగినవే.

ఇందులో ప్రసిద్ధ కథకుల రచనలు ఆరింటిని ఎంపిక చేశారు. గురజాడ అప్పారావు 'దిద్దుబాటు' తెలుగులో ఆధునిక కథాప్రక్రియలో తొలి రచన అంటారు. సంఘసంస్కరణ విషయంలో వ్యక్తి సంస్కరణకు, ఆత్మసంస్కరణకు ప్రాధాన్యం యిచ్చినవారు గురజాడ. వస్తువేదైనా, సజీవమైన పాత్ర చిత్రణ చెయ్యడంలో గురజాడను మించినవారు లేరు. ఈ అయిదు పుటల చిన్నకథలో మనల్ని ఆకట్టుకునే పాత్ర సేవకుడైన రాముని పాత్ర! కథా నాయకుడు వారితో జరిపే సంభాషణలోని హాస్యమే ఈ కథకు ప్రాణం. కథ చివర రాముడు అనే మాటలు: "అమ్మా నా మాటినుకోండి. కాలం గడిచినోట్టి. ఆ నోరు యజమాని చెప్పినట్టల్లా యిని పల్లకుండాలి. లేకుంటే మా పెద్దపంతుల్గారు అయ్యగారు కూడా సానమ్మనుంచుగుంటారు. మీ శెవులో మాట, పట్టంలోకి సానెమ్మ వచ్చింది. మరి పంతులు మనసు మనసులో లేదు. ఆపై మీ సిత్తం అంతాను." అలిగి పుట్టింటికి వెళ్ళిన భార్యకు

దాసోహం అందమని కబురు పెట్టబోయిన యజమానితో నౌకరు రాముడు 'అలా కాదు. ఇలా అంటాను' అని పై విధముగా చెప్పడంలో వాడి గడుసుదనమే కాదు. లోకానుభవం, మనస్తత్వ పరిజ్ఞానం, కార్య సాధనా సామర్థ్యం చాలా ఉన్నది! పోతే కథ చివర ఒక సందేహం కూడా వస్తుంది. భర్తకు పాఠం నేర్పడానికి కమలిని వేసిన ఎత్తులో రాముడు కూడా పాత్రధారే అయివుంటాడా? ఇలాంటి ధ్వని స్ఫూర్తి ఈ కథ నుంచి గ్రహించవలసిన శిల్పం.

రెండో కథ అయిన శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి "కలుపు మొక్కలు" సమాజంలో లంచగొండి తనం ఏ స్వరూపంలో ఉంటుందో సమంతంగా ఆవిష్కరించిన గొప్ప వాస్తవిక రచన. ఇందులో కమలం అనే వేశ్య పాత్ర ఉదాత్తత మనల్ని ఆకట్టుకుంటుంది. అలాగే మల్లాది రామకృష్ణశాస్త్రి 'సాని-పాప' కథలోనూ కోకిల అనే పాత్ర ఔన్నత్యం మనల్ని చకితుల్ని చేస్తుంది. సంభాషణల ద్వారా కథ నడిపించడం ఎలాగో ఈ ఇద్దరు రచయితల్నీ అధ్యయనం చేసి నేర్చుకోవలసినది ఎంతైనా ఉంది యువ రచయితలకు.

సోమాజికస్పృహ పేరుతో పేదల్నిగూర్చి వ్రాస్తున్నామనుకునే రచయితలు వేలూరి శివరామశాస్త్రి 'ఒకదే చీర' కథ చదివి పాఠాలు నేర్చుకోవాలి. కరుణకుమార 'కొత్తచెప్పులు' కథ గ్రామీణ హరిజనుల్ని గురించే అయినా నేరమూ-శిక్షా అనే తాత్త్విక దృక్పథం కథకు చేకూర్చిన విశిష్టత గమనార్హం.

పోతే చలం వ్రాసిన కథల్లో ప్రసిద్ధి పొందని '1960' అనే కథ ఈ సంకలనంలో ముద్రింపబడటం ముదావహం. ఏ సమస్యలూ, సంఘర్షణలూ లేని ఆదర్శ సమాజాన్ని ఊహించే దృక్పథాలు చాలానే ఉన్నాయి. అయితే రాజకీయంగా మార్క్సిస్ట్ యుటోపియా, గాంధీ యుటోపియా యిప్పటికి చర్చింపబడుతూనే ఉన్నాయి. గాంధీ యుటోపియాను గూర్చిన వ్యంగ్య రచన '1960' అనే కథ. "ఆకలి ఉంటేగానీ భోజనం రుచించదు.... కాంపెటిషన్, ఈర్ష్య, వ్యభిచారం, యివన్నీ పోతే జీవితం యిట్లా అయింది.... పూర్వం సంపన్నులైన వాళ్ళకి జీవితం ఎంత అర్థవిహీనంగా ఉండేది. ఏం తోచేదికాదు. యత్నమూ, కోర్కె, ఆశయమూ లేకపోవడం వల్ల యిప్పుడు ఆ తోచకపోవడం, అర్థం లేకపోవడ మనే బాధ సర్వసామాన్యమైంది.... సినిమాలూ ఎవడూ చూడడు." ....'జీవితానికీ, కళకీ సంబంధం ఉంటేగాని కళని అనుభవించలేము. స్ట్రగుల్, యత్నం, జీవితంలో లేకపోతే, ఎవరెన్నా కళను శిల్పించినా, అది ప్రజలకు రుచించదు. "అసలు యుటోపియాను ఊహించడమే బుద్ధితక్కువ అంటూ జీవన రహస్యాన్ని తేల్చి చెప్పే కథ యిది. ఎంపిక చేసిన ఆరు కథలూ వాటి రచనా కాలం నాటి సమాజజీవితాన్ని ఆవిష్కరించేవే కావడం, ఈ సంకలనం ప్రత్యేకత. సంపాదకులకు అభినందనలు.

ఆర్. ఎస్.

# తత్త్వత్రయము

ప్రాప్తిస్థానం : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు: 521207 కృష్ణాజిల్లా వెల : రు. 10/-

మూల గ్రంథ రచయిత పిళ్ళ లోకాచార్యులవారు. ద్రవిడ భాషలో అనుగ్రహించినది ఈ 'తత్త్వత్రయము'

ఆంధ్ర సూత్రానువాదం కీ॥శే॥ శ్రీ మాన్ కొండూరి తిరుమల జగన్నాథాచార్యులవారి 'తత్త్వత్రయామృతం'

జగన్నాథాచార్యులవారి పుత్రుడు 'శ్రీ చరణ రేణువు' సమకూర్చినది 'అమృతసారం' అనే లఘు వివరణ.

ఇది మూర్తి త్రయాత్మకం. చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు-యీ మూడి తత్త్వాన్ని చెప్పే గ్రంథం ఇది.

14 వ శతాబ్దినాటి శ్రీ వైష్ణవ శిరోమణులలో శ్రీ పిళ్ళ లోకాచార్యులు వేదాంత దేశికులు విశిష్టాద్వైత ప్రవృత్తికి జీవగర్రలు. ఈ పిళ్ళ లోకాచార్యులు స్వతంత్ర వ్యక్తిగా యీయన జీవిత చరిత్ర చెప్తుంది. ఈ ఆచార్యవర్యుని ద్రవిడ కృతికి తెలుగులో శ్రీ కొండూరి వారు సూత్ర పక్కిని అనువదించగా యీయన కొడుకు శ్రీ చరణ రేణువు ఆ సూత్రాల సారం అమృత ధారగా తెలుగువారికి విందు చేశారు.

చైతన్యముగల జీవుని స్వరూప స్వభావాలు వర్ణించినది చిత్ప్రకరణం. అచిత్పదార్థవివృతి అచిత్ప్రకరణం. సర్వనియంత, కరుణాపయోధి అయిన ఈశ్వరుని స్వరూప స్వభావ విశేషాలు చెప్పినది 'ఈశ్వర ప్రకరణం-'

చిత్తు-చైతన్యము : జ్ఞానము, జ్ఞానముగల వస్తువు, జ్ఞానవంతము అదే ఆత్మ, లేక జీవాత్మ.

అచిత్తు. జ్ఞాన శూన్యమైనది. దానిని ప్రకృతి, మాయ, అవిద్య అని కూడా పేర్కొనుచున్నను.

చిత్తుకు, అచిత్తుకు కూడా నియామకుడు ఈశ్వరుడు. జన్మ జరా మరణాత్మక సంసార చక్రమున కొట్టుకొను చిత్తుకు మోక్షమిచ్చు వాడు ఈశ్వరుడే సర్వేశ్వరుడు. అతడే శ్రియః పతి. శ్రీమన్నారాయణుడు.

ఇది శ్రీ పాదరేణువు వివరణ దుర్గ్రాహ్యమైన తాత్త్విక విషయాన్ని శ్రీ పాదరేణువు సులభ గ్రాహ్యంచేసి తన వివరణకి పెట్టిన పేరు సార్థకం చేసుకున్నారు.

విశిష్టాద్వైత జిజ్ఞాసువులే కాక సర్వులునూ ఆస్తిక బుద్ధికలవారు చదివి తెలుసుకోదగిన తాత్త్విక గ్రంథం.

చాసోహం [illegible]మని కబురు పెట్టబోయిన యజమానితో నౌకరు రాముడు 'అలా కాదు. ఇలా అంటాను' అని పై విధముగా చెప్పడంలో వాటి గడుసుదనమే కాదు. లోకానుభవం, మనస్తత్వ పరిజ్ఞానం, కార్య సాధనా సామర్థ్యం చాలా ఉన్నది! పోతే కథ చివర ఒక సందేహం కూడా వస్తుంది. భర్తకు పాఠం నేర్పడానికి కమలిని వేసిన ఎత్తులో రాముడు కూడా పాత్రధారే అయివుంటాడా? ఇలాంటి ధ్వని స్ఫూర్తి ఈ కథ నుంచి గ్రహించవలసిన శిల్పం.

రెండో కథ అయిన శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి "కలుపు మొక్కలు" సమాజంలో లంచగొండి తనం ఏ స్వరూపంలో ఉంటుందో సమంతంగా ఆవిష్కరించిన గొప్ప వాస్తవిక రచన. ఇందులో కమలం అనే వేశ్య పాత్ర ఉదాత్తత మనల్ని ఆకట్టుకుంటుంది. శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి 'సాని-పాప' కథలోనూ కోకిల అనే ఔన్నత్యం మనల్ని చకితుల్ని చేస్తుంది. సంభాషణల ద్వారా నడిపించడం ఎలాగో ఈ ఇద్దరు రచయితల్నీ అధ్యయనం చేసి నేర్చుకోవలసినది ఎంతైనా ఉంది యువ రచయితలకు.

సామాజికస్పృహ పేరుతో పేదల్నిగూర్చి వ్రాస్తున్నామనుకునే వాళ్ళు వేలూరి శివరామశాస్త్రి 'ఒకటే చీర' కథ చదివి పాఠాలు నేర్చుకోవాలి. కరుణకుమార 'కొత్తచెప్పులు' కథ గ్రామీణ హరిజనుల్ని గురించే అయినా వేరమూ-శిక్షా అనే తాత్త్విక దృక్పథం చేకూర్చిన విశిష్టత గమనార్హం.

పోతే చలం వ్రాసిన కథల్లో ప్రసిద్ధి పొందని '1960' అనే కథ ఈ సంకలనంలో ముద్రింపబడటం ముదావహం. ఏ సమస్యలూ, సంఘర్షణలూ లేని ఆదర్శ సమాజాన్ని ఊహించే దృక్పథాలు చాలానే ఉన్నాయి. అయితే రాజకీయంగా మార్క్సిస్ట్ యుటోపియా, గాంధీ యుటోపియా యిప్పటికీ చర్చింపబడుతూనే ఉన్నాయి. గాంధీ యుటోపియాను గూర్చిన వ్యంగ్య రచన '1960' అనే కథ. "ఆకలి ఉంటేగాని భోజనం రుచించదు.... కాంపెటిషన్, ఈర్ష్య, వ్యభిచారం, యివన్నీ పోతే జీవితం యిట్లా అయింది.... పూర్వం సంపన్నులైన వారికి జీవితం ఎంత అర్థవిహీనంగా ఉండేది. ఏం తోచేదికాదు. యత్నమూ, కోర్కె, ఆశయమూ లేకపోవడం వల్ల యిప్పుడు ఆ తోచకపోవడం, అర్థం లేకపోవడ మనే బాధ సర్వసామాన్యమైంది.... సినిమాలూ ఎవడూ చూడడు." .... "జీవితానికీ, కళకీ సంబంధం ఉంటేగాని కళని అనుభవించలేము. స్ట్రగుల్, యత్నం, జీవితంలో లేక పోతే, ఎవడన్నా కళను కల్పించినా, అది ప్రజలకు రుచించదు. "అసలు యుటోపియాను ఊహించడమే బుద్ధితక్కువ అంటూ జీవన రహస్యాన్ని తేల్చి చెప్పే కథ యిది. ఎంపిక చేసిన ఆరు కథలూ వాటి రచనా కాలం నాటి సమాజజీవితాన్ని ఆవిష్కరించేవే కావడం, ఈ సంకలనం ప్రత్యేకత. సంపాదకులకు అభినందనలు.

—ఆర్. ఎస్.

# తత్త్వత్రయము

ప్రాప్తిస్థానం : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు: 521207 కృష్ణాజిల్లా వెల : రు. 10/-

మూల గ్రంథ రచయిత పిళ్ళె లోకాచార్యులవారు. ద్రవిడ భాషలో అనుగ్రహించినది ఈ 'తత్త్వత్రయము'

ఆంధ్ర సూత్రానువాదం కీ॥ శే॥ శ్రీ మాన్ కొండూరి తిరుమల జగన్నాథాచార్యులవారి 'తత్త్వత్రయామృతం'

జగన్నాథాచార్యులవారి పుత్రుడు 'శ్రీ చరణ రేణువు' సమకూర్చినది 'అమృతసారం' అనే లఘు వివరణ.

ఇది మూర్తి త్రయాత్మకం. చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు—యీ మూడి తత్త్వాన్ని చెప్పే గ్రంథం ఇది.

14 వ శతాబ్దినాటి శ్రీ వైష్ణవ శిరోమణులలో శ్రీ పిళ్ళె లోకాచార్యులూ వేదాంత దేశికులూ విశిష్టాద్వైత ప్రవృత్తికి జీవగర్రలు. ఈ పిళ్ళె లోకాచార్యులు స్వతంత్ర వ్యక్తిగా యీయన జీవిత చరిత్ర చెప్తుంది. ఈ ఆచార్యవర్యుని ద్రవిడ కృతికి తెలుగులో శ్రీ కొండూరి వారు సూత్ర పక్కిని అనువదించగా యీయన కొడుకు శ్రీ చరణ వేణువు ఆ సూత్రాల సారం అమృత ధారగా తెలుగువారికి విందు చేశారు.

చైతన్యముగల జీవుని స్వరూప స్వభావాలు వర్ణించినది చిత్ప్రకరణం. అచిత్పదార్థవి వృతి అచిత్ప్రకరణం. సర్వనియంత, కరుణాపయోధి ఆయిన ఈశ్వరుని స్వరూప స్వభావ విశేషాలు చెప్పినది 'ఈశ్వర ప్రకరణం-'

చిత్తు-చైతన్యము : జ్ఞానము, జ్ఞానముగల వస్తువు, జ్ఞానవంతము అదే ఆత్మ, లేక జీవాత్మ.

అచిత్తు. జ్ఞాన శూన్యమైనది. దానిని ప్రకృతి, మాయ, అవిద్య అని కూడా పేర్కొనవచ్చును.

చిత్తుకు, అచిత్తుకు కూడా నియామకుడు ఈశ్వరుడు. జన్మ జరా మరణాత్మక సంసార చక్రమున కొట్టుకొని పరిభ్రమించు జీవుడు ఆ ఈశ్వరుడే సర్వేశ్వరుడు. ఆతడే శ్రియఃపతి. శ్రీమన్నారాయణుడు.

ఇది శ్రీ పాదరేణువు వివరణ దుర్గ్రాహ్యమైన తాత్త్విక విషయాన్ని శ్రీ పాదరేణువు సులభ గ్రాహ్యంచేసి తన వివరణకి పెట్టిన పేరు సార్థకం చేసుకున్నారు.

విశిష్టాద్వైత జిజ్ఞాసువులే కాక సర్వులునూ ఆస్తిక బుద్ధికలవారు చదివి తెలుసుకోదగిన తాత్త్విక గ్రంథం.